ఉచితం



మీరు కొనుగోలు చేసే ప్రతి
ఆక్సో డ్రాయరుకు ఆక్సో బనియన్ ఉచితం!
రెండు ఆక్సో బనియన్లకు
ఒక ఆక్సో బనియన్ ఉచితం!!

OXO
BRIEFS & VESTS

CDC OA16

## గమనిక

డా. జయదుబాషీ అమెరికా సంయుక్త రాష్ట్రాల పర్యటనలో ఉన్నందువల్ల ఈవారం కూడా వ్యాఖ్యలేఖ ప్రచురించలేకపోతున్నాము —సం

## ముఖచిత్రం

నటి రాధిక ముఖచిత్రం చూడ ముచ్చటగా వుంది భారత నారీకిగల కట్టు, బొట్టు, జుట్టు మొదలైన హంగులన్నీ తీరుగా వున్నాయి ముఖచిత్రం పత్రిక ప్రత్యేకత అని చాటి చెప్పగలను

-మరువాడ సూర్యప్రకాశం, కాశీబుగ్గ

## వేయిపడగలు

"వేయిపడగలు" నవల ఆసక్తిదాయకముగా క్రొత్త మలుపు తిరుగుతూ మాలో ఆనందం, ఆసక్తిని పెంచుతుంది

-ఎస్ శ్రీనివాసరావు, ఖర్గపూర్

## సీరియల్స్

డాక్టర్ కొత్త రవీంద్రబాబుగారి "ప్రేమసాగర మథనం" సీరియల్ ప్రతి వారం ఆత్రుతతో ఎదురు చూసేలా వుంటోంది --దండెం రాజయ్య, దోర్నకల్

## కథలు

3-9 జూలై '87 సంచికలో వెలువడిన 'కొడుకా నువ్వు చెడిపో' కథ చాలా బాగుంది ఇందులో కొడుకు ప్రవర్తన స్త్రీలోలుడైన ముసలి తండ్రికి కనువిప్పు కలిగించింది.

-ఎన్. ఉమామహేశ్వరరావు, ఖర్గపూర్

★ ★ ★

నటి రాధిక ముఖచిత్రంతో వెలువడ్డ 3-9 జూలై '87 సంచిక అత్యంత రమణీయంగా ఉన్నది కథలలో "కొడుకా నువ్వు చెడిపో" చాలా బాగున్నది.

-జె సుబ్రహ్మణ్యశాస్త్రి, జక్కరసకుప్పం

★ ★ ★

3-9 జూలై పత్రికలో కళాని కమలగారి 'జాతకం', సి వి సర్వేశ్వరశర్మ, చావలి శ్రీరామకుమార్ గారి 'కనిపించని న్యాయం కథలు నేటి మన సమాజంలో సంఘటనలకి దగ్గరగా ఉన్నాయి

-కుమారి పెయ్యేటి చాముండేశ్వరి, చిలకలూరిపేట

★ ★ ★

# ఉత్తరాలు


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

31 జూలై-6 ఆగస్టు, '87

శ్రీ ప్రభవ నామ సం శ్రావణ శు పంచమి

సంపుటము 79 : సంచిక 48

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యనిర్వాహక (వర్కింగ్) సంపాదకుడు

ఘంటసాల మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## కొత్త రాష్ట్రపతిగా ఎన్నికైన శ్రీ ఆర్. వెంకటరామన్



(ఫోటో: ఎం. ఎ. నాగేశ్వర్)

## విషయానుక్రమణిక

ముఖచిత్రం .

నటి చిత్ర

(ఫోటో కాజాస్)

# మరోకారంచేడుగా మారిన నీరుకొండ











గుంటూరు జిల్లాలోని మంగళగిరి మండలంలో ఉన్న నీరుకొండ గ్రామం హరిజన వాడపై జూలై 15న అగ్ర వర్ణాలకి చెందిన దాదాపు 200 మంది మారణాయుధాలతో దాడిచేసి బీభత్సాన్ని సృష్టించారు. అమానుష మైన ఈ దాడిలో మన్నె శేషయ్య అనే వృద్ధుడు అక్కడి కక్కడే మరణించాడు. మరో నలుగురికి బలమైన గాయాలు తగిలాయి. గాయపడిన శ్రీ సికా నాగేశ్వరరావు, శ్రీ చుక్కా వీరాస్వామి, కుర్రా రోశయ్య, శ్రీ బెజ్జం జీవరత్నం మంగళగిరిలోని ప్రభుత్వ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. 1983 నుంచీ తాము కాంగ్రెసు (ఐ) పార్టీకి వోటు వేస్తున్నామన్న కక్షతో అగ్రవర్ణాలవారు గతంలో కూడా రెండు సార్లు తమ ఇళ్ళు, గడ్డివాములు తగలబెట్టి ఇదే విధంగా కొట్టారని గాయపడిన వారి బంధువులు అన్నారు. ప్రతిసారీ పోలీసుల దృష్టికి తీసుకు వెళ్ళినా, రక్షణకోసం అలమటించినా వారి నుంచి ఎలాంటి సహాయమూ అందలేదని, అదిలోనే పోలీసుల రక్షణ ఉండి ఉంటే ఇప్పుడీ ఘోరం జరిగి ఉండేది కాదని బాధితులు అన్నారు. □

"కనిపించని న్యాయం" కథ చాలా బాగుంది. రచయితలకు నా ధన్యవాదాలు. కథలో రేడియోలో వెంకటరెడ్డి ప్రసంగం ఆలోచింపజేసే విధంగా ఉంది.

-ఎం. ఎస్. ఆర్ వరప్రసాద్, రాజమండ్రి

★ ★ ★

"స్థితప్రజ్ఞుడు" కథ బాగా నచ్చింది. అపకారికి కూడా ఉపకారం తలపెట్టే డాక్టర్ రాఘవ పాత్ర రచయిత చక్కగా వర్ణించినారు.

-కె. ఎన్. వి. రవికుమార్, మైలవరం

## ధర్మపథం

ధర్మపథం - జ్ఞాని - అజ్ఞాని ఇరువురి ప్రవర్తనలు ఎలా వుంటాయో! జ్ఞానిలో వుండే సింప్లిసిటీ, అజ్ఞానిలో వుండే అహంభావం తేడా ఎలాంటిదో వివరించారు.

-హిమబిందు, నాగినీప్రియ, దోర్నకల్ □




## ఉదయం అయిదు గంటలు కావస్తోంది.

## తూర్పున వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి.

భాస్కరుడు తల్లి గర్భంలోంచి బైటికొస్తున్న గుర్తుగా పరిసరాలు ఎర్రబారాయి.

తోటలోని పక్షులు రెక్కలు టపటప కొట్టుకుంటూ బద్ధకంగా లేస్తున్నాయి ఆహారం కోసం వెళ్ళడానికి.

ఉదయ కిరణాలు పడకుండానే నిద్రలో మునిగిన జీవకోటి ఒకటొకటిగా మత్తు వీడి ఒళ్ళు విరుచుకుంటున్నాయి.

తోట పక్కనున్న చెరువులోని తామరపూలు, తమ ప్రియుడైన కమల బాంధవుడికోసం ఆశగా, ఆతృతగా ఆకాశంలోకి చూస్తున్నాయి.

# మంజీరనాదం

మరి కొన్ని ఘడియల్లో సూర్యుడు రానే వచ్చాడు. తోటలోని పూలన్నీ పకపకలాడుతూ విచ్చుకున్నాయి.

తోట మధ్యగా వున్న అందమైన భవంతిలోని ఓ గదిలో నిద్రపోతున్న అరవింద్ మాత్రం లేవలేదు.

సూర్యుడు ఒక్కసారి ఒళ్ళు విరుచుకున్నాడు. కిటికీలోంచి కొబ్బరి ఆకులమధ్య నించి తప్పించుకొచ్చిన రవి కిరణాలు చెంపను తాకి చురుక్కుమనిపించడంతో తప్పనిసరిగా లేచాడు అరవింద్.

'భట్టూ!'' అన్నాడు మంచంమించే.

"వస్తున్నా సర్!' అన్నాడు భట్టు లోపల్నించే.

అరవింద్ నడుం మంచంమీద మరం వేసుక్కూర్చున్నాడు.

అయిదు నిమిషాల్లో కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యాడు భట్టు. అతని చేతిలోని కప్పు అందుకుని మంచంమీదే సర్దుక్కూర్చున్నాడు అరవింద్.

భట్టు చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

కాఫీ తాగి కప్పు అతని కిచ్చేశాడు అరవింద్.

అయితే అతను కప్పు తీసుకుని వెళ్ళిపోలేదు. అలాగే నిల్చున్నాడు. అతని మొహం చూసిన అరవింద్‌కి అతనేదో అడగాలనుకుంటున్నాడని అర్థం అయింది.

"ఏమిటోయ్ భట్టూ?" అన్నాడు నవ్వుతూ.

భట్టు ఆ ఇంట్లో నౌకరే అయినా అలా అనిపించదు ఎవరికీ. ఆ ఇంట్లో ఓ మెంబర్లా, ఓ శ్రేయోభిలాషిలా వుంటాడు. అతనంటే ఆ ఇంట్లో అందరికీ అభిమానం.

అతను సంకోచించడం చూసి,

"ఏం కావాలి భట్టూ?" మళ్ళీ అడిగాడు అరవింద్.

మీరు వూరెళ్ళేది రేపేకదూ?" మెల్లగా అన్నాడు భట్టు.

అవును. ఏం?" నవ్వుతూ అన్నాడు అరవింద్.

నేను కూడా మీతో రావద్దూ?"

నువ్వా?" ఆశ్చర్యంగా చూశాడు అరవింద్.

'అవును సర్!' .

అసలు నేనెక్కడికెళ్తున్నాననుకుంటున్నావ్?"

తెలుసు. "

ఎక్కడికి?

'ఏవో ఖనిజాలుండే చోటుకి!'

అయితే నువ్వెందుకు?

మీరు చూసే ఖనిజాలు నాకూ చూడాలనివుంది. అదిగాక మధ్యలో పెద్ద అడవి, లోయలు, కొండలు ఎంతో అందంగా, ఆకర్షణీయంగా వుంటాయని విన్నాను. నేనొస్తే అవి చూసినట్టూ వుంటుంది, మీకు కాస్త సహాయంగానూ వుంటుంది." వేడికోలుగా అన్నాడు భట్టు.

క్షణం మౌనంగా వుండిపోయాడు అరవింద్.

'ఏం సర్. రానా?" ఆశగా అడిగాడు భట్టు.

'మరి నువ్వు నాతో వస్తే .. ఇక్కడెలా?"

'పర్లేదు. అయ్యగారితో ఏదో ఒకటి చెప్పి వస్తాను. అంతగా కాకపోతే పనివాళ్ళతో నేను లేని ఈ నాలుగు రోజులూ ఇక్కడే వుండిపొమ్మని అడుగుతాను!"

"సరే! అలాగే తీసికెళ్తాను కానీ ఇప్పుడుకాదు!' ఏదో ఆలోచిస్తూ అన్నాడు అరవింద్.

"మరెప్పుడు?" అన్నట్టు చూశాడు భట్టు.

'వచ్చే నెల్లో మళ్ళీ వెళ్తాను. అప్పుడు కొన్నాళ్ళక్కడ వుండాలి. ఇప్పుడొస్తే మనిద్దరికీ బావుంటుంది. రేపెళ్ళి వెంటనే వచ్చేస్తాను. నీకు ఏం చూసినట్టుండదు. సరేనా?" అనునయంగా అన్నాడు అరవింద్.



"అయితే అప్పుడు తప్పకుండా తీసికెళ్లాలి."

"ష్యూర్!..." నవ్వాడు అరవింద్.

భట్టు కాళీ కప్పుతో వెళ్ళిపోయాడు.

మళ్ళీ ముసుగు బిగించబోయాడు అరవింద్.

"ఏయ్ అరవింద్! మళ్ళీ పడుకుంటున్నావా?" కిటికీలోంచి తొంగి చూస్తూ అరిచింది కాంతి.

అతను ఆమె మాట వినిపించుకోకుండా మొహంనిండా దుప్పటి కప్పుకున్నాడు.

తుఫాన్లా వచ్చి పడింది కాంతి.

"అరవింద్! త్వరగా లే!" అంది గుమ్మం దగ్గర నిల్చుని.

"ఒక్క అరగంట కాంతీ! ప్లీజ్!" ముసుగు తియ్యకుండానే అర్థించాడు అరవింద్.

"అదేం కుదరదు. ముందులే!"

"ఇవాళ ఆదివారమేగా కాంతీ... ఇంత పెంద్రాళే లేచి ఏం చెయ్యాలి! కాస్సేపు నన్ను డిస్టర్బ్ చెయ్యకు! ప్లీజ్!"

"డిస్టర్బ్ చెయ్యడంకాదు అరవింద్! డేడీ నీకోసం వెయిట్ చేస్తున్నారు!" అంది కాంతి.

"ఎందుకు?"

"ఏమో!... నీతో ఏదో మాట్లాడాలట! త్వరగా లే!" మళ్ళీ అరిచింది కాంతి.

"ఇప్పుడు కుదరదు. ఇంకో గంటయ్యాక రమ్మను. తీరిగ్గా మాట్లాడతాను" అన్నాడు అరవింద్ బద్ధకంగా మరో వైపుకి తిరిగి పడుకుంటూ.

అతనికి తెలుసు తనని నిద్ర లేపడానికే కాంతి అలా అంటోందని. అతను పొద్దున్నే లేవకపోవడం, రక రకాల అబద్ధాలు చెప్పి అతన్ని లేపడానికి ప్రయత్నించడం కాంతికి అలవాటే. ఒక్కొక్కసారైతే నెత్తినిండా నీళ్ళు కూడా పోస్తుంది.

"ఏయ్! నీకే చెప్పేది! నిజంగానే నీ కోసం డేడీ హాల్లో వెయిట్ చేస్తున్నారు" మరికాస్త దగ్గరికొచ్చి గంభీరంగా అంది కాంతి.

"ఎందుకట?"

"నీ ప్రయాణాన్ని గురించి ఏదో మాట్లాడాలట!"

అరవింద్ ఓసారి దుప్పటి తొలగించి చూసి, అక్కడెవరూ లేరని గ్రహించి తిరిగి దుప్పటి బిగించి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

కాంతి ఓసారి అటు ఇటు చూసి పిల్లిలా అతని దగ్గరి కొచ్చింది.

"డియర్!" అంది అతనిమీదికి వంగి మెల్లగా.

"ఊ!" మూలిగినట్టు అన్నాడతను.

"నేనో బహుమతి తెచ్చాను!" గుసగుసగా అంది కాంతి.

"ఊఁ!"

"ఇవ్వనా?"

"ఊఁ తర్వాతివ్వచ్చులే!" బద్ధకంగా అన్నాడతను.

"ఉఁహూ! ఇప్పుడే ఇస్తాను!"

"సరే!... ఇచ్చిపో!"

"నిజంగా ఇచ్చేస్తున్నాను!"

"ఊఁ! త్వరగా ఇచ్చిపో! నేను నిద్రపోవాలి." విసుగ్గా అన్నాడు అరవింద్.

మరోసారి తలెత్తి పరిసరాలు చూసింది కాంతి.

వంగి అతని తలమీంచి దుప్పటి లాగేసింది.

అతనిమీదికి వాలిపోయింది.

అతని గుండె ఝల్లుమంది.

అతని స్థితి గమనించకుండానే అతని చెంపకి చెంప ఆన్చి మునిపంటితో అతని పెదవి మెల్లగా కొరికింది.

షాక్ కొట్టినట్టు టక్కున లేచి కూర్చున్నాడు అరవింద్.

"తియ్యగా వుందికదూ?" అల్లరిగా నవ్వింది కాంతి.

"ఏయ్! ఏమిటిది?" పరిసరాలు కంగారుగా చూస్తూ అన్నాడతను.

"తెలియదా! ముద్దు!"

"ఛ! వూరుకో!" మళ్ళీ కంగారుగా పరిసరాలు చూశాడు అరవింద్.

"ఏమిటరవింద్! ఆడపిల్లలా అంత కంగారు పడిపోతావ్?" మూతి తిప్పుతూ అంది కాంతి.

"అయ్యో!... కంగారుకాదు కాంతీ..."

"మరి?... భయమా?"

"అయ్యో..." మొహం అదోలా పెట్టాడతను.

"ఏఁవిటి... కొంపతీసి నా ముద్దు చేదుగావుందా?"

"ఆ! అవును... చేదుగా వుంది సరేనా!"

"ఛా!... తియ్యని ముద్దు నేనిస్తే... చేదుగా వుందిట!... చేదుగా... అయితే నా ముద్దు నా కిచ్చెయ్యి..." మళ్ళీ అతని మొహం దగ్గరికి మొహాన్ని తీసుకొస్తూ కవ్వింపుగా అంది కాంతి.

"ష్! అరవకు తల్లీ!.... నేను లేస్తానుగా.." అనేసి దుప్పటితీసి పక్కన పడేశాడు అరవింద్.

"దట్స్‌గుడ్!" నవ్వింది కాంతి.

"ఆఁ గొప్పేలే!" రుసరుసలాడాడు అరవింద్.

"అయితే మళ్ళీ ఓ ముద్దు...."

"ఇంక ఒద్దు!.... నేను రెండు నిమిషాల్లో మొహం కడుక్కొస్తాను!"

"ఛ! ఛ! నువ్వేం మగాడివరవింద్! అందమైన అమ్మాయి చల్లగా, మెల్లిగా చెంతకి చేరి, వెచ్చగా చెంపకి చెంప ఆన్చి పెదవులమీద తియ్యని ముద్ర




వేస్తుంటే... మైమరవడం మాటటుంచి అదేదో భూతం తరుముతున్నట్టు కంగారుపడి పారిపోతున్నావ్?" వెక్కిరింపుగా అంది కాంతి.

కాంతి చేసిన చిలిపిపనికి మనసు, తనువు పులకించిపోతుంటే, అల్లరి మనసుని అదుపులోకి తెచ్చుకుంటూ ఓసారి ఆమె కళ్ళల్లోకి చిలిపిగా చూసి, మధురంగా నవ్వేసి పెరటికేసి నడిచాడు అరవింద్.

అంత చిలిపిపని చేసినప్పుడు లేని సిగ్గు అరవింద్ చూసిన చూపుకి ముంచుకొచ్చింది కాంతికి. హఠాత్తుగా ఆమె చెంపలు కందిపోయాయి.

* * * * * * * * * * *

అరవింద్ పురాతన వస్తు పరిశోధనా కేంద్రంలో ఆఫీసర్. అదే సబ్జక్ట్‌లో రిసర్చ్ చేస్తున్నాడు.

జయదేవ్ అదే శాఖలో డైరెక్టర్.

వ్యక్తిగతంగా చాలా మంచివాడు.

హెల్పింగ్ నేచర్ గలవాడు.

ఎవరైనా సహాయం అర్థిస్తే ఆలోచించకుండా సహాయాన్ని అందిస్తాడు. ఎవరైనా ఆ వూరికొచ్చి ఏదైనా కావాలనుకుంటే ముందు జయదేవ్‌నే కలవమని చెప్తారా ప్రాంతంలో ఎవరైనా సరే.

అలాగే అరవింద్ వుద్యోగరీత్యా ఆ వూరొచ్చినప్పుడు ఆయన్ని కలవమని చెప్పారు ఆఫీసులో వాళ్ళు. అతను కలిశాడు. తన సంగతంతా చెప్పుకున్నాడు.

# మూడు కాలాలకు ముడి

–డా. సి. నారాయణ రెడ్డి

అప్పుడెప్పుడో ఊరి చెరువును
చివరంటా ఈదాడు మావాడు.
అప్పుడు తగిలించిన భుజకీర్తులు
తుప్పు పట్టినా వదల నంటాడు.
సభ దొరికితే చాలు
గత వైభవ గంగా జలాన్ని
మైకుల ఉద్ధరిణుల్లోంచి పంచుతాడు.
అయ్యో గంగ కూడా కలుషిత మయిందంటే
ఆగ్రహాన్ని చేష్టల్లోకి అనువదిస్తాడు.
సముద్రం ఎంత గొప్పదయినా
భూత కీర్తిని చప్పరించుకుంటూ కూచోదు.
మండుటెండకు గుండె ఆవిరిని అర్పించుకుని
మబ్బులకు పురుడు పోస్తుంది.
కురిసిన వర్షాన్ని డిపాజిట్టులో పెడుతుంది
ధరిత్రి అర్థించేదాకా.
మూడు కాలాలకు ముడి కదలి ఒడి.
కట్ట తెంచుకు రాలేకున్నా
కడుపు చించుకు ఘోషించే
ఉన్ముక్త చైతన్యం దాని ఒరవడి.

# మంజీరనాదం

వందల మైళ్ళ దూరంనించి వుద్యోగరీత్యా వచ్చిన తనక్లాస్మేట్ కొడుకు హాయిగా, అండగా వుండాలని కోరుకున్నాడు. సంతోషంగా ఒప్పుకున్నాడు జయదేవ్.

అంతేకాదు. వెంటనే అతన్ని తన ఇంటికి టీకి పిల్చాడు. కూతుర్ని పరిచయం చేశాడు.

తననించి ఏ సహాయం కావాలన్నా నిస్సంకోచంగా అడగమన్నాడు.

అతనికి అరవింద్ ఎంతో నచ్చాడు.

అరవింద్ రూపం, సభ్యత, సంస్కారం, ముఖ్యంగా మాటతీరూ అతన్నెంతగానో ఆకర్షించాయి. అందుకే ఏమాత్రం ఆలోచించకుండా తమ ఇంట్లోనే ఆశ్రయం ఇచ్చాడు.

మొదట్లో కాస్త బెరుగ్గాఅనిపించేది అరవింద్‌కి.

కారణం జయదేవ్ ఎంత కలుపుగోలుమనిషో అతని కూతురు కాంతి అంతకన్న కలుపుగోలు మనిషి. తల్లి చిన్నతనంలోనే పోవడం మూలంగా ఆమెని తండ్రే గారాబంగాపెంచి పెద్ద చేశాడు.

ఆమె ఎమ్మే పాసయినా ఇంకా చిన్న పిల్లలా అల్లరి చేస్తుంది. అందర్నీ పేర్లు పెట్టి ఏడిపిస్తుంది.

మొదట్లో కాస్త ముభావంగా వుండే అరవింద్‌ని ముప్పతిప్పలు పెట్టింది.

సీరియస్‌గా చదువుకుంటున్నప్పుడు మైన్ ఆఫ్‌చెయ్యడం. షవర్‌కింద స్నానం చేస్తున్నప్పుడు ఓవర్‌హెడ్ టేంక్ వాల్వ్ మూసెయ్యడంలాంటి పనులు చాలానే చేసింది.

ఒకో టైమ్‌లో అతను ఆమె చర్యకి హడలిపోయి ఆ ఇంట్లోంచి వెళ్ళిపోవాలని కూడా అనుకున్నాడు. కానీ ఆమె వెళ్ళనివ్వలేదు.

అతని సామాన్లు దాచేసేది.

పుస్తకాలు తీసికెళ్ళిపోయేది.

క్రమేపీ ఆమె ఏమిటో అరమయింది అరవింద్‌కి. తర్వాత ఆమెలోని అందచందాలు అతన్నాకర్షించసాగాయి.

ఆమె దగ్గరుంటేనే అతని మనసు, తనువు స్వాధీనం తప్పినట్టుండేది.

అతిత్వరలోనే అతను ఆ ఇంట్లో ఓ మెంబరైపోయాడు.

కాంతి క్కూడా అరవింద్ అంటే ప్రాణం.

అందంగా, హుందాగా వుండే అతన్ని చూడగానే తనని తాను మర్చిపోయేది. ఆమెలోని కన్నె మనసు మధురంగా అయిపోయేదతని కంఠం వింటేనే.

వాళ్ళిద్దరి మనసులూ అర్థం చేసుకున్నాడు జయదేవ్.

ఓరోజు ఇద్దర్నీ పిల్చి డైరెక్ట్‌గా అడిగేశాడు.

అనుకోని ఈ సంఘటనకి క్షణం కంగారు పడ్డాడు అరవింద్.

"లాభంలేదు డేడీ!.. మగాడికుండాల్సిన చొరవా, తెగింపూ ఇతగాడిలో మచ్చుకైనా లేవు!" పెదవి విరిచింది కాంతి

"నేను తెగించివుంటే..." బుంగమూతి పెట్టి గొణిగినట్టు అంటున్న అరవింద్‌ని చూసి హాయిగా నవ్వేశాడు జయదేవ్.

"అరవింద్! ఓ ఆడపిల్ల తండ్రిగా అడుగుతున్నాను.. . మా కాంతిని చేసుకుంటావా?" అన్నాడు.

అతను అంగీకారంగా తల వూపాడు

"అమ్మయ్య! ధైర్యం వచ్చింది!" అంది కాంతి

"నిన్ను చేసుకున్నాక ఈ మాత్రం ధైర్యం కూడా వుండదేమో అని భయపడుతున్నాడమ్మా అరవింద్" తమాషాగా అన్నాడు జయదేవ్.

అరవింద్ సిగ్గు పడిపోయాడు

"రేపు... మన వాళ్ళందర్నీ పిల్చి ఈ గుడ్ న్యూస్-చెప్తాను!" అంటూ లేచాడు జయదేవ్.

"అలాగే" అన్నట్టు తలూపాడు అరవింద్.

జయదేవ్ వెళ్ళిపోగానే–

"అరవింద్... అయినా నీకంత సిగ్గేవిటి?" అంది కాంతి సీరియస్‌గా.

"ఏం చేస్తాం మరి! కలికాలం... నువ్వు సిగ్గు పడాల్సింది నేను సిగ్గు పడుతున్నాను..." విచారం నటిస్తూ అన్నాడతను.

"కొంప తీసి రేపు పెళ్ళయ్యాక్కూడా వుంటుందా ఈ సిగ్గు?" భయం నటించింది కాంతి

"ఉహూఁ. అప్పుడు నీకుంటుంది సిగ్గు. నీ సిగ్గులన్నీ నేనే దోచేస్తాను!" ఆమె కళ్ళల్లోకి కొంటెగా చూస్తూ అన్నాడతను.

అంతే! ఆమెలోని ఆడతనం మేలుకుంది.

సిగ్గుల బరువుతో కను రెప్పలు వాలిపోయాయి.

"వెరీ గుడ్!.. ఇది సిగ్గంటే!!" ఆమె కొంగు లాగుతూ అల్లరిగా అన్నాడతను

ఆమె వెక్కిరిస్తూ పారిపోయింది

మర్నాడు అనుకున్నట్టే అరవింద్‌ని కాబోయే అల్లుడిగా పరిచయం చేశాడు జయదేవ్.

ఆనాటి నుంచి అరవింద్‌ని భోజన ఫలహారాలకి బైటికి వెళ్ళనీయలేదు జయదేవ్, కాంతి.

ఆ ఇంట నౌకరుగా వున్న భట్టుక్కూడా అతనంటే చాలా అభిమానం. అమ్మాయిగారికి తగిన భర్త అనుకుని మురిసిపోతుంటాడు.

ప్రస్తుతం అరవింద్ దూరాన వున్న అడవులకి, లోయలకి అవతల వైపున్న టౌన్‌షిప్‌లో ఏదో ఇన్‌ఫర్మేషన్ కోసం వెళ్ళబోతున్నాడు.

* * * * *

సూర్యుడు నడి నెత్తినించి దిగి పడమటి వైపుకి సాగుతున్నాడు. తన వేడిని ఆ ప్రాంతాల్లో చూపించలేనట్టు మొహాన్ని ఎర్రగా మార్చుకుని పడమటి కొండల్లోకి దిగుతున్నాడు.

అడవుల మధ్యగా వున్న ఓ బ్రాంచ్ లైన్ మీద ప్రయాణం చేస్తున్న ఓ ఎక్స్‌ప్రెస్ గమ్యాన్ని చేరటానికి పరుగులు తీస్తోంది.

ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్ మొత్తంలో అయిదుగురు మాత్రమే వున్నారు. ఆ అయిదుగురిలో నలుగురు లోకాభిరామాయణంలో పడ్డారు. అయిదవవాడు

అరవింద్. అతను ఏదో రష్యన్ నవల దీక్షగా చదువుకుంటున్నాడు. మధ్య మధ్య వారి సంభాషణ వింటూనే:

ట్రైన్ వింత వింత శబ్దాలు చేస్తూ పరిగెడుతోంది.

ఎవరి ధోరణిలో వాళ్ళున్నారు.

ట్రైన్ ఓసారి పెద్దగా రంకె పెట్టింది.

ఉలిక్కిపడి చూశారంతా.

సంభాషణ ఆపి బైటికి చూశారు నలుగురూ.

అరవింద్ కూడా చేతిలోని పుస్తకాన్ని పక్కన పెట్టి కిటికీలోంచి బైటికి తొంగి చూశాడు.

చుట్టూ దట్టమైన అరణ్యం!

దూరంగా కొండలు, లోయలు!

మెల్లగా లేచి గుమ్మం కేసి నడిచి, తలుపు తీసి కాస్సేపు అక్కడ నిల్చున్నాడు.

ప్రకృతి ఎంతో అందంగా, మనోహరంగా వుంది. తనని తాను మరచి ఆ కదలిపోయే మహా వృక్షాల్ని, దూరమౌతున్న కొండల్ని తన్మయత్వంగా చూస్తుండిపోయాడు.

అరవింద్ మళ్ళీ తన సీట్ దగ్గర కొచ్చాడు.

"అదిగో... ఏనుగు పిల్ల!" ఒకతను అరిచినట్టు అన్నాడు.

అరవింద్‌తో సహా అందరూ చూశారటుకేసి కుతూహలంగా.

అక్కడ ఓ ఏనుగు గున్న... నిల్చుని భయం భయంగా చూస్తోంది ట్రైన్‌కేసి.

అరవింద్ గభాల్న బేగ్‌లోంచి కెమేరా తీసి ఆ ఏనుగు పిల్లని రెండు మూడు స్నాప్స్ తీశాడు.

మళ్ళీ ఓసారి ట్రైన్ అరచింది బిగ్గరగా.

"ఏదో వూరొస్తున్నట్టుంది" అన్నాడొకతను.

"ఎందుకలా అనుకుంటున్నారు?" అన్నాడు మరొకతను. "సాధారణంగా వూరు చేరువౌతుంటేనే అలా విజిల్ వేస్తాడు డ్రైవర్" అన్నాడు మొదటతను.

"అదేం కాదు. ఈ ప్రాంతాల్లో మృగాలు ఎక్కువగా తిరుగుతుంటాయి. ఏనుగులు, చిరుతలులాంటివి పట్టాల మీదే నిద్రిస్తుంటాయొక్కొక్కప్పుడు. అందుకే అలా అరుచుకుంటూపోతాడు డ్రైవర్" అన్నాడు ఆ ప్రాంతాలు కాస్త తెలిసిన సింగ్ అన్నతను.

మిగతా ఇద్దరూ మాట్లాడలేదు.

ట్రైన్ పరుగు తీస్తూనే వుంది.

సింగ్ తన బేగ్‌లోంచి ఫ్లాస్క్ తీసి కాస్త కాఫీ వంచుకుని, మిగతా వాళ్ళకి ఆఫర్ చేశాడు మాట వరసకి. వాళ్ళొద్దనడంతో కాఫీ తాగుతూ బైటికి చూస్తున్నాడు.

దట్టమైన అడవి చీమదూరడానిక్కూడా సందులేనట్టుంది.

ట్రైన్ ఓ గుహలోకి దూసుకు పోయింది.

అంతా కటిక చీకటి!

వింత వింత శబ్దాలు!

కొత్తగా ఆ ట్రైన్‌లో ప్రయాణం చేసే వాళ్ళందరికీ అదోలాంటి భీతికలిగింది.

రెండు నిముషాల తర్వాత ట్రైన్ బైటికొచ్చింది.

"హమ్మయ్య!" అన్నాడు మనసులో హడిలి చస్తున్న ఒకతను తేలిగ్గా నిట్టూరుస్తూ.

"అబ్బో! .. చాలా పెద్ద గుహ!" అన్నాడింకో అతను "అవును. దీనిపేరు భానుగుహ!... ఇలాంటి గుహలు చాలా అరుదు!" అన్నాడు అంత వరకు మౌనంగాకూర్చున్న మరో అతను.

"భానుగుహ?"

"అవును! ఇది క్రీస్తు పూర్వంనించీ వుంది. భానుగుహగా దీనికి చాలా చరిత్రుంది!"

"ఆ చరిత్ర మీకు తెలుసా?" చివ్వున తల ఎత్తి అడిగాడు అరవింద్.

"ఆ! తెలుసు!..."

"అయితే చెప్పండి!" వుత్సాహంగా అడిగారంతా. ఓసారి వాచ్ చూసుకున్నాడు చరిత్ర తెలుసు అన్నతను.

"త్వరగా చెప్పండి!" ఫ్లాస్క్ సర్దేస్తూ అన్నాడు సింగ్.

అతను వుత్సాహంగా మొదలు పెట్టాడు.

"క్రీస్తుపూర్వం ఎప్పుడో భానూర్ అన్న ఓ వ్యక్తి ఈ పరిసరాల్లో మకుటంలేని మహారాజులా జీవించాడు. అదిగో! అటుచూడండి! అక్కడ పెద్ద లోయ కనిపించడం లేదూ?" దూరంగా వున్న ఓ లోయకేసి చూపిస్తూ అన్నాడు చరిత్ర చెప్తున్న వ్యక్తి.

అందరూ అటుకేసి చూశారు.

బ్రహ్మాండమైన లోయ కనిపించింది.

"ఆ లోయ, ఈ ప్రాంతాలూ అన్నీ భానూర్‌వే! అతనికి శ్రీకృష్ణ పరమాత్మలా చాలా మంది భార్యలుండేవారు. కొండంత సంపదలుండేవి

భానూర్ అందగాడు మంచివాడు. జాలిగుండె కలవాడు అతనంటే అక్కడ ప్రజలంతా ప్రాణం ఇచ్చేవాళ్ళు."

"ఆ లోయలో కూడా ఇళ్ళుండేవా?" అన్నాడు అరవింద్ అమాయకంగా. అతను మధ్యలో ప్రశ్నించడం నచ్చనట్టు అతనికేసి తీక్షణంగా చూశాడు సింగ్.

"సరే! చెప్పండి! అన్నాడు అరవింద్.

"అతను మంచి శిల్పి!, చిత్రకారుడు! అంతే కాదు అతను గొంతెత్తి పాడుతుంటే పాములు పడగలు విప్పి ఆడేవట. సింహాలు, పులులులాంటి క్రూర జంతువులు పిల్లి పిల్లల్లా అతని చుట్టూ చేరి మైమరచి అతని గానాన్ని వినేవట!...."

"అంటే గంధర్వ గానమన్నమాట అతనిది?" ఆశ్చర్యంగా అన్నాడు అరవింద్.

అతను నిజంగానే అలా అన్నాడో, వ్యంగ్యంగా అన్నాడో వాళ్ళెవరికీ అర్థం కాలేదు.

"మిస్టర్!.. ఇంత మంచి విషయం గురించి చెప్తుంటే మధ్య మీ చొప్పదంటు ప్రశ్నలేవిటి?" విసుక్కున్నాడు సింగ్.

"సారీ! చెప్పండి!" బుద్ధిగా అన్నాడు అరవింద్. అతను మళ్ళీ మొదలుపెట్టాడు.

అందరూ కుతూహలంగా వింటున్నారు.

ఇంజన్ మరోసారి కర్ణకఠోరంగా అరిచింది క్షణం చెప్పడం ఆపాడతను.

"చెప్పండి! కథ చాలా ఇంట్రస్టింగా వుంది!" అన్నాడు అరవింద్ వుత్సాహంగా.

"ఇది కథ కాదు!" మొహం అదోలా పెట్టి అన్నాడు కథకుడు

"పోనీ జరిగిన కథ! సరేనా! చెప్పండి!"

"ఎంత వరకు చెప్పాను!" శ్రీకృష్ణ పరమాత్మలా పోజు పెట్టాడతను

"అదే.. భానూర్‌ది గంధర్వ గానం . అతను పాడుతుంటే "

"ఆఁ! గుర్తొచ్చింది" అరవింద్ మాట పూర్తి కాకుండానే అన్నాడతను

(ఇంకా ఉంది)



## వ్యక్తిగతం



అసాధారణమైన విహంగ మిత్రుడిగా, ప్రకృతి ఆరాధకుడిగా ప్రశంసలు పొందిన డాక్టర్ సలీమ్ అలీ తన '91వ ఏట, జూన్ 20న బొంబాయిలో మరణించారు. భారత దేశంలో వన్య మృగ సంరక్షణకు, పక్షుల సంరక్షణకు, సమాచార సేకరణకు, పరిశోధనకు తన జీవితంలోని అత్యధిక భాగాన్ని అంకితం చేసిన సలీమ్ అలీ రాజ్యసభకు నామినేట్ చేయబడ్డారు. అంతరించి పోయిందనుకున్న "బాయా" అనే పక్షిని పశ్చిమతీర ప్రాంతంలో మళ్ళీ కనిపెట్టిన ఫలితంగా ఆయనకి ప్రపంచ ప్రసిద్ధమైనటువంటి, ప్రతిష్ఠాత్మకమైనటువంటి పాల్‌గెట్టీ అవార్డు 1976లో లభించింది. రాజ్యసభ సభ్యత్వం, పాల్‌గెట్టీ అవార్డులతో పాటు ఆయన అనేక జాతీయ, అంతర్జాతీయ బహుమతులను, పురస్కారాలను పొందారు. ఆయన పక్షుల అధ్యయనంలో బెర్లిన్ విశ్వవిద్యాలయ జంతు శాస్త్ర శాఖలో ప్రత్యేక శిక్షణ కూడా పొందారు.

1950 దశకం ప్రారంభంలో ఆయన భార్య మరణించారు. ఆయనకు సంతానం లేదు. పక్షుల పరిశీలన గురించి ఎన్నో పుస్తకాలు కూడా రాసిన సలీమ్ అలీ ఆత్మకథ సంవత్సరం క్రితం వెలువడింది. ఆయన మృతితో దేశం ఒక గొప్ప ప్రకృతి ఆరాధకుణ్ణి కోల్పోయిందని రాష్ట్రపతి, ప్రధాని, తదితర ప్రముఖులు ఎంతో మంది సంతాపం ప్రకటించారు.... □



ప్రముఖ గాంధేయ వాది, శాంతి అధ్యయన రంగంలో నిపుణురాలు అయిన డాక్టర్ అనిమాబోస్‌ను ఒక విశిష్ట గౌరవం వరించింది. ఐక్యరాజ్య సమితి విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో మధ్య అమెరికాలోని కోస్టారికాలో జరిగే ఒక చర్చా గోష్ఠికి అధ్యక్షత వహించ వలసిందిగా ఆమెను ఆహ్వానించారు. ఈ చర్చా గోష్ఠిలో "హింసకి కారణాల గురించి తాత్విక దృక్పథాల"పై చర్చ జరుగుతుంది. హింస, శాంతి సమస్యలపై గాంధేయ దృక్పథంపై డాక్టర్ అనిమాబోస్ స్వయంగా ఒక పత్రం సమర్పిస్తారు. ఆమె గతంలో భారత దేశం, అమెరికాలతో సహా అనేక దేశాలలో గాంధేయ అధ్యయనాలపై ఉపన్యాసాలు చేశారు. మహాత్మా గాంధీ గురించి, భారత విద్యా విధానం గురించి అనేక పుస్తకాలు రాసిన డాక్టర్ బోస్ కల్పనా సాహిత్యాన్ని కూడా రచించారు. భారతీయ చారిత్రక అధ్యయనాల సమితిలో సీనియర్ రిసర్చ్‌ఫెలో గా కూడా ఆమె పని చేశారు... □

# వారఫలం

**31-7-1987 శుక్రవారం మొదలు 6-8-1987 గురువారం వరకు**

★ **మేషం :** మీది వ్యాపారమా? అయితే ఈ వారం మేలే. మీది రచనా విధానమా? చక్కని అవకాశాలున్నాయి. మీరు చిత్ర రంగాన ప్రసిద్ధి వహించాలనుకొన్నారా? ఇది మంచి సమయమే. స్త్రీలకు : మరీ బాగుండే వారం, ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి. ఆదాయమున్నది.

★ **వృషభం :** మీరు వ్యాపారం చేస్తున్నారా? అయితే మేలు. ఉత్తముల స్నేహం లభ్యమవుతుంది. వ్యవహార రీత్యా అనుకూల సమయం. అలా యిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టుకొంటారేమో! జాగ్రత్త పడుతారుగా? స్త్రీలకు : అనుకూల వార్తాశ్రవణం. ఉద్యోగం చేసేలాగైతే జాగ్రత్త అవసరం.

★ **మిధునం :** శుభ సూచక వారం. వారం ఉత్తమ ఫలదాయకం. నట గాయక, హరి కథకులకు, రచయితలకు మేలైన వారం. పట్టిన పట్టు వదలకుంటే మేలున్నది. ప్రయాణాల వలన మేలు గాదు, గ్రహించాలి. స్త్రీలకు : ప్రశాంతమైన సమయం, ఆనందదాయక వారం.

★ **కర్కాటకం :** లావాదేవీలందు మేలున్నది. విలాస వస్తు సేకరణకు అవకాశమున్నది. వ్యాపారం అనుకూలంగా సాగుతుందనుటకు ఆక్షేపణ లేదు. ఇంట శుభ ప్రస్తావనలుంటాయి. ఆరోగ్య రీత్యా అభివృద్ధి. స్త్రీలకు : రాజకీయంగా మేలుగాదు. వృత్తిని అలక్ష్యం చేయకండి, స్వల్పాదాయం లేకపోలేదు.

★ **సింహం :** దరి దాపుల్లో మేలు జరిగే ఆశ లేదు. వృత్తిలో ఈ వారం ప్రగతి కనిపిస్తుందని నమ్మకం లేదు. రాజకీయాలందు మేలు జరుగుతుందని ఎలా ఆశిస్తారు? వారఫలం అనుకూలం గాదే, చుట్టు ప్రక్కల గొడవలతో సతమతం కాకండి. స్త్రీలకు : వస్తు సేకరణకు అనుకూలం. ఆరోగ్యమందు మెరుగే.

★ **కన్య :** పనులందు శ్రద్ధాసక్తులున్నవి. అయినా ప్రయోజనం? ఉత్తరాల మూలంగా అనేక విషయాలు తెలిసికొంటారు, అయినా మీరేం చేయగలరు. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి, కొంత జాగరూకత అవసరమే గదా! స్త్రీలకు : నూతన ఉద్యోగ యత్నాలు సానుకూలం. నూతన వ్యక్తులను కలసికొంటారు, మేలే.

★ **తుల :** అనుకూల మిత్రులు చేరుతారు. అధికంగా ప్రయాణించటం తగదు. వృత్తియందు ప్రగతి సూచక వారం. రాజకీయాలందు చెప్పదగిన అవకాశాలు లేవుగదా! ఎందుకు ప్రయాస? స్త్రీలకు : నూతన మిత్రులు చేరుతారు, అందు మూలాన మేలే.

★ **వృశ్చికం :** వృత్తియందు వికాసం లేదు. ఏ పని చేయాలన్నా యిష్టం ఉండదు. శని బాధా నివారణమైనా యింకా మెరుగు కనిపించలేదు. చిత్ర నిర్మాణం వాయిదా వేయండి. ఇది సమయం గాదు. ఆదాయమున్నది. స్త్రీలకు : ప్రతిష్ఠకు భంగం కలిగే వ్యవహారాలు ఉండవచ్చు, జాగ్రత్తపడాలిగా!

★ **ధనుస్సు :** అలా యిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టుకొంటారు. అంటే అధిక ప్రయాణాల వలన యిబ్బంది, అనువుగాని వార్తాశ్రవణం. వారాంతాన బంధు మిత్రులు యింటికి రాగలరు. మిత్ర గోష్ఠికి అనుకూలత గల దినం. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా గొడవలు రాకుండా చూచుకోవలె.

★ **మకరం :** ధనాదాయమున్నది. వ్యాపారమందు అనుగుణ్యత ఏర్పడుతుంది. భాగస్థులతో తగాదాలు రాకుండా చూచుకోండి. పత్రికాధిపతులకు, గ్రంథ రచయితలకు అనుకూలం. స్త్రీలకు: సుఖ, భోగ, భాగ్యములందు ప్రగతి సూచకవారం. ఆరోగ్యరీత్యా మేలు.

★ **కుంభం :** ఉద్యోగ వృత్తులందు మేలున్నది. ఇంటి యందు శుభం జరుగవచ్చు. వృత్తియందు స్వల్ప మార్పు రావచ్చు. ఉత్తర ప్రత్యుత్తరాల మూలంగా అనేక విషయాలు గ్రహిస్తారు. సందర్భ మెరిగి కృషి చేయండి, మేలున్నది. స్త్రీలకు: వాహన సౌఖ్యం, వృత్తి మూలకంగా ప్రగతి, ఉద్యోగమందు రావలసిన "ఇంక్రిమెంటు" లభ్యం.

★ **మీనం:** వారమంతా శుభమే. అయివేజులో అభివృద్ధి. ధనలబ్ధికి అవకాశం. నూతన వ్యక్తుల పరిచయం లాభదాయకం. విద్యా వినోద ప్రసంగాలలో పాల్గొంటారు. ఉత్తర ప్రత్యుత్తరాలలో అనేక విషయాలు తెలిసికొంటారు. స్త్రీలకు: సర్వానుకూల సమయం. మీ మాటకు ఎదురు లేదని గ్రహించాలి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్ధాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4 నెలలనుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్ధాలు కావాలి దీన్ని సెరిలాక్ లాభంతో ప్రారంభించేందుకు ఇదే సరైనసమయం.

**పోషకాహార లాభం:**

సెరిలాక్ ప్రతి మోతాదులోను (ప్రతిసారి మీ పాపకు తినిపించే సెరిలాక్ లోను) మీ పాపాయికి కావలసిన పోషకపదార్థాలు ప్రొటీన్లు కార్బొహైడ్రేట్లు క్రొవ్వు పదార్ధాలు విటమిన్లు ఖనిజాలు అన్నీ ఉన్నాయి మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళల్లో అన్నీ సమతూకంలో ఉన్నాయి

**రుచి లాభం:**

సెరిలాక్ మంచి పోషకపదార్ధాలకు మంచి రుచిని కలిపింది పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం

**సమయం ఆదా లాభం:**

సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలు పంచదార ఉన్నాయి దానిని వెచ్చటి నీటిలో కలిపితే చాలు క్షణంలో ఆహారం తయారు

**ఎంపిక లాభం:**

పాపాయికి ఆహారం తినిపించడం మరింత ఆహ్లాదకరంగా చేసేందుకు యిప్పుడు ఎంచుకునేందుకు రెండు రకాల సెరిలాక్ దొరుకుతోంది 4 నెలల నుంచ సెరిలాక్ వీట్ 6 నెలల తరువాత కొత్తసెరిలాక్ ఆపిల్ మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి

> **ఉచితం**
> పాపాయి ఆరోగ్య రికార్డు పుస్తకం కోసం వ్రాయండి
> సెరిలాక్ పోస్ట్ బాక్స్ నం 3
> న్యూ ఢిల్లీ-110 008







## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# బంగళా కుక్కలు

పులికంటి కృష్ణారెడ్డి

వెనుకటికి ఎవరో ఒక కవిగారి ఊహలకు రెక్కలు వచ్చినాయట!.... ఊరేగేవాడే కానీ.... రెక్కలు వచ్చింది ఊహలకే కాబట్టి అవేమో గగనసీమల్లో విహరిస్తూ ఉంటే- ఆయన గారేమో ఆ ఊరి సందు గొందుల్లోనే కుమ్మరి మట్టి తొక్కినట్లుగా "లెఫ్ట్‌రైట్" కొడుతున్నాడట!

అప్పుడు ఒక దృశ్యం ఆయన కంటపడింది!

తక్షణమే "తజ్జరిగిణతోం!" అని మట్టి తొక్కడానికి ముక్తాయింపు పలికేసి ఊహల రెక్కల్ని ముక్కలు చేసి.... ఆ విజయ గర్వంతో పిలక ముడి విప్పి విదిలించి.... వెను వెంటనే విదిలించిన పిలకను ఈడ్చి గట్టిగా ముడేసి ... కన్నుల్లో వెన్నెలలు కురిపిస్తూ.... పెదవులపై నవ్వులు పూయిస్తూ.... మనసు లగ్నం కావడానికి చిటికెడు నశ్యం దట్టించి, దృష్టిని ఈ దృశ్యం మీదనే నిలిపినాడట!

పసుపు పచ్చని నీళ్ళు.... మిస మిసలాడుతున్న ఎండలో మరీ పచ్చదనాన్ని పులుముకొన్న నీళ్ళు.... ఆ యింటి పెరటి తూముగుండా దూరి.... నేలమీద పడి..... పాయలై.... హొయలు మీరుతున్నాయట!

మళ్ళీ కవిగారి ఊహలకు రెక్కలు మొలచినాయ్!

ఆ పెరడు.... పెరట్లో జలకాలాడుతున్న జవ్వని.... ఆ జవ్వని పసుపు పచ్చని మేను.... ఆ మేనిపై అలదిన పసుపు.... చెంబు మీద చెంబుగా ఆ మేన జారుతున్న నీళ్ళు.... తూము గుండా ప్రవాహ వేగంతో బయట పడుతున్న పసుపు పచ్చని నీళ్ళు!....

ఆ నీళ్ళే తానైతే!....

ఆ ఊహలో కవిగారు చలించి పోయినారట!.... ఎక్కడలేని హుషార్ నరనరాల్లోకి ప్రాకింది- పోలీసు అహంలాగా. చేతి కందిన అవకాశాన్ని పోలీస్ అహం వదల్లేనట్లే- కవిగారు ఆ దృశ్యాన్ని వదల్లేదు. వదిలి ముందుకు కదల్లేదు. పోనీ స్థిమితంగా నిలబడ లేదు. అయితే అతనిలో ప్రవేశించిన హుషా రేంకావాలి? అది అటు యిటు చూసి పోలీసువాడి అహం లాఠీ కర్రలో జొరబడినట్లు అతని కాళ్ళల్లో జొరబడే సరికి కవిగారు అడుసు మడిలో ఆకు తొక్కినట్లు "లెఫ్ట్‌రైట్" కొడుతున్నారట!

ఆ దృశ్యాన్ని మొట్ట మొదటగా ఆ సందులో కుక్కలు చూసినాయి. వాటి బుద్ధి వాటిది. అరిచినాయి. ఆ అరుపులకు ఆ సందుగొందుల్లో ఆడా మగా బయట కొచ్చినారు. వాళ్ళ వెంట పిల్లలు!....

తనలో తాను నవ్వుకొంటూ.... మెలికలు తిరిగి పోతూ.... జలదారి వైపు తదేకంగా చూస్తూ "లెఫ్ట్‌రైట్" కొడుతున్న కవిగార్ని చూసి ఆడా మగా వాళ్ళల్లో వాళ్ళు నవ్వుకొంటూ వెళ్ళిపోతే- పిల్లలు ఒకరి మొగం ఒకరు చూసుకొన్నారట!

ఆ తర్వాత తలా ఒక రాయి చేతి కందుకున్నారట!....

అది ఆ కాలం!!-

ఈ కాలంలో ఒక రచయిత వీధిని పడినాడు.

ఈ దేశంలో చాలా మంది చాలా చాలా రకాలుగా వీధిన పడుతున్నారు. విడిచేస్తే వీధికి పెద్దలు కూడా అవుతున్నారు. రచయితలు కూడా మనుష్యులే కాబట్టి వీధుల్లోనే కాదు- తాగి బారుల్లో పడినా ఫరవాలేదు కాబట్టి- పడుతున్నారు. పడిపోతున్న సమాజాన్ని పైకి లేపే రచయితలే పడిపోతుంటే- వాళ్ళను ఎవరు పైకి లేపాల్నో? ఆ బాధ్యత ఎవరిదో సిద్ధాంతీకరించే స్థాయికి తెలుగు సాహిత్యం ఎదగలేదు కాబట్టి- పడిన వాళ్ళు పడినట్లే ఉన్నారట!- అది వేరే సంగతి.

ఇప్పుడు వీధిన పడిన రచయిత నడుస్తున్నాడు. ఎండను వెన్నెలగా భావించి నడుస్తున్నాడు. కష్టానికి సుఖానికీ అతీతుడైన కర్మయోగిలా నడుస్తున్నాడు. ఎండకు చెమట కారుతూ ఉంది. "ఓహో యిది చెమట!" అని అనుకొంటూ నడుస్తున్నాడు. చెమట అంటే- యింకెవ్వరికీ తెలియనట్లు.. తన కొక్కడికే అనుభవాని కొస్తున్నట్లు ఆనందంగా నడుస్తున్నాడు.

అతడట్లా నడుస్తూ ఉంటే- మున్సిపాల్టీ వాళ్ళ అలసత్వంతో ఆ వీధిలో పేరుక పోయిన చెత్తా చెదారాన్ని జీరాడే పైజమా ఊడుస్తూ ఉంది. ఆ మాత్రం సామాజిక సేవ తన మూలంగా జరుగుతున్నందుకు కించిత్ గర్వంగా కూడా ఉంది కళ్ళతో కలయ చూస్తూ కాళ్ళీడుస్తున్న తరుణంలో ఒక దృశ్యం ఆ రచయిత కంట పడింది.

ఒక పెద్ద హోటల్.... ఆ హోటల్ నీడలో ఒక అందమైన కారు.... ఆ అందమైన కార్లో అంతకంటే అందమైన అమ్మాయి.... అందమైన ఆ అమ్మాయి వొడిలో ఒక అందాల బొచ్చుకుక్క!-

కారు అందమా? కారు కంటే కార్లో అమ్మాయి అందమా? అందమైన ఆ అమ్మాయి కంటే ఆమె వొడిలో బొచ్చుకుక్క అందమా? అని ఆలోచిస్తూ.... ఆలోచిస్తూనే అటు వైపు మార్చి మార్చి చూస్తూ- అన్నిటికంటే ఆ బొచ్చుకుక్కే అందమైనదని చివరికి ఆ రచయిత రెప్పార్పకుండా ఆ కుక్క వైపే చూస్తున్నాడు.

ఆ బొచ్చుకుక్క.... ముద్దుగా ముచ్చటగా తెల్లని కుందేలు పిల్లలా ఉన్న కుక్క . ఆ అమ్మాయి వొడిలో వొదిగిన కుక్క... ఉండమన్నా క్షణం ఊరకే ఉండడం లేదు. ఒడిలో నుండి పై కెగబడుతుంది. పైట లాగుతుంది. ఆ అమ్మాయి పైట సర్దుకొనే లోపుగా మరీ పైకెగబడి ముంగురుల్ని పీకుతుంది. ఆ అమ్మాయి చిరుకోపాన్ని నటిస్తూ... ఇంగ్లీషులో తిడుతూ.... మునివేళ్ళతో ముద్దుగా మూతి మీద కొడితే- ఆ కుక్క కాలెత్తి ఆ అమ్మాయి మూతిని అదరకొడుతూ ఉంది ఆ దెబ్బను తప్పించుకోవాలని ఆ అమ్మాయి మూతిని పక్కకు తిప్పుకొంటే.... ఆ దెబ్బ సరాసరి ఆ అమ్మాయి ఎదమీద పడుతూ ఉంది. ఆ కాలికిందేదో మెత్తగా పడేసరికి ఆ కుక్క అక్కడి నుండి కాలిని కదిలించ కుండా... యింకొక కాలిని కూడా పైకెత్తి ముందు పెట్టిన కాలికి సమాంతరంగా పెట్టి- అంటే రెండు కాళ్ళ మీదనే నిలబడి ఆ అమ్మాయి కన్నుల్లో కన్నులు పెట్టి చూస్తూ ఉంది.

ఆ అమ్మాయి ముసిముసిగా నవ్వుతూ ఉంది.

ఆ కుక్కయినా కాకపోతినే?- అనుకొన్నాడా రచయిత.

అనుకోవడమే తరువాయి. అతనిలోని "స్పృహగాడు" ఉలిక్కిపడి మేలుకొన్నాడు.

"ఒరే మంతుకుండా! ఈ కింకెప్పుడు పట్టిందిరా నిన్ను? మళ్ళీ పిలక యుగానికి వెళ్ళిపోతున్నావేమిటి?" అని గదమాయించినాడు.

"అంటే?" రచయిత సందేహాన్ని వెలిబుచ్చినాడు.

"అంటే- పిలక్కవులు కమలాకర చూచుకకుంతములు.... పాలిండ్ల బింకములు.... తరుణీ బృంద వేణీబంధ కటినికటనటనాడి పద బంధాల్లో చిక్కుకొని సమాజాన్ని పాడుచేసిన వారని ఏడుస్తున్నావ్ కదా? శృంగారాన్ని పండించినంత గొప్పగా సామాజిక స్పృహను పట్టించుకోలేదని పరిత పిస్తున్నావ్ కదా? మరి యిప్పుడు నువ్వు చేసిం దేమిటి? ఇక పసుపు నీళ్ళ ఊహల్లోపడి కొట్టుకు పోయిన పిలక కవికి నీకు తేడా ఏముంది?"

తగలవలసిన చోటనే తగిలేసరికి రచయిత తడుము కొంటున్నాడు.

తనవంతు పని అయిపోయినట్లుగా "స్పృహగాడు" అయిపు లేకుండా పోయినాడు!

కుక్కను గురించి సామాజిక పరంగా ఆలోచించకుండా శృంగారపరంగా ఆలోచించినందుకు రచయిత నిజంగానే సిగ్గుపడినాడు. సాంఘిక బాధ్యతల్ని విస్మరించి... సమసమాజ నిర్మాణంలో తనవంతు పనిని మరిచి- క్షణిక సుఖాల పట్ల వ్యామోహితుడు కావడం తప్పు!

తప్పా? తప్పున్నరా! చెప్పు చేతికి తీసుకుని కొట్టుకొన్నా తప్పు తప్పే!-

తన తప్పు తనకు తెలిసేసరికి తన్నా బలహీనతకు

లోను చేసిన ఆ కుక్కపైన మహా చెడ్డకోపం వచ్చేసింది.

ఆ కోపంతో నే విసురుగా ఆ కారువైపు చూసినాడు

కారు అక్కడలేదు.

కారు వెళ్ళిపోయింది. కారుతో పాటు ఆ కార్లో అందమైన అమ్మాయి కూడా వెళ్ళిపోయింది. ఆమె వొడిలో బొచ్చుకుక్క కూడా వెళ్ళిపోయింది.

అయితే రచయిత ఆలోచనలు 'మాత్రం కుక్కచుట్టే పరిభ్రమిస్తున్నాయ్! అంటే.. రచయిత కుక్కను గురించి సామాజిక పరంగా ఆలోచిస్తున్నాడన్న మాట!

కుక్క!

చాలా విశ్వాసమైన జంతువు.

ఈ మాటను గుణితం నేర్పిన పాఠశాల్లోనే కంఠతా పట్టించినారు. అయినా ఎంతో జీవితానుభవం గడించిన తర్వాత కూడా ఈ మాట నిత్య నూత్నంగా తోస్తూ ఉంది.

"కుక్క చాల విశ్వాసమైన జంతువు! . కుక్క చాల విశ్వాసమైన జంతువు!!" అని రెండుసార్లు మనస్సులో మెదిలేసరికి- రచయిత కుక్కను వదిలిపెట్టి విశ్వాసాన్ని పట్టుకొన్నాడు. అసలు విశ్వాసం ఏమిటి? అది మనిషిలో ఎందుకుండాలి? ఉంటే లాభమేమిటి? లేకపోవడంవల్ల వచ్చిన నష్టమేమిటి? అసలు ఈ విశ్వం విశ్వాసంతోనే పరిభ్రమిస్తూ ఉందా? లేకపోతే భూమ్యాకర్షణశక్తి కారణమా? తీగను కదిలిస్తే డొంకంతా కదిలినట్లుగా విశ్వాసాన్ని గురించి ఆలోచిస్తూ, అంటే అనంతమైన విశ్వమే అతని కనుల ముందు నిలబడింది. ఆ విశ్వంలో విశ్వాసం లేనిమనుష్యులు బొమ్మల్లా కదిలిపోతున్నారు!

"అడుగడుక్కు ఆరుకాకుంటే పదహారు అబద్ధాలైనా చెప్పి అవసరాన్ని గడుపుకొనే కుక్కలు.... చేసిన ఉపకారాన్ని ఉట్టి కెక్కించే కుక్కలు.. ఉట్టి కెక్కించే కుక్కలు.. ఉట్టికెక్కించినా ఫరవాలేదు- ఉపకారానికి అపకారం తలపెట్టే కుక్కలు... వెనుకపోటు పొడిచేకుక్కలు... ముందు పొనిచ్చి వెనుక నవ్వేకుక్కలు..."

"ఛీఛీ! ఈ కుక్కలకంటే అసలు కుక్కలేమేలు!" అనుకొనేసరికి రచయితగారికి కుక్క మీద గౌరవం అమాంతంగాపెరిగిపోయింది.

"కుక్కంటే ఏమనుకొన్నారు?

అలనాడు ధర్మరాజు వెంట నడిచింది కుక్క. కట్టుకొన్న పెండ్లాం... కూడా పుట్టిన సోదరులు ఎవరి బలహీనతల్లో వాళ్ళు మధ్యే మార్గంలోనే రాలిపోతే కడదాక వెంటనడిచింది కుక్క. కడకు ధర్మరాజు ధర్మనిరతిని లోకానికి చాటడానికి ప్రతీకగా నిలబడింది కుక్క!

పాపం! దేవదాసు. భగ్నప్రేమికుడు దేవదాసు. పారూ! పారూ! అని కలవరిస్తూ కలవరిస్తూ కాటిలోనే కాపురంపెడితే అతన్ని కనిపెట్టుకొని కూర్చొనింది కుక్క!

ఎక్కడో విదేశాల్లో... ఎవరో దుండగులు రైలు





## సాహితీ కృషీవలుడు

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి విశిష్ట సాహితీ సేవలకు 1987 సంవత్సరానికి పతివాడ సుధాకర్ సాహిత్య బహుమతి 1116/- రూపాయలు లభించింది

'ఈనాడు శక్తివంతమైన వచనం కథలు వ్రాసే కొద్దిమందిలో మా పులికంటి ఒకడు - అనడం సహజోక్తే కానీ అతిశయోక్తి కాదు అట్లే కవితా రచనలో కూడా నేల విడిచి సాము చేయక సమకాలీన పరిస్థితులను అకళించుకొని కలం నడిపే మొనగాడు మా పులికంటి'' అని కళాప్రపూర్ణ డా దాశరథి ఒక చట్రములో యిమడని సాహితీ త్రివిక్రమమూర్తి మా పులికంటి'' అని కళాప్రపూర్ణ పద్మశ్రీ డా సి నారాయణరెడ్డి, 'తెలుగు వచ్చిన తెలుగువాడు పులికంటికృష్ణారెడ్డి' అని శ్రీ జి కృష్ణగార్ల అభినందనల్ని అందుకున్న శ్రీ పులికంటి తనదైన ధోరణిలో రాయలసీమ యాసలో ఆ సీమ జన జీవితాలకు అద్దం పడుతూ దాదాపు వంద కథలు రాశారు గత అయిదారేండ్లల్లో వివిధ మాస పత్రికలు నిర్వహించిన పోటీలలో 14 బహుమతులు పొందడం అరుదైన విశేషం

కవిగా ఈయన 1985లో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఢిల్లీలో ఏర్పాటైన కవిసమ్మేళనంలో పాల్గొన్నారు. ఈయన మంచి వక్త కూడా. ఇటీవలనే ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ, థియేటర్ ఆర్ట్స్ విభాగాలు వీరిని ఆహ్వానించి అయిదు రోజుల పాటు వరుసగా ఉపన్యాసాలు యిప్పించి గౌరవించింది

శ్రీ పులికంటి రాయలసీమ నుడికారపు సొంపుతో నండూరి వారి ఎంకిలా తాము అమ్మిని సృష్టించారు 'అమ్మి' వీరి జానపద సాహితీ కృషికి ప్రతీకగా నిలబడి పండిత పామరులందరినీ, అలరించడం విశేషం వీరి మొదటి నవల 'అగ్గిపుల్ల'కు 1983లో చక్రపాణి అవార్డు లభించింది □

## బంగళా కుక్కలు

పట్టాల్ని పీకేసినారట! ఆ స్టేషన్‌లోనే తిరుగాడుతూ ప్రయాణీకులు దయతలచి విదిలించింది తింటూ. బతుకుతున్న ఒక కుక్క దాన్ని గమనించిందట! పోనీలే! మనకెందుకని ఊరకే ఉండవచ్చుకదా? ఉండలేదే? వెంటనే ఎర్రదీపాన్ని నోటకరచిపట్కుంది వస్తున్న రైలు కెదురుగా పరుగెత్తింది కుక్క యిచ్చిన సిగ్నల్‌తో డ్రైవరు జరుగనున్న ఘోర ప్రమాదాన్ని అరికట్టినాడట!- ఆ తర్వాత ఎప్పుడో ఆ కుక్క చచ్చిపోతే- దాని జ్ఞాపకార్థం ఆ స్టేషన్ కెదురుగా ఒక స్మృతి చిహ్నాన్ని కూడా నెలకొల్పినారట!

ఆ తలంపుతో రచయిత దాదాపు తన్మయస్థితిని చేరుకొన్నాడు

తాను నిలబడి ఉండేది ఆ పెద్ద హోటల్ దరిదాపుల్లో నడిరోడ్డు మీద అనీ

అక్కడ అటు యిటు తిరుగాడుతున్నవాళ్ళు తన్ను గమనిస్తున్నారనీ- మరిచిపోయిన రచయిత "ఓహో కుక్కా! నీ జన్మ ధన్యమూ! అని పైకి అననే అన్నాడు

అతడా మాటనడం పకపక నవ్వు వినిపించడం- ఏక కాలంలో కలిసి మాట్లాడుకొన్నట్లుగా జరిగాయ్!

ఈ సారి నవ్వింది మాత్రం 'స్పృహగాడు' కాదు రచయిత మిత్రుడు రాజు

తన ఎదురుగా నిలబడి రాజు హ్హాహ్హాహ్హా! అని నవ్వుతూ ఉంటే- నిజంగానే రచయితకు అరికాలిమంట ఉచ్చి కెక్కింది

"ఛీ ఛీ! ఏం మనుష్యులో! ఎప్పుడు నవ్వాలో? ఎందుకు నవ్వాలో? ఎక్కడ నవ్వాలో? ఎట్లా నవ్వాలో? కూడ తెలియని- యింగితజ్ఞానం లేనిమనుష్యులు!'

రచయిత విసుగుతో నసిగినాడు

అవునవును! రచయిత మహాశయా! ఎప్పుడు? ఎందుకు? ఎట్లా? ఎక్కడ? అన్న విచక్షణాజ్ఞానం లేకుండా నవ్వుతున్నాన్నేను! నిజమేకానీ తాము మాత్రం ఎక్కడ నిలబడాల్నో అక్కడే నిలబడి రాక పోకల్ని కూడా పట్టించుకోకుండా తమ పోకడ తమదిగా ఉన్నారు బాగానే ఉంది కానీ ఏదీ ఆ కుక్క మీద పాటకు పల్లవి మరొక్కసారి అనండి!

అప్పటికి తాను నిలబడి ఉండేది నడిరోడ్డులో అనీ, వెన్నెల్లా అనుభవిస్తున్నది ఎర్రని ఎండనని రచయితకు తోచడం- అతని ఆలోచనా నిమగ్నతకు నిదర్శనం!

'నీ జన్మమే ధన్యమూ! ఓ కుక్కా!
ఓహో కుక్కా! నీ బతుకే బంగారము!
పల్లవి బాగుంది చరణం చెప్పుమరి!"

రాజు అడిగినాడు

పేదోళ్ళ బతుకుల్ని అద్దంగా పెట్టుకొని చేస్తున్న నినాదాల్లా కారుస్తున్న మొసలికన్నీళ్ళులా- పల్లవి చరణాల్తో వొరిగేదేముంది కానీ- ఈ మనుష్యులకంటే కుక్కలే ఎంతో మేలనిపిస్తున్నాయ్ రాజూ!'

'ఎప్పుడు కనుక్కొన్నావయ్యా వడ్లగింజలో బియ్యపుగింజలాంటి సత్యాన్ని?'

'కనుక్కోవడంకాదు కానీ- ఒక కుక్కనే సాక్కోవాలనుకొంటున్నా!

అది నీవల్ల కానిపని!'

ఎందుక్కాదు?

"ఎందుక్కాదంటే- నీ ముద్దుల చిన్న కూతురు మామిడిపండ్లు తెమ్మని మూడు రోజులనుండి పోరు పెడుతున్నాదన్నావ్ కదూ? ఆ అమ్మాయినడుగు ఎందుకు కాదో చెప్తుంది రెండో అమ్మాయిని నర్సింగ్‌హోమ్‌లో చేర్చాలని నానాయాతన పడుతున్నావ్‌కదూ? ఆ అమ్మాయి నడుగు యింకా వివరంగా చెప్తుంది'

ఏమని చెప్తారు?

నాన్నా! నాన్నా! ఊహల్లో తేలిపోతూ కాగితాల్ని ఖరాబు చేసినంత సులభంకాదు- కుక్కల్ని పెంచడమంటే! వారానికొక్క కేజీ మాంసం తెచ్చుకోలేని మనం దినానికి నాలుగు కేజీల మాంసాన్ని పెట్టి అల్సేషియన్ కుక్కను పోషించగలమా? 'కాళ్ళూ చేతులు పీకుతున్నాయ్!' ఒక్క యింజక్షన్ యిప్పించమని వారం రోజులుగా అమ్మ మొత్తుకుంటూ ఉంటే వినిపించుకోని మీరు- ఒక్కొక్క యింజక్షన్ వందరూపాయలకు పైగా పెట్టి ఆ కుక్క యింజక్షన్‌లు యిప్పించగలరా? పోనీ శాకాహారిని తెచ్చుకుందామంటారేమో? దినానికి సోలెడు పాలు మా మొగాన కొట్టలేని మీరు లీటర్‌పాలు పోసి కుక్కను సాకగలరా?' అని అడుగుతారు అడగకేం ఖర్మ? నిలదీసి కడుగుతారు!"

'పోనీ! సీమకుక్కల సంగతి వదిలేద్దాం అసలు సిసలైన నాటుకుక్కనే సాకుదాం స్వదేశీ సరుకు కావడంతో దేశాభిమానాన్ని గౌరవించిన వాళ్ళవుతాం!'

అది కూడా నీ యింట్లో ఉండమన్నా ఉండదు!"

ఈ మధ్య ఆ రూడాన్నేమైనా అభ్యసిస్తున్నావా?"

"దీనికి ఆ రూథం దాకా ఎందుకు? అనుభవం చాలదా?"

ఏవిటయ్యా బోడి నీ అనుభవం?"

'నీ యిల్లు స్వార్జితమా? పిత్రార్జితమా?

నీకు తెలియవే తెలియదా? ఆ మాత్రం తెలియకనే నా యింటిగుట్టంతా ఏకరువుపెట్టావా?'

'తెలియదనికాదు నువ్వుపడిన కష్టాన్ని నీ నోటితో నే విందామని!'

ఇల్లు కట్టిచూడు పెండ్లి చేసి చూడు- అన్నారుకదా? తలదాచుకోవడానికి ఆ జానెడు కొంప కట్టుకొనేటప్పటికి వద్దు బాబూ వద్దు పగవాడికూడా ఆ పలుబాట్లువద్దు

'అందుకే చెపుతున్నా కుక్క నీ యింట్లో కట్టిపెట్టినా ఉండదని!

"పొరపాటు పడు_న్నావ్? ఎప్పుడైనా కుక్కకు పిడికెడు కవళంవెయ్. ఆ తర్వాత నువ్వు కనబడే_చాలు. తోకాడిస్తుంది. అట్లాంటి విశ్వాసమైన జంతువును యింట్లోనే ఉంచుకొని మనం తినేటంతపెడే_ ఉండకుండా పోతుందా?"

"ఉండదు బాబూ! ఉండదు!"

"ఎందుకుండదు?"

"అదంతే! నువ్వు చెమటోడ్చి కట్టించుకొన్న నీ యింట్లో కుక్క ఉండమన్నా ఉండదు. అదే తాతముత్తాతలు కట్టించిపెట్టిన పెద్ద పెద్ద బంగళాల్లో ఉన్న కుక్కల్ని తరిమికొట్టినా పోవు!"

"ఎందుకని?"

"ఎందుకంటే?– నానారకాల మోసాలు చేస్తేనేకానీ నలుగురి నోళ్ళు కొడ్తేనేకానీ అంతంత పెద్ద బంగళాలు కట్టించడం సాధ్యంకాదు అవునా?"

"అవును."

"ఆజన్మల్లో అట్లా కట్టించిన బంగళాలకు ఈ జన్మలో కాపలా కాస్తున్నదీ ఆ తాత ముత్తాతలే!"

పూర్వజన్మం... పరజన్మం... జన్మజన్మాలు– వీటిని గురించి ఎప్పుడూ ఆలోచించని ఆ రచయితకు రాజు అభిప్రాయం మింగుడు పడకుండా గుటికలు మింగుతూంటే– రాజు ఎటో చూస్తున్నాడు.

ఆ రచయిత ఎవరో కాదు– నేనే!

కొన్ని క్షణాలైనా గడిచినాయో? లేదో? అంతలోనే ఒక కుక్క భీకరంగా మొరగడం చెవిని పడింది.

అటువైపు చూసినాను.

ఆ పెద్ద హోటల్లో... రెండో అంతస్థు బాల్కనీలో... ఒకకుక్క!– రాజువైపు ఉరిమురిమి చూస్తూ... వదిలిపెడ్తే పైనబడి పీకుతానన్నట్లు ఆర్భాటాలు చేస్తూ ఉంది.

"నిన్ను వదిలిపెట్నా అక్కడి నుండి నువ్వు కదలవులేరా నాయనా!" అన్నట్లుగా రాజు చిరునవ్వుతో దానివైపు చూస్తున్నాడు.

"నవ్వరా నవ్వు! మేఁవు తిన్నాఁవో? తిన్లేదో? ఎన్ని తిప్పలుపడ్డావో? మీకెట్లా తెలుస్తుందిరా?– మీకు తెలిసింది... కనిపించేది మా బంగళాలే!" అన్నట్లుగా అంతసేపు ఆర్భాటాలు చేసిన కుక్క నిలబడి ఆయాసపడుతూ ఉంది.

"కలిగిన మాటంటే కంట్లో పుల్లబెట్టినట్లే కదరా బాబూ!" అని అడుగుతున్నట్లుగా ఆ కుక్కవైపు చూస్తున్నాడు రాజు.

నేనూ అడగాలి. పూర్వజన్మాల్ని, పరజన్మాల్ని, జన్మ జన్మాల్ని గురించి ప్రబోధిస్తున్న మేధావుల్ని– అన్యాయంగా... అక్రమంగా... అవసరానికి మించినంతగా సంపాదిస్తే వచ్చే జన్మల్లో కుక్కలై పుడ్తారా? అని.

ఏమని చెప్తారో తెలియదుకానీ– అట్లా చెప్పేవాళ్ళు కూడా ఉండేది బంగళాల్లోనే అని మాత్రం నాకు తెలుసు! □

# ధర్మపథం బుచ్చినచ్చు



యాచన మనదేశంలో హీనంగా కనబడదు. అది ఒక వృత్తిగా కూడా తయారయింది. ఈ పద్ధతి పూర్వ కాలం నుంచీ అనుస్యూతంగా వస్తూ ఉన్నది. ప్రభువుల ఆశ్రయం లేని – లేదా వారిచ్చే భృతి కుటుంబ పోషణకు సరిపోని కవులూ, పండితులూ దేశాటన చేసి డబ్బు సంపాదించుకునే వారు. ఇచ్చే వారిని స్తుతించడం, ఇయ్యని వారిని తిట్టడం కూడా ఉండేది. లభించిన దానితో తృప్తిపడాలే గాని, ఎక్కువ ఆశ పడితే మొదటికే మోసం కలగవచ్చు. దీనికి ఒక ఉదాహరణ.

శ్రీమంతుల పైని, జమీందారుల పైని పద్యాలు చెప్పి, తృప్తిపరచి ధనం సంపాదించే ఒక కవి ఒకప్పుడు ఒక మన్య ప్రాంతానికి వెళ్ళి, ఆ ప్రాంతానికి పాలకుడైన ఒక కొండ దొర వద్దకు వెళ్ళాడు. ఆ దొరకు యుక్తాయుక్త వివేకం గాని, ధనం విలువ గాని తెలియదు. సంవత్సరాదాయం లక్షకు లోపునే! అతని దగ్గర దివాను, ఒక గుమాస్తా వ్యవహారాలన్నీ చూసుకుంటూ ఉంటారు. ఆ దొరను పొగుడుతూ అతన్ని చూచిన కవి కొన్ని పద్యాలు చెప్పాడు. దొరకు అవి బోధపడక, ఆ కవి ఏమన్నాడో చెప్పుమని దివానును అడిగాడు. ఆయన "ఈ దొరగారు చాలా గొప్పవారు. వీరి రాజ్యం స్వర్గం వంటిది. ఈయన ఇంద్రుని వంటివాడు" అని పొగడినా"డని తెలిపాడు. ఆ దొర సంతోషించి "అయితే ఇతడికి ఒక లచ్చ ఇచ్చి పంపేయి" అన్నాడు.

దివాను నిర్ఘాంతపోయాడు! దొరగారి ఆదాయమే లక్ష మించదు. ఖజానాలో, ప్రస్తుతం వెయ్యి రూపాయిలే ఉన్నాయి. అవీ ఖర్చుకు చాలవు. ఇదంతా గమనించి కవిని చాటుకు పిలిచి పరిస్థితులు వివరించి "మా దొరకు ఏమీ తెలియదు. డబ్బు సంగతి అసలే ఎరుగడు. మీకు ఎలాగో పది రూపాయలు ముట్ట చెబుతాను. స్వీకరించి సంతోషించండి" అన్నాడు. కవి సమ్మతించక, అధమం వంద రూపాయలైనా ఇమ్మన్నాడు. దివానుకు అప్పుడు ఒక ఆలోచన తట్టింది. రూపాయలు, చిల్లర నాణేలూ ఉన్న సంచీని ఒక దానిని దొరగారికి అందిస్తూ "నేనిస్తానంటే కవిగారు ఒప్పుకోలేదు. మీరే ఇవ్వండి" అన్నాడు. అప్పుడా యజమాని సంచీలో చేయి పెట్టి వెతికి వెతికి ఒక దమ్మిడీ (అంటే వెనుకటి రూపాయిలో 192 వ వంతు నాణెం) తీసి, కవికి యిస్తూ "ఈ బుచ్చి నచ్చు తీసుకో" అని అన్నాడు. కవి కొయ్యబారి పోయాడు. పది రూపాయలను తిరస్కరించిన కవికి పది దమ్మిడీలయినా లభించలేదు.

–బులుసు వేంకట రమణయ్య




## బాకీ తీర్చే దాకా భార్యను కుదువ!

బిల్గాంకు చెందిన భీమప్ప, సత్యప్ప అనే వో యిద్దరు స్నేహితులు ఒకే యింట్లో వుండేవారట. సత్యప్ప భీమప్ప వద్ద కొంత డబ్బు అప్పుగా తీసుకుని ఎన్నాళ్ళయినా తిరిగివ్వలేదట. వో రోజు తన బాకీ తీర్చమని భీమప్ప నిలదీస్తే తాగిన మైకంలో వున్న సత్యప్ప బాకీ తీర్చే దాకా తన భార్యను వాడుకోమని తన పెళ్ళాన్ని లాక్కొచ్చి అతని మీద పడేశాడట. ఇది బావుంది అనుకున్న భీమప్ప ఆ సత్యప్ప భార్య రుద్రవ్వను తీసుకుని, తన భార్యను వూళ్ళోనే వదిలేసి, తానామెతో గోవా వెళ్ళి అక్కడ కాపురం పెట్టాడట. కొంత కాలమయ్యాక సత్యప్ప డబ్బు సంపాదించి, అతని ఎడ్రస్సు కనుక్కొని వెళ్తే అతను బాకీ తీర్చద్దు అన్నాడట. ఈ తగవు విన్న వూరి పెద్దలు రుద్రవ్వ భీమప్పకే చెందుతుందని నిర్ణయించి, పరాయి వాని భార్యతో కాపురం చేసినందుకు సత్యప్పకు భీమప్ప నాలుగు వేలు యివ్వాలని తీర్మానించారట. ఆ రాత్రి భీమప్ప సత్యప్పను చంపేశాడట దీంతో ఆ వూరి ప్రజలకు కోపం వచ్చి భీమప్ప యింటికి నిప్పంటించి, ఎవర్నీ బయటకు రాకుండా కాపలా కాశారట తత్ఫలితంగా భీమప్ప, రుద్రవ్వ అతని మొదటి భార్య, పిల్లలూ అంతా చనిపోయారట.

## గృహిణి అగ్నిప్రవేశం!

భర్త అనుమానిస్తున్నాడని బాధపడిన బరోడాకు చెందిన వో గృహిణి అలనాటి సీతా మహాసాధ్విలా తన నిర్దోషిత్వాన్ని నిరూపించదలచి. ఆ మాట భర్తకు చెప్పి, మీద కిరసనాయిలు పోసుకు నిప్పంటించుకుందట. అలనాడు సీతాదేవిని తిరిగి ఆమె భర్తకు పప్పగించిన అగ్నిదేవుడీమె




విషయంలో జోక్యం కలుగజేసుకోనందువల్ల వళ్ళు కాలి చనిపోయిందట.

## సంచార గృహాలు!

బెంగుళూరుకు చెందిన భారత్ ఎర్త్ మువర్స్ (బెమెల్) సంస్థ సంచార గృహాలు నిర్మించారట. రెండు పడకగదుల యీ ఇళ్ళు ఎక్కడబడితే అక్కడ పెట్టుకోవచ్చునట! ఈ గృహం ఎయిర్‌కండిషన్ కూడా చేశారట

## బ్రిటిష్ రాణి మీద కోర్టులో దావా!

నా యింటికి అద్దె చెల్లించలేదు అవటాని సాక్షాత్తూ బ్రిటిష్‌రాణి ఎలిజబెత్ మీద వో యింటాయన కోర్టులో దావా వేశాడట. రియోడిజనిరోలోని ఆయన ఇంటిని ఒక రాయబార కార్యాలయంగా బ్రిటిష్ ప్రభుత్వం తీసుకుని, ఆ భవనంలో సదుపాయాలు సరిగా లేనందువల్ల మరో యింటిని ఎన్నుకున్నారట ఆ ఇంటికి అద్దె యిచ్చి ఆ ఎగ్రిమెంటును ఉపసంహరించుకోవడం ప్రభుత్వం మరచిపోవడంవల్ల యీ సంఘటన జరిగి ఆ కేసు కోర్టులో వ్రేలాడుతోందట

## అబలపై అయిదుగురి అత్యాచారం

ఎప్రిల్ 27వ తారీఖు మిట్ట మధ్యాహ్నం బళ్లారిలోని ఓ లారీ సంస్థవారి ఆఫీసు వెనుక భాగంలో వున్న వో చిన్న సైజు అడివిలో కట్టెలు ఏరుకోడానికి ఒకామె తన పన్నెండేళ్ల కొడుకుతో వెళ్ళిందట. ఆమెను చూసిన వో అయిదుగురు కామాంధులు ఆ పిల్లాడిని వో చెట్టుకు కట్టేసి, ఆమెను బలాత్కరించి, తమ వాంఛ వరుసవారిగా తీర్చుకుని పారిపోయారట

## భర్తను చంపించిన భార్య!

కర్ణాటక రాష్ట్రానికి చెందిన వో గ్రామంలో 45 ఏళ్ల మలగప్ప అనే అతని భార్య మల్లమ్మ అదే ఊరికి చెందిన 20 ఏళ్ల లాల్‌మహమ్మద్ అనే అతనితో రంకు సంబంధం పెట్టుకుని, ఈ విషయం తెలిసిన మొగుడు వద్దని తిట్టేసరికిహ మొగుడికి తెలిసింది కదా అని యదేచ్ఛగా యీ గ్రంథం నడపనారం భించిందట. ఇది చూడలేని ఆ మొగుడామెను చితకబాదితే ఆ రాత్రి ఆమె తన మొగుడిని రంకు మొగుడితో చంపించేసిందట.

## భార్యను చంపిన భర్త

కర్ణాటకలోని ఓ గ్రామంలో శంశుద్దీన్ అనే అతను తాగుడుకు తన భార్య డబ్బులివ్వలేదని ఆమె దాచుకున్న డబ్బులు దొంగిలించి బజార్నపడ్డాడట. ఈ విషయం కనిపెట్టి ముంతాజ్ భర్తను బజార్లో పట్టుకుని నానా తిట్లూ తిట్టిందట. ఆ తిట్లను అవమానంగా తీసుకున్న శంశుద్దీన్ భార్యతో ఇంటికి వెళ్ళి ఇంట్లో ఆమెను చితకబాది, అంతతో ఆగక కత్తితో ఆమె పొట్టలో పొడిచి, గిల గిలా తన్నుకుంటున్నా ఆమెమీద ఎక్కి కూర్చుని, పీక కోసి, తల వేరు చేసి, బయట పారేసి, ఆ కసి, అంతతోనూ ఆగక, ఆమె రెండు స్తనాలనూ కూడా కోసి, వేరు చేశాడట.

## పోలీస్ సైకిల్ తస్కరణ!

నూజివీడుకు చెందిన కొత్తపేటలో మానేపల్లి సోమేశ్వరరావు అనే 20 ఏళ్ళ పోలీసు కానిస్టేబుల్ తన యింటి ముందు పెట్టుకున్న సైకిలు పోయిందని ఆశ్చర్యంతో ఎగిరి గంతేశాడట. అతనసలు పోలీసు వుద్యోగంలో జూన్ 19వ తేదీ ప్రాంతంలో చేరాడట!

## మానవ కపాలాలతో నిర్మించిన పిరమిడ్!

అలనాడు తైమూర్‌రాజు తానో మహా గొప్ప పిరమిడ్‌ను నిర్మించాడట. ఈయన కట్టించిన యీ పిరమిడ్‌కు రాళ్ళూ, సున్నంతో పాటు తొంభయివేల మానవ కపాలాలు కూడా వాడారట. అనగా పెద్ద రాళ్లకు బదులు మానవ కపాలాలు వాడి, యీ పిరమిడ్‌ను కట్టారట

## కలర్ టి. వి.ల వల్ల అగ్నిప్రమాదాలు!

సోవియెట్ రష్యాలో కలర్ టి. వి లు కరెంట్ వోల్టేజీలోని మార్పుల వల్ల భగ్గున అంటుకుని, అవి బూడిదవడమే గాక, ఆ గది, ఇల్లు కూడా కాలి




బుగ్గయిపోతున్నాయట! 1985లో ఈ ప్రకారంగా 927 మంది చనిపోవడం, 512 మంది తీవ్రంగా గాయపడటం, 18400 గృహ దహనాలవడం జరిగాయట. □

# గోదావరి డి.ఎ.పి.

## ధర తక్కువ-ఫలమెక్కువ




వేరుకొద్ది బలం.
పైరుకొద్ది ఫలం.
వ్రేళ్ళు చక్కగా వృద్ధి
కావడానికి అధికపాళ్ళలో
అవసరం భాస్వరం.
లేత పైర్లు ఏపుగా
ఎదిగేందుకు అవసరం
నత్రజని.
భాస్వరం, నత్రజనుల
సరైన కలయికే మేలిమి
గోదావరి డి.ఎ.పి!

అత్యధిక భాస్వరం
పోషకాన్ని అందించే
గోదావరి డి.ఎ.పి, పైరువేసే
సమయంలో వాడేందుకు
అత్యుత్తమ ఎరువు.
గుళికల రూపంలో నున్న
గోదావరి డి.ఎ.పి. మెట్ట,
మాగాణి భూముల్లో
సుళువుగా, సమంగా
చల్లుకోవడానికి
ఎంతో అనువైనది.

46 శాతం భాస్వరం, 18 శాతం నత్రజని గల
గోదావరి డి.ఎ.పి.లో మొత్తం పోషకం 64 పాళ్ళు.
అతి తక్కువ ధరకు అంత ఎక్కువ పోషకం
అందించే ఎరువు గోదావరి డి.ఎ.పి. మాత్రమే!

గోదావరి డి.ఎ.పి అన్నివిధాల రైతుకు శుభకరి.
గోదావరి డి.ఎ.పి. వాడిన చోట ఇస్తుంది -
వేరుకు బలం-పైరుకు ఫలం-రైతుకు ధనం
కొనండి గోదావరి డి.ఎ.పి. అందుకోండి అధిక దిగుబడి.

Sobhagya/GFC/87/1

## పైరు దిగుబడికి - రైతు రాబడికి






**గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్**
50, సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాద్-500003.

## నిత్య నూతన సీరియల్

### కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

(గత సంచిక తరువాయి)

ఆ మరునాడు రామేశ్వరశాస్త్రిగారి ఆబ్దికము. ధర్మారావు రంగాపురము పోయి బ్రాహ్మణులను కుదిర్చి తెచ్చెను. రాజ్యలక్ష్మమ్మగారి యింటికి పోయెను. ఆమె యితనిని చూచి చాప తెచ్చి వేసెను.

ధర్మా: మీ చేతికి అరుంధతి చంద్రహార మిచ్చినదట. మరల తీసికొని రమ్మన్నది.

రాజ్య: ఆమె యిప్పుడు మీచేత పనులు చేయించుచు గూడ నుండెనా యేమి? ఎంత గడుసు పిల్ల!

ధర్మారావు నవ్వెను.

రాజ్య: నాయనా! నీ అత్తగారు, మామగారును రాక్షసులు. దానిని బహు కష్టములు పెట్టిరి. నీవు మంచి పని చేసితివి. పిల్ల సుఖపడుచుండగా, మీ యిద్దరు కాపురము చేయుచుండగా నా కొకసారి వచ్చి చూడవలయునని ఉన్నది.

అని తెచ్చి చంద్రహారమిచ్చెను. అతడది మెడలో వేసికొనెను.

రాజ్య: మెడ దగ్గర అతుకూడిపోయెను. నేను మరల కమసాలితో చెప్పి అతికించితిని. ఆమెతో చెప్పుము.

ధర్మారావు వెళ్ళుటకు లేచెను. ఆమె ఆగుమని దొడ్డిలోనికి పోయి నాలుగు పొట్ల కాయలు కోసి తెచ్చి యిచ్చెను. అతడు "మా దొడ్డిలో ఉన్నవండీ?" అనినను, కాదని బలవంతము చేసిపంపించెను. ఇంటికి పోయిన తరువాత రామచంద్రరాజు "నాకు గూడ బ్రాహ్మణులను పిలుచుకొని వచ్చితివా?" అనెను.

ధర్మా: "నీవామె శ్రాద్ధమే కదా చేయునది. ఊరిలో పురోహితుడున్నా"డనెను

రాజు: ఛీ ఛీ! నేను వానికి పెట్టుదునా? "న భోజయేత్‌స్తేన క్లీబ పతిత నాస్తిక తద్వృత్తి

వీరహాగ్రే దిధిషూపతి దిధిషుస్త్రీ గ్రామయాజకా జాపాలో ఒత్సృష్టాగ్ని మద్యప కుచర కూటసాక్షి ప్రాతిహారికాన్" అన్నాడు, గ్రామ యాజకునకు నేను పెట్టను. నీవు రంగాపురము వెడలితివి కదా! నా కొరకు కూడ బ్రాహ్మణులను పిలుచుకొని వత్తువనుకొన్నాను.

ధర్మా : ఇంటికి వెళ్ళి వచ్చెదను. అయినచో మరల పోదము.

రాజు : నేను వెళ్ళివత్తునులే!నీవు కూడ ఎందుకు?

రాజు వెళ్ళెను. బ్రాహ్మణులను తెచ్చెను. ధర్మారావు భోక్తలను స్నానము చేయుడని తాను స్నానము చేసి సంధ్యావందనాదికములు చేసి కూర్చుండెను. బ్రాహ్మణులు వచ్చిరి ఇన్నాళ్ళకు పితృ యజ్ఞము వేళ భార్య అగ్ని తెచ్చుట సంభవించినందుకు ధర్మారావు సంతోషించెను. ఇచ్చుట అర్చన యయిన తరువాత కబురు తెలిసికొని రామచంద్రరాజు తాను బ్రాహ్మణుల నర్చించెను. రాజుగారు బ్రాహ్మణుల కిద్దరకును చెరి రెండు రూపాయలిచ్చెను. ఆ నాడు సాయంకాలము రంగాపురములో రామచంద్రరాజు గారి పేరు మ్రోగిపోయెను.

ఇంటిలో ఆనాడు క్షీరాన్నము, గారెలు చేసిరి. రంగాజమ్మగారు వలదన్న కొలదియు కోడ లామెకు కొంచెము రెండును రుచి చూపించెను. ధర్మారావు ఇంటిలో నుండి పితృ శేషము తీసికొని పోయి రాజుగారి యింటిలో అందరును తినిరి. రంగాజమ్మ

గారు పితృశేషమని మరల క్షీరాన్నమును, సగము గారెయును తినిరి. ఆ నాడేమో ఆమెకు బహుసంతోషమయ్యెను.

రత్నగిరియు ప్రతియాబ్దికము నాడును బ్రాహ్మణుని పిలిచి బియ్యము, పప్పు, కూరయు ఇచ్చును. ఆనాడు రత్నగిరియు, దేవదాసియు ధర్మారావుగారి యింటిలో భోజనములు అయినవని తెలిసికొని భోజనము చేయుదురు. అందుచే భోజనములగు వరకు ప్రొద్దు క్రుంకును. ఆ నాడు దేవదాసి దేవాలయమునకు పోదు. అందుచే ఆనా డామె యింటికి రాలేదు.

పసిరిక ప్రతి యాబ్దికము రోజున ఎట నుండి వచ్చునో ధర్మారావు ఇంటికి సాయంకాల మగుసరికి వచ్చును. సావిత్రమ్మగా రతనికొక్క గారె యిచ్చును. అది అతడు కూర్చుండి తిని యింకొకటి అడిగి తీసికొనిపోయి తల్లికిచ్చును.

ఆనాడు పసిరిక ప్రొద్దు క్రుంకు వేళకు వచ్చెను. ధర్మారావును, రామచంద్రరాజును వీథి అరుగు మీద కూర్చుండిరి. పసిరిక క్రొత్త వానిని చూచి ధర్మారావుతో మాటాడక యింటిలోనికి పోయెను. అరుంధతి వాకిట నిలుచుండి అతనిని చూచి భయపడి లోనికి పరుగెత్తి అత్తగారితో "అత్తయ్యా! అది యేమిటి? అది యేమిటి" అనెను. పసిరిక పాము గాలి కూగులాడుచు వచ్చుచున్న ట్లుండెను సావిత్రమ్మగారు అతనిని జూచి నవ్వి "భయము లేదు. అతడు మంగ కొడుకు. నీకొక మరది" అనెను. అరుంధతి అతనినే పరిశీలించి చూచుచుండెను.

రామచంద్రరాజు పసిరిక యింటిలోనికి పోవుట చూచెను. మొదట ఆశ్చర్యపడెను. కాని వెంటనే జ్ఞాపకము వచ్చెను. రామచంద్రరాజు "తుని" లేచిపోవు నాటికి అయిదారేండ్ల వాడు పసిరిక. పొడుగెదిగెనే కాని ఏమియు మార్పు లేదు.

గారె తిని పసిరిక వచ్చి ధర్మారావు వంక చూచి పోవుచుండెను. ధర్మారావు ఈలవేసెను. ధర్మారా వతనిని పిలుచునది అట్లు, పసిరిక వెనుకకు తిరిగి చూచి పోబోవుచుండెను. ధర్మారావు మరల ఈలవేసి రమ్మనెను. రామచంద్రరాజు "పోయి పట్టుక ర"మ్మనెను. ధర్మారావు "అందడు. అతనితో ఎవరును పరుగెత్తలేరు. పైని పక్షులను చూచుచు పరువెత్తును." అనెను. పసిరిక వచ్చెను. ధర్మారావు "ఈయన నెరుగుదువా?" అనెను. పసిరిక "ఎరుగ"నని తల ఆడించెను. "రంగాజమ్మగారి కుమారుడు. మన కిద్దరకు అన్నగారు" అని సంజ్ఞ చేసి చెప్పెను. పసిరిక కనులు పెద్దవి చేసి "ఉస్" అని ఊదెను. అది తెలిసినదన్న మాట. "అన్న" అనెను. ధర్మారావు తల ఆడించెను. పసిరిక యొక్క పరువు తీసెను.

అన్నదమ్ము లిద్దరును కూర్చుండి రాత్రి ప్రొద్దు పోవు వరకును తండ్రి గాథలే చెప్పుకొనిరి. తండ్రి అనిన ధర్మారావున కెంత గౌరవమో రామచంద్ర రాజున కంత గౌరవము. అట్లు రాత్రి ప్రొద్దు పోవు వరకు కూర్చుండిరి. కబీరు దేవదాసిని వెంట పెట్టుకొని వచ్చెను. ధర్మారావు "అన్నా! చెల్లెలికి చదువు చెప్పవలయును. ఇంక పోదము" అనెను. రామచంద్రరాజు గిరిక చేయి పట్టుకొని "అమ్మా!" అనెను. గిరిక "అన్నా!" అనెను.

అరుంధతియు, గిరికయు సహపాఠినులయిరి, కాని అరుంధతి గిరిక ననుసరించ లేకుండెను. అత



డానాడు వాసకసజ్జికా లక్షణములు చెప్పెను. చదువుతున్న గ్రంథము భానుమిశ్రుని రసమంజరి. ఆ లక్షణములు చెప్పుచుండగా గిరిక కనుదోయి విప్పారి దివ్యజ్యోతిస్సులు వెలుగుచుండెను. అరుంధతి ఆమె వంకనే చూచుచుండెను.

రాత్రి రెండు జాము లయినది. గిరిక "స్వామి యింక ఎపుడు వచ్చును!" అనెను. ఆమె తన్మయత్వమును చూచి ధర్మారావు పుస్తకము కట్టిపెట్టి, కొన్ని ప్రార్థనా శ్లోకములు చదివి ఉపసంహరించెను. ఇంక గిరికను తీసికొని పొమ్మని ధర్మారావు కబీరుతో చెప్పగా అతడు తన్మయురాలి నామె నానుకొని నెమ్మదిగా నడిపించుచు కొనిపోయెను. అరుంధతి ఆమెను వీథి గుమ్మము దాక అనుసరించి ఆమె కనిపించి నంత మేర అట్లె నిలుచుండి అందే నిశ్చలమై గుమ్మమునానుకొని కదల లేదు. ధర్మారా వరుంధతి యెంత సేపటి వరకును రాకుండుట చూచి తానే పోయి ఆమె నట్టి స్థితిలో చూచి నవ్వుకొని ఆమెను పిలుచుకొని యింటిలోనికి తెచ్చెను.

అది పితృదినము. ఇద్దరును చెరియొక చోట పండుకొనిరి. ధర్మారావు చాప వేసికొని బయట నిద్రించెను. అరుంధతికి నిద్ర పట్టలేదు.

రాత్రి మూడు జాము లయ్యెను. "గోపాలాజిర కర్దమే విరహసే విప్రాధ్వరే లజ్జసే" – కర్మలు చేసిచేసి ఒడలెల్ల చెమట పట్టిన వారి వంక గోపాల దేవుడు తొంగి చూచుట లేదు. ఈ భోగము వారి పిల్ల మనస్సులో వచ్చి నిలుచుండెను. "ఆహా! ఏమి అదృష్టము!" అరుంధతికి గిరిక భగవంతునికొర కెదురు చూచుచు మేలుకొని ఉన్నట్లు తోచెను. భర్తను మేల్కొలిపి "గిరిక ఏమి చేయుచున్నదో చూచివత్తమా!" అనెను. అతడు "మన మిపుడు పోయి తలుపు తట్టరాదు. ఆమె నిజముగా స్వామియే వచ్చెనను కొనును. ఆ ప్రతీక్ష ప్రతీక్ష యట్లే ఉండవలెను గాని, అవాంతరములు కలిగినచో ఆమె గుండె చెదరిపోవచ్చును" అనెను.

అరుం: గిరిక అదృష్టవంతురాలు, జన్మమనగా ఆమెదే జన్మము.

ధర్మా : నీవు మాత్రము తక్కువదానవా? ఆమె ఎట్టి స్థితిలో ఉన్నదని ఊహించుటకే నీ విట్టిస్థితిలో ఉన్నావే!

అరుం : నా మనస్సు మీ మీదనే ఉన్నది మిమ్ములను వదలి పోవుట లేదు.

ధర్మా : అందుకు విచారముగా ఉన్నదా?

అరుం : ఈ రాత్రి మిమ్ము తాకరాదు, ఆ మాటన్నందుకు–

ధర్మారావునకు మరల నిదుర పట్టెను. అరుంధతి తనపతి గిరిక నట్లు భగవంతునకు నైవేద్యమిచ్చెనని తలచి అతనిని చూచి చూచి ఆశ్చర్యపోయెను. అది ఏమి శక్తి!

మరునాటికి రంగాజమ్మగారికి ప్రాణము మీదికి వచ్చెను. అమ్మలక్క లందరును ప్రోవయిరి. "అయ్యో! అంత జబ్బుగా ఉన్న ఆవిడకు గారెలు పెట్టుకొందురా? అదే కొంపకు తెచ్చినది" అనిరి. ఏమయిననేమి ఎగశ్వాసపుట్టెను. మాట పలుకు లేదు.

డాక్టరు వచ్చెను. పరీక్షించెను. మరల ఇంజక్షన్ లిచ్చెను. "రేపు వచ్చెద"నని వెడలిపోయెను. రామచంద్రరాజుగారు మూడు వందల రూపాయ లిచ్చెను. మూడు రూపాయల వలె ఆయన జేబులో వేసికొనెను. కారు మరి నిలువలేదు. ఎగిరిపోయెను.

రోగి ప్రొద్దు క్రుంకు వేళకు మాటాడ మొదలు పెట్టెను. గుణము తిరిగినదనుకొన్నారు. పది నిమిషములు సరిగానే మాట్లాడెను. తరువాత చేతులూరకే కదుపుట, ఏదో పట్టుకొనుచున్నట్లు చేతులు త్రిప్పుట, ఎవరును లేని చోట ఎవరో ఉన్నట్లు చూచుట, పలుకరించుట – యివి ప్రారంభించెను.

# వేయిపడగలు

సంధి పుట్టినదనిరి. ఏవైనా మంచి తెలుగు మందులు పోయవలయును గాని, ఇక నింగ్లీషు మందులు పని చేయవనిరి. సావిత్రమ్మగారు చేతులు, కాళ్ళు చూచెను. కొద్దిగా చలవలు క్రమ్మినట్లయ్యెను – "మంచి "సింహ ప్రతిపాలనము" దొరికినచో బాగుండును. వెంటనే శరీరము మరల ఉష్ణమునకు తిరుగు" ననెను. అర్చకుడు వచ్చి కుప్పెలరుగదీసి పోసెను. పోసినమందు సెలవుల వెంటనే తిరిగి వచ్చెను. చూపులో కూడ వికార మేర్పడెను. రాత్రి ప్రొద్దుపోయెను. చీకటు లొత్తుగా క్రమ్ముకొనెను. "రామేశ్వరశాస్త్రి రాజు" నిద్రపోయిన వాడు మేల్కొని పోరు పెట్టెను. రత్నంతరి పసివాని నూరడించుచుండెను. ధర్మారావు, అరుంధతియు, సావిత్రమ్మగారు, మంగయు, రత్నగిరియు అందరు ఇంటి నిండ ఉండిరి.

రంగాజమ్మగారు లేచి కూర్చుండబోయెను. కుమారు డానుకొని కూర్చుండ పెట్టెను. అందరును వలదనిరి. అంతలో ఆమెకు తెలివివచ్చెను. సంధి పోయినది. చక్కగా ఉన్నది. ఎవరికి ఏమియు తెలిసినది కాదు. అంత వ్యాధిలో ఇట్లులేచి కూర్చుండి సరిగ మాటాడుచున్నందుల కందరకు ఆశ్చర్యమయ్యెను.

రంగాజమ్మగారు తనకు కట్టిన గుడ్డ తీసి వేయమనెను. తీసివేసిరి. "పెట్టెలో మంచి చీరఉన్నది అది తెచ్చి కట్టు"మనెను. ఆ చీర వెలగలది. చాల పురాతనపు చీర. ఆ చీర రామేశ్వరశాస్త్రిగా రున్నపు డామె కట్టుకొను చుండెను. ఆ చీర కట్టినపుడెల్ల శాస్త్రిగారు "రంగాజమ్మగారు చాల అందముగా నున్న"దని అనెడివారు.

ఆ చీర యిప్పుడు కట్టుమనగా అందరును తటపటాయించిరి. రామచంద్రరాజుగారు "ఆ చీర మిగిలి మనకేమి చేయును? ఆమె చివరి కోర్కె అదికావలయును, కట్టు"మనిరి. "చివరి కోర్కె, ఏమిటి మరల బ్రదుకును" అని ఒకరనిరి. చీర కట్టిరి. "పెట్టెలో కస్తూరి తీసి చీరకు పట్టించు" మనెను. పట్టించిరి. ఒడలెల్ల సుగంధ ద్రవ్యములు రాయించుకొనెను. ప్రక్క తీయించి ఉదికిన వస్త్రములు పరపించెను. అందరకు అచ్చెరువుగా ఉండెను. అంతయునైన తరువాత, తాను పరుండి, అందరను దూరముగ పొమ్మని యొకనవ్వు నవ్వెను. ఆ నవ్వులో ఏమో మృత్యుదేవత తాండవించెను. ఆ నవ్వు వినినంతనే అందరకు అది ఏకరీతి సంధి అని తెలిసెను.

మరల ఆమెకు సంధి యథాప్రకార మయ్యెను. గది అంతయు సువాసనాభరితమైపోయెను. ఎవ్వరికిని చావు మంచము దగ్గర నున్నట్లు లేదు. ధర్మారావు పెట్టి తీయుచుండగా అందగరువత్తులు చూచెను. అవి తీసికొని వెలిగించెను. రాత్రి రెండు జాములయ్యెను, కోటలో నౌబత్తులు వాయించు చుండిరి. చల్లని గాలులు తిరిగి యింటి లోనికి రివ్వుమని పోసికొనెను. అందరకు ప్రాణములు హాయి అనిపించెను.

రంగాజమ్మగారు వణకెడు కంఠస్వరముతో 'చూచితివా?" అనెను. కుమారుడు దగ్గర కేగి "ఏమిటి" అని ప్రశ్నించెను. తల్లి పిచ్చి చూపులతో "చూచితివా" అని మరల అనెను. కొడుకు "ఏమిటి చూడవలయును? అక్కడ ఏమున్నది" అనెను.

ఆమె పిచ్చినవ్వు నవ్వి మరల చీర సవరించు కొనెను. కోడలు వచ్చి దగ్గర కూర్చుండి బిగ్గరగా "ఏమిటి చూడమందురు?" అనెను. అత్తగారు "వారు – వారు వచ్చినారు" అనెను. రామచంద్రరాజు తల్లి దగ్గరకు పోయి "అమ్మా! వచ్చినది ఎవరు?" అనెను.

ఆమె మరల పిచ్చిగా నవ్వెను. అంతలో లేచి కూర్చుండబోయెను. కుమారుడు పోయి లేవదీయ బోయెను. ఆమె "కూర్చుండు మనుము, కూర్చుండ బెట్టుము" అనెను. కుమారుడు "ఎవరిని" అని ప్రశ్నించెను.

ఆమె మరల నవ్వి ప్రక్కపై పరుండెను. కుమారు డొడ్డిగిలి దూరముగా పోయెను.

ఆమె అంతలో మరల లేవబోయెను. మరల కొడుకు పోయి పట్టుకొనెను. ఆమె "అరుగో వచ్చిరి, వచ్చిరి" అని నవ్వెను. కుమారుడు "అమ్మా! ఎవరమ్మా వచ్చినది?" అని అరచెను. ఆమె అతనిని నిదానించి చూచి "ఊఁ, ఎవరా? వారు – మీ నాయనగారు – అరుగో" అని నిలువలేక మంచముపై శయనించెను.

రామచంద్రరాజునకు తనకు జ్ఞానము వచ్చినప్పటి నుండియు తన తల్లిదండ్రు లన్న నొక విచిత్ర భావ ముండెడిది. వారిద్దరును రతీ మన్మథులనియు, శృంగార రసాధి దేవతలనియు, ప్రేమ అనిన అట్లుండ వలయుననియు ఊహించెడివాడు. చిన్నప్పుడు తానవిన తన తండ్రి ప్రాణములు వదలెడివాడు. "రామచంద్రా" అని తన్ను పిలిచెడి వాడు. క్షత్రియ ప్రభుత్వము లోకము నుండి పోయినది. మరల మా వానికి ధనుర్విద్య నేర్పి, అధర్వవేదము చెప్పించి, బ్రహ్మాద్యస్త్రముల ప్రయోగోపసంహారములు చెప్పి పెద్ద ధానుష్కుని చేయవలయును. మరల కృతయుగ ధర్మములు నడిపించవలయునని ఉబలాట పడెడివాడు – తండ్రి తొడ మీద కూర్చుండి తాను పురాణ కథలన్నియు ఆయన చెప్పగా విని తాను కూడ క్షత్రియుడే కనుక అట్టి సాహసకార్యములు తనకు కూడ సాధ్యములే అని తలచెడివాడు. వయస్సు వచ్చిన తరువాత తల్లియనేకములైన సార్లు తాను తన భర్తను పెండ్లి చేసికొన్న విధము

జరిగినకథ :16–సుబ్బన్నపేట జమీందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావు గారికి పట్టాభిషేకం జరుగుతుంది. రుక్మిణమ్మారావు గారి సాయంతో ధర్మారావు గుంటూరు కళాశాలలో చేరతాడు. ధర్మారావుకి సూర్యపతి అనే మిత్రుడు ఉంటాడు. ధర్మారావు సుబ్బన్నపేట వెడుతూ దారిలో రంగాజమ్మగారి కొడుకు రామచంద్రరాజును కలుసుకుంటాడు. పుట్టింటిలో తాను పడిన కష్టాలను ధర్మారావుతో అరుంధతి చెబుతుంది. రంగాజమ్మగారికి జబ్బు చేస్తుంది. ధర్మారావు దేవదాసి గిరికకు నాయికాలక్షణములు చెబుతాడు. రామచంద్రరాజు గిరికను చాలా ఆదరంతో చూస్తాడు.

రకరకములుగా కల్పించి కథలుగా చెప్పెడిది. రామచంద్రరాజు తన తల్లిదండ్రు లిద్దరును ఉదయన వాసవదత్తల వలె లోకారాధనీయ దాంపత్య శోభితులని నిరంతరము వారిని తన మనస్సులో ఆరాధించెడి వాడు.

తాను గృహము నుండి లేచిపోయినది కూడ దేశమును జయించి రాజ్యము వేలవలయుననన్న ఊహతో నే. కాని యిల్లు వదలిపోయిన తరువాత తన ఊహలలోని అర్థము తెలిసినది. నేటి ప్రపంచమునకుతనకు తన తండ్రి చెప్పిన పురాణ కాలపు కథలకును ఏమియు సంబంధము లేదు. క్రమముగా ఆయనకు లోకమనగా నిపుడెట్లున్నదో తెలిసెను. కాని మనసులో మాత్రము తల్లిదండ్రుల యందు తనకు గల భావమునకు చెరుపులేదు. అతని మనస్సులో తన తల్లిని తన తండ్రి వివాహము చేసికొనుట హరధనుర్భంగము చేసి రామచంద్రుడు సీతను చేపట్టినంత మహోత్కృష్ట కార్యముగా ఉండెను. ఆ వివాహము యొక్క ప్రత్యగ్రత అతని మనస్సు నుండి ఎన్నడును పోలేదు. తన తల్లి ఆయన దృష్టిలో సీతాదేవికి తీసి పోలేదు. ఇప్పుడు తన తల్లి మరణ వేళ ఈ స్థితి యందున్నప్పు డతని కుద్వేగము హృదయమున తోచి మాతాపితల యందు తనకు గల సర్వభావములు ఒక్కసారిగా అతని హృదయ కవాటమును ఛేదించెను. ఓహో! ఆమె మరణవేళ ఆమెకి తన తండ్రియే గోచరించెను. నిత్యవధువు వలె ఆమె మరణశయ్యపై సుగంధ ద్రవ్య పరిశోభితయై తన తండ్రికిష్టమైన చీర దాల్చి ఉన్న దనుట అతని హృదయమునకు మధుర భావ పరంపరా మిలనము కలిగెను. అత డొక యనిర్వాచ్యమైన పవిత్ర భావజగత్తున ఊగులాడు చుండెను.

రంగాజమ్మగారు పతిని కౌగిలించుకొన్నట్లు చేతులు చాచి, మరల ఎదపైచేర్చి చిరునవ్వు పెదవి మీద తాండవింపగా కనులు మూసెను. మరణ లక్షణములు తెలిసిన ఒక ముసలమ్మ "అయ్యో! క్రిందికి దింపుడు, దింపుడు!" అనెను. దింపుటకు రామచంద్రరాజు పోగా ధర్మారావు కూడ వెళ్ళెను. రాజు "నీవు వల"దనెను. ధర్మారావు కాదని యిద్దరును రంగాజమ్మ గారిని దించి కింద పెట్టిరి. రాజుగారు తులసి నీళ్ళు పోసెను. రంగాజమ్మగారు గుటక వేసెను. నారాయణ స్మరణ మామె చెవిలో కుమారుడు సతతముగా సుత్క్రమణవేళ దాటి పోవువరకును చేసెను. ఇంటిలో ఆమె కొరకు బిగ్గరగా నేడ్చు వారెవరును లేరైరి. ఆమె ఆత్మ శాంతముగ తరువాత నేమైనను సరే! ఆమె యేనాడు తన తండ్రి యిల్లు వదలి వచ్చెనో నాటి నుండియు పతిని దైవముగా కొలిచినది. పతికి చెడ్డ దినములలో కూడ అతనినే ఆరాధించినది. కొడుకు పరదేశమున కేగినను మగని వద్దనే ఉన్నది. భర్త చనిపోయిన తరువాత కూడ ఆయననే మనస్సునందు కట్టివేసినది. చివరకు మరణ వేళ సంధిచే అపస్మారమైన వేళ ఆమె మనస్సులో రామేశ్వర శాస్త్రియే నిలిచెను – నాభిగత యజ్ఞోపవీతి, గాఢవక్షస్కుడు, మందహాస పరిలిప్తాధరుడు, ధనుష్పాణి. సీతాదేవియు నామెయు ఒకరీతి మూర్తినే ధ్యానించిరి.

ధర్మారావు రంగాజమ్మగారిని దించి బయటకు వచ్చెను. నాడు కృష్ణాష్టమి, చంద్రోదయ మగుచుండెను. సగము మొరిక పోయిన చంద్రుడు సగము వాడబడిన పునుగుబిళ్ళ వలె నుదయించు చుండెను. రంగాజమ్మ, రామేశ్వరశాస్త్రి గారలు సహస్రథా ఉపయోగించిన యీ భోగద్రవ్యము మరల వారి సమాగమ వేళ రాకుండ ఉండలేక పోయెను. చీకటులును వెన్నెలలును సగమవి సగమివి సమపాళముగా నుండి గోరు వెచ్చటి నీటి వలె సేవనీయము లయ్యెను. ఒకా నొకచావు చావువలెనే ఉండదు. ఆ యిల్లు నిశ్శబ్దముగా ఉన్నను ఆ యింట మరణము జరగినట్లులేదు.

రామచంద్రరాజుగారు కూర్చుండి కూర్చుండి పకాలున నవ్వెను. రథంతరి "ఎందుకు నవ్వెదరు?" అనెను. రాజు "మా నాయనను పెండ్లియాడుట చేత ఈమె అదృష్టవంతురాలా? మా తల్లిని పెండ్లి యాడుట చేత ఆయన అదృష్టవంతుడా?" అనెను. అరుంధతిని ధర్మారావును గృహమునకు పొమ్మని సావిత్రమ్మగారు పంపించెను. ధర్మారావు పోనవగా రామచంద్రరాజు పంపించెను. ఇద్దరు ఇంటికి పోయి స్నానము చేసిరి. ధర్మారావు విడిగా పరుండెను. అరుంధతి "ఏమి! తాకరాదా?" అనగా "ధర్మశాస్త్రము కనుగొనవలయును. నాకు మైల యేమో" అనెను. "తల సరిగా తుడుచుకొనుము, రేపటికి జలుబు చేసి జబ్బు చేయునేమో? అర్ధరాత్రి వేళ స్నానము!" అని పతి చెప్పగా అరుంధతి చీర అంతయు పెట్టి అరగంట సేపు దీర్ఘ శిరోజములను తుడుచుకొనెను.

తెల్లవారు వరకు రంగాజమ్మగారి మృతి ఊరంతయు పాకెను. జనము తీర్థప్రజ అయిరి. "ఆహా ఆమె చనిపోయినట్లే లేదు. చావులో కూడ చిరునవ్వు నవ్వుచునే చచ్చెను. ఏమి బ్రతుకు బ్రతికినది రాజా బ్రతుకు! మహారాణి వలె చచ్చిన" దనిరి.

అందరును చూచుటకు వచ్చినట్లే నాగన్న సెట్టియు వచ్చి విచారించి పోవుచుపోవుచు, ధర్మారావుతో "బాబూ! ఒక మాట!" అనెను. ధర్మారావు వెళ్ళగా "మా యింటి దాక ఒకసారి వత్తురా" అని తీసికొని పోయి నోటు మీద వసూలు వేసి యిచ్చెను. ధర్మారా "విదియేమి" టనెను. సెట్టి "అయ్యా! నీ సొమ్ము నాకెందుకు? చచ్చి స్వర్గానికి వెళ్ళినది రంగాజమ్మగారు. ఈ నోటు బాకీ ఆమె నాకిచ్చి ఆరునెలలయినది. ఆ నాడు సాయంకాల మావిడయే వచ్చి అప్పు వంద రూపాయలు మీకిమ్మనియు తాను తీర్చెదనియు చెప్పగా ఇచ్చితిని, ఇదిగో నీ నోటు" అని తెలియజెప్పెను.

ధర్మారావునకు దుఃఖ మా కంఠముగ నయ్యెను. తల చింపిన కాగితము జేబులో పెట్టుకొని ఉబుకుచున్న దుఃఖమునదిమి పైకి రానీయక మరల అచ్చటికే పోయెను.

రంగాపురము నుండి ధర్మశాస్త్రవేత్త ఒక శాస్త్రిగారు చనుదెంచి దహన సంస్కారములు జరిపించెను. అచ్చముగా గంధపు చెక్కల మీదనే దహనమయ్యెను. దహనవేళ నూరు రూపాయల గోవును కొని రాజు దానమిచ్చెను. దహనమున కయిదుపందలు వ్యయమయ్యెను. అపరకర్మ విరివిగా చేయునన్నట్లున్నది. నాల్గు వైపుల బ్రాహ్మణులకును వార్తలు పోయెను. ఆ కబురు గాలియే ఊదెను.

చివరి రోజుల కర్మలు వైభవముగా జరిగెను. రామచంద్రరాజు పది వేలు వెచ్చించెను. గోదాన మన్న చోట నెల్ల ప్రత్యక్ష గోదానమే కాని ప్రత్యామ్నాయము లేదు. తెచ్చిన చెంబులు, పీటల వద్ద నుండి విరివిగానే జరిపెను. రాజుగారు సంస్కృత భాషా పరిచయము, స్మృతి జ్ఞానము కలవాడగుట చేత దగ్గరలో లోపము జరుగనీయలేదు



## గడుసులోకం —బాబు







ధర్మారావుగారి అక్కలు, బావలును వచ్చిరి. హైమవతి సూర్యనారాయణలు రామచంద్ర రాజును బాగుగా ఎరుగుదురు. వారు రాజును పరామర్శ చేసిరి. రాజుగారు రెండు హరికథలు చెప్పించెను. వీధి నాటకమాడించెను.

**జనము "జమీందారుగారి పట్టాభిషేకముకన్న రంగాజమ్మగారి మృతియే దివ్యముగానున్న" దనిరి.**

కర్మయయిన చివరి రోజున రామచంద్రరాజుగారును, ధర్మారావును కూర్చుండిరి. రాజు ఇన్నాళ్ళుత్సాహముగా నవ్వుచు వ్రేలుచున్న వాడు కర్మయంతయు అయిన తరువాత ధర్మారావును కౌగిలించుకొని ఏడ్వ నారంభించెను. ధర్మారావతని ఓదార్చెను.

రాజు "నాయనా! ఈ సంవిధానము చిత్రముగా లేదా? ఎక్కడి గంజాం జిల్లా! ఎక్కడి సుబ్బన్నపేట, నాయనగా రక్కడికి పోవుటయేమిటి? ఆమె ఆయనను ప్రేమించుట ఏమిటి? నేను కలుగుట ఏమిటి? భిన్న వర్ణముల వారము మన మిద్దరము అన్న దమ్ములమేమిటి? ఇంత దూరము వచ్చి, నా తల్లి వర్ణము చెడకుండ ఇట్లు రక్షింపబడుట ఏమిటి? ఆయమ యాశీలము ఆదివ్యమైన మరణము ఆ పాతి వ్రత్యము! చూడుము – అవతార చరిత్రము వలె నున్నది కదా!" అని దీర్ఘనిశ్వాసము వదలెను.

అది రాత్రి వేళ. శుక్ల పక్షము మొదటి రోజులు. పంచమియో, షష్ఠియో! ధర్మారా వాకాశము వంక చూచెను. చంద్రాస్తమయ మగుచుండెను. అస్తమించుచున్న చంద్రునిపై నల్లనిమేఘ మావరించి ఉండెను. పశ్చిమ దిక్కున నల్లని మేఘము లెడమెడముగా పది బదునొకండు నిశ్చలములై ఉండెను. అస్తమించుచున్న చంద్రుని కాంతిచేత ఆ మేఘముల నడిమి భాగమెల్ల దప్తమై

# వేయిపడగలు

ఆ మేఘములున్న తావు నల్లనై యాటు వేళ ఉప్పుకాలువ సముద్రముతో కలసిన చోట చిన్ని చిన్ని పడెలుగా నల్లని మట్టి దిబ్బలుగా ఉన్నట్లు. పశ్చిమ దిక్కంతయు ప్రకాశించెను. అదొక మధురమైన వెన్నెలయు గాని చీకటియు గాని ఒక కాల మంతరించుచున్నట్లు తోచెను. తరువాత చీకట్లు పులుముకొనెను. లోకమున రసజ్ఞత నిశ్శేషముగ అంతరించెనా అన్నట్లు పశ్చిమమున మిగిలిన వెలుగు రేఖలు కూడ మాయమయ్యెను.

ఆ రాత్రి ప్రొద్దుపోయి యింటికి వచ్చిన ధర్మారావు నరుంధతి సాధించెను. "మేమిద్దరము ఇంట బిక్కుబిక్కు మనుచు కూర్చుండ వలయును. మీరు ప్రొద్దు పోవు వరకును షికారులు కొట్టివత్తురు. వదినెలు, అన్నలును ప్రొద్దున వెళ్ళిపోయినప్పటి నుండియు ఇల్లు బావురుమనుచున్నది" అని. ధర్మారావు "ఇది క్రొత్త సంగతియే! ఈ పో రిదివరకెరుగను. నీవు సుఖ మొక్కటియే తెచ్చితివనుకొన్నాను. కొంత గ్రంథము చంకన పెట్టుకొని వచ్చితివి" అని ఎత్తి పొడిచెను. ధర్మారావునకు రంగాజమ్మగారి మృతి ఒక చిత్రమైన అనుభూతిని తెచ్చెను. రామచంద్రరాజన్న మాట అతని మనస్సులో సుడులు తిరుగుచుండెను. రంగాజమ్మగారు తన కార్యమున కంత సాయము చేయుట, ఆమెక తనయం దంత ప్రేమ, తా నామెకు చేసిన దేమియు లేదు. హృదయానుభూతియే చిత్రమైనది. అది ఏమో ఎట్లో అనుభవించును. ఒక్కొక్క అల్పాను భూతి యిదమిత్థమని నిర్ణయించుటకు వచ్చును. ఒక్కొక్క మహాను భూతి మనో వీధికి అందకయే, యింద్రియములకు సన్నిహితమై, సువ్యక్తము గాక హృదయమునందే ఏదో తెలియరాని చక్కిలిగింత పెట్టినట్లుండును.

అది హృదయమునందే సన్నని తరంగములుగ లేచి యింద్రియములదాకవచ్చి – వెనుకకు పోవుచున్న సముద్రపు కెరటము వచ్చి ఒడ్డునందు తాకియు పిల్ల కాలవలోనికి రానీయకనీ 'రుపసంహరించు కొన్నట్లు తదనుభూతితరంగము ఇంద్రియకుల్యాల కెక్కనీయక దాని చివళ్ళు మాత్రమే తాకి మరల నాతరంగమున అందే లయింప చేయును. అట్టి ఒక అనుభూతిని ధర్మారావు పొందుచుండెను.

అరుంధతీ ధర్మారావు లేక శయ్యాగతులై ఉండిరి.

అరుం : ఏమో ఆలోచించు చున్నట్లున్నది.

ధర్మా : రంగాజమ్మగారిని గురించి

అరుం : ఏమని?

ధర్మా : మన కార్యమునకు నే నీ ఊరిలో ఉన్న నాగన్న సెట్టిని అప్పడిగితిని. అతడీయనని మరునాడిచ్చెను. నాకప్పుడే ఆశ్చర్యమయినది. ఆ డబ్బు రంగాజమ్మగా రిప్పించినదట. సెట్టి బాకీ వసూలు వేసి నోటు నాకు తిరిగి మొన్న ఇచ్చి వేసెను ఇదే గుప్తదాన మందురు. ఇట్టి గుప్తదానము చేసిన వారు మహాలోకము లేవో పొందుదురట. ఆ లోకముల సౌభాగ్యము చెప్పలేము.

అరుం : మీ రందరును నాకు చూడగా చూడగా మనుష్యుల వలె తోచుటలేదు. రంగాజమ్మగారు మరీను. ఆమె ఎవరో అప్సరః స్త్రీ. లేకపోయిన ఆ అత్తరు లేమిటి? ఆ కస్తూరి వాసనలేమిటి? ఆ వెలగల చీరలేమిటి? బ్రతికినన్నాళ్ళు ఆ భోగ మేమిటి? చనిపోవుచు గూడ అట్లి! ఏదో శాపము పొంది భూలోకమునకు వచ్చినది. మరల తన దారిని తాను పోయినది. ఆమె స్వర్గమే చేరియుండును.

ధర్మారా వరుంధతిని తనివితీర ముద్దాడెను. అది ఏమో చిత్ర భావము. తన ఆనాటి ప్రియా సమాగమము' రంగాజమ్మగారి కాత్మార్పణము చేయుటగా అతడనుకొనెను.

(ఇంకా ఉంది)






# సుప్రీమ్ వక్కలు

# సుప్రీమ్ సుగంధ ద్రవ్యాలు









# సుప్రీమ్ ఫార్ములా

మేలు రకములైన పీటి వక్కలు, విలువైన యాలుక్కాయలు,లవంగాలు, జాజికాయ, జాపత్రి, మెంథాలు, పచ్చ కర్పూరం మొదలైన సుగంధ ద్రవ్యాలు, వక్కపొడి తయారిలో మాకున్న అనుభవం, మీకు అత్యుత్తమమైన వక్కపొడి అందించాలనే మా 30 సంవత్సరముల అహర్నిశ కృషి, అన్నిటికి మించిన మీ అభిమానం, వీటి అన్నిటి కలయికల ఫలితమే.

# క్రేన్

## వక్కపొడి
## సుప్రీమ్ క్వాలిటి




దీనికి సాటి మరొకటి లేదు.

TARA-CBNP-768

# మహర్షులు స్వామీజీలు బాబాలు

## రాజకీయాలు!

ప్రాచీన కాలం నుంచీ మనదేశంలో గురువులకు ఒక ప్రత్యేకమైన పవిత్రమైన స్థానం ఉంది మహర్షులు, స్వామీజీలు, మఠాచార్యులు, రాజ గురువులు, బాబాలు, ఫకీరులు మఠాధిపతులు – ఇలాగ ఎంతో మంది జ్ఞాన కోవిదులు, సమాజ హితైషులు రంగంలో ఉంటూనే వచ్చారు జాతి ప్రగతికోసం, సామాజిక వికాసం కోసం వయో వృద్ధులూ, జ్ఞానవృద్ధులూ అయిన గురువుల సలహాలను రాజాదిరాజులు సయితం స్వీకరించడం మన భారతంలో మొదటి నుంచీ ఉన్నదే ఇందులో అనుచితం కాని అసహజంకాని ఏమీ లేదు

రామాయణ కాలంలో వశిష్ట విశ్వామిత్రాది మహర్షుల మాటలు రాజుల శాసనాల లాగే చలామణి అయ్యేవి భారత కాలం నాటి ద్రోణ కృపాచార్య మొదలగు గురువుల వచనాలు చతుర్వేదాల మాదిరి ప్రమాణాలుగా స్వీకరించ బడేవి వేదకాలం నాటి నుంచి నేటి వరకు ఎంత మందో మహర్షులు పూజ్యగురుమూర్తులుగా వెలుగొందారు

చరిత్ర పరంగా ఆలోచించినా అంతే ప్రతి రోజుకూ ఉచితానుచితాలను తెలియ జేయడానికి నిర్దిష్టమైన సహేతుకమైన నిర్ణయాలు తీసుకోవ డానికి తగిన రాజగురువులుండే వారు అలె గ్జాండర్‌కి అరిస్టాటిల్ పరమగురువు చంద్ర గుప్తుడికి చాణక్యుడిమాట దైవశాసనం విద్యా రణ్యుడు హరిహర బుక్కదేవరాయల రాజగురువు కాగా కాశీ విశ్వేశ్వరా చార్యులు కాకతి గణపతిదేవుల రాజగురువు ఛత్రపతి శివాజి తన సమస్త రాజ్యాన్నీ సమర్థ రామదాసుకి అప్పజెప్పి ఆయన పేరుమీదే దర్మపాలన చేసాడని మనం వింటూనే ఉన్నాము ఇలాగ ఆదర్శ గురుదేవులకు మన దేశంలో మొదటి నుంచీ ప్రశస్తమైన స్థానం ఉంది ఆ స్థానబలం వారిని జాతి సేవకు మరింతగా అంకితమయ్యేలాగ చేసిందే తప్ప స్వార్థానికి స్వప్రయోజనానికి అదికారదర్పానికి, పదవీ వ్యామోహానికి దారి తీయలేదు కానీ నేటి పరిస్థితి అందుకు బిన్నంగా ఉంది ఇప్పుడు గురువులుగా పేర్కొనబడుతున్న వారు అందరూ కాక పోయినా ఎంతో మంది పవిత్రమైన 'గురుశబ్దానికి కళంకాన్ని తెస్తున్నారు ఇందులో అవగింజంతయినా అబద్ధం లేదని ఎవరయినా ఒప్పుకుంటారు

వేదవ్యాస వశిష్ట, వాల్మీకాది మహర్షులతో పునీతమైన మన భూమి జగద్గురువులు ఆది శంకరాచార్య, మధ్వాచార్య, రామానుజా చార్య, నింబార్క, వల్లభ వాదిరాజు, రాఘవేంద్ర, బుద్ధ, మహావీర, జరాదుష్ట్ర మొదలగు వారితో పులకించి పోయింది వీరిలో పరమావధూతలు శ్రీరామకృష్ణ షిరిడీసాయి మొదలగు వారు కాగా జాతిని ఉత్తేజపరచి కర్తవ్య మహర్షులు గానిలిచినవారు స్వామి వివేకానంద కృష్ణచైతన్య ప్రభు వంటివారు

'అయితే ఇదంతా గత వైభవం కాగా ఇప్పుడు మహిమోపేతులుగా, మహిమాన్వితులుగా పిలువ బడుతున్న మహర్షులు, స్వామీజీలు, బాబాలు భారతీయ గురుపరంపరకు ఉన్న ప్రతిష్ఠకు భంగం కలిగిస్తున్నారు ప్రాపంచిక లాలసతతో పర మార్థాన్ని విసర్జిస్తున్నారు భైభోగ కాంక్షతో భారతీయ మవులిక గ మతత్వాన్ని విస్మరిస్తు న్నారు ఇదెంతయినా శోచనీయం

ప్రస్తుతం మనదేశంలో బాగా ప్రచారంలో ఉన్న కొంత మంది గురువుల గురించి అరమరికగా పరిశీలించినా ఈ విషయం బోదపడుతుంది అందరి గురించి చర్చించడం అసాద్యం కనుక స్థాలీపులాక న్యాయంగా ఓ అయిదారుమంది గురువులను గురించి తెలుసుకుంటే చాలు విశ్వవిఖ్యాతులయిన ఆచార్య రజనీశ్, మహర్షి మహేశ్‌యోగి, సత్యసాయి బాబా, స్వామి దీరేంద్రబ్రహ్మచారి, గురుమాయి చిద్విలసానంద, కంచి శంకరాచార్యల గురించి స్థూలంగా చర్చించవచ్చు

## సెక్సర్షి ఆచార్య రజనీశ్

ఈయన పేరు వినని వారు ఉండరు ఒక సామాన్య ఉపన్యాసకుడు భగవానుడి గా రూపొందాడు ఈయనవెంట లెక్కలేనంత మంది రాజకీయనాయ కులు, పెట్టుబడి దారులు సినిమా తారలు– దేశదేశాల వారు – ఉండేవారు టెరెన్స్ స్టాంప్, వినోద్‌ఖన్నా మహేశ్‌భట్ మొదలైన ప్రసిద్ధులు ఒకప్పుడు ఈయన అడుగులకు మడుగులు ఒత్తిన వారే

పూనాలో ఈయన ఆశ్రయం వెలిసిన మొదట మొదట్లో ప్రపంచం నలుమూలల నుంచీ వచ్చి లక్షలాది మంది శిష్యులయ్యారు వీరందరూ కోట్లకు

ఆచార్య రజనీశ్



పడగలెత్తిన వారే! రజనీశ్ వెంట అలా పిచ్చిగా శిష్యగణం ఎగబడడానికి కారణం ఆయన బోధించే సెక్సేనని అనుకోవడంలో పొరపాటు ఉండబోదు

సెక్స్‌ను జయించడానికి ఇంద్రియ నిగ్రహం ఒక సాధనమని మన పూర్వీకులు ప్రబోధిస్తే రజనీశ్ సెక్స్‌ను సెక్స్‌తోనే జయించాలని స్పష్టం చేసాడు రతికేళి కూడా భగవదారాధనేనని సెక్స్ పాపం కాదని దానికి నియమనిబంధనలు ఉండకూడదని తేల్చి చెప్పాడు ఫలితంగా యువత మొత్తం ఈయనకు పాదాక్రాంతమై పోయింది పూనా వాసుల గొడవ భరించలేక అమెరికాకి వెళ్ళి ఒరెగాన్ పట్టణ సమీపంలో రజనీశ్‌పురం రూపొందించాడు 64,000 ఎకరాల వైశాల్యమున్న నగరం తయారయింది 3000 ఎకరాలు సేద్యంకోసం నిర్దేశించబడింది ఈయన ఎంత దర్జాగా బతికాడో చెప్పడానికి ఈయన నివాసగృహం ముందు బారుగా నిలిచి ఉండే 90 రోల్స్ రాయిస్ కార్లు చాలని ఎంతో మంది అంటూ ఉంటారు

అమెరికాలో ఉండగానే ఈయన మీద రకరకాల ఆరోపణలు వెలువడ్డాయి ఆదాయపు పన్ను నేరాలు, సెక్స్‌నేరాలు కోకొల్లలు ఈయన కుడిభుజం అని భావించబడిన మా ఆనంద్ షీలా కోట్ల కొద్దీ ధనంతో అనుయాయులతో పారిపోయింది రజనీశ్‌కి ఉన్నంత సెక్స్ పిచ్చి ఎవరికీ లేదని ఆయన పలురకాల సుఖవ్యాధి పీడితుడని మా ఆనంద్ షీలా అంటే ఆమెను అతి నీచమైన భాషలో తూలనాడుతూ తనపై ఆమె హత్యా ప్రయత్నం చేసిందని రజనీశ్ ఆరోపించాడు

నేరాలు రుజువు కావడంతో అమెరికా ప్రభుత్వం ఆచార్య రజనీశ్ భగవానుడిని జైలులో పెట్టింది దేశం నుంచి వెళ్ళగొట్టింది. ఆశ్రయం కోసం నేపాల్, థాయిలాండ్, గ్రీస్, స్పెయిన్, జమైకా, యురుగువే దేశాలన్నీ తిరిగి అందరి చేతా కాదనిపించుకుని మళ్ళీ పూనా చేరాడు

గర్భం రాకుండా పురుషులు ఉపయోగించే తొడుగులను రజనీశ్ శిష్యులకు అమ్మిన ఒక సామాన్యమైన కంపెనీ నేడు కోట్లాది రూపాయల లాభాన్ని గడించిందని వింటుంటే రజనీశ్ సెక్సర్షా లేక మహర్షా అని ఎవరికయినా అనిపిస్తుంది

## మహిళా మోహి మహేశ్ యోగి

భావాతీత ధ్యానాన్ని గురించి విశ్వవ్యాప్తంగా ప్రబోధిస్తున్న మహర్షి మహేశ్ యోగి హెడ్ క్వార్టర్స్ స్విట్జర్‌లాండ్‌లో ఉంది ఈయన శిష్యగణంలో సుప్రీంకోర్ట్ మాజీ ప్రధాన న్యాయమూర్తి భగవతి, ఇటీవల రాష్ట్రపతి పదవికి పోటీ చేసిన కృష్ణ అయ్యర్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికల అధిపతి రామ్‌నాథ్ గోయెంకా వంటి ప్రముఖులు ఎంతమందో ఉన్నారు

మహేశ్‌యోగి కోటీశ్వరుడు. నిర్వాణానికి భావాతీత ధ్యానం సోపానమని ఈయన ప్రబోధం ఈయన మాటలు విని జీవితంలో అమూల్యమైన కాలాన్ని వృధాగా పోగొట్టుకున్నామని ఎంతో మంది శిష్యులు ఈయనపై దావా వేశారు భూమికి సంబంధించిన కొన్ని విషయాలలో మహేశ్ యోగి మోసానికి పాల్పడ్డారని సాక్ష్యాలతో సహా కొంత మంది శిష్యులు చెబుతున్నారు

గాలిలో ఎగిరే విషయాన్ని నేర్పిస్తానని చెప్పి 11 సంవత్సరాలుగా మోసం చేసాడన్న నెపంతో మహేశ్‌యోగి శిష్యుడు ఒకరు 137,890 అమెరికన్ డాలర్ను నష్టపరిహారంగా కోరుతూ కోర్టు కెక్కాడు ఆర్థికనేరాలే కాక మహేశ్‌యోగి సెక్స్ నేరాలు కూడా చేసినట్టు అభియోగాలున్నాయి ఈయన స్త్రీల పట్ల చాల అసభ్యంగా ప్రవర్తించే వాడని ఆయన శిష్యులే చాలమంది చెబుతున్నారు. మియా ఫర్రో అనే శిష్యురాలిని ఈయన శారీరకంగా బాగా వేధించేవారని కొంతమంది శిష్యులు బాహాటంగానే అంటున్నారు

ఎనిమిది పదులకు దగ్గరపడుతున్న ఈ భావాతీత ధ్యాన మునికి ఆడవాసన ఎందుకో అర్థంకాదు కాని, ఆశ్చర్యం మాత్రం వేస్తుంది

## వాచీల బాబా పుట్టపర్తి

ఈయన అసలు పేరు రత్నాకరం సత్యనారాయణ కాని సత్యసాయిబాబాగానే అందరికీ తెలుసు అనంతపురం జిల్లాలోని పుట్టపర్తి ఈయన నివాసకేంద్రం సునీల్‌గవాస్కర్, మనోజ్‌కుమార్, నాని పల్కీవాలా, దీప్తి నావల్ వంటి సుప్రసిద్ధ క్రీడాకారులు, సినిమాతారలు, రాజకీయ నాయకులు ఈయన శిష్యులు గవర్నర్‌లు, ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రి, రాష్ట్రపతి అందరూ ఈయనతో గంటల కొద్దీ గడుపుతారు

చిన్నగ్రామమైన పుట్టపర్తిలో ఉన్నా ఈయన పేరు ప్రఖ్యాతులు ప్రపంచమంతటా ప్రాకాయి. పనామాలో సంక్షోభం సమసి పోవడానికి కృషి చేస్తున్న ఒక కల్నల్‌కి స్ఫూర్తి అంతా ఈయన వద్దనుంచే వస్తున్నట్టు అనిపిస్తోందట ఆయన సత్యసాయిబాబాను ఇంతవరకూ చూడలేదు కూడా!

సత్యసాయిబాబా సమాజానికి మేలు కలిగించే ఎన్నో కార్యక్రమాలను చేస్తున్నప్పటికీ విద్యా సంస్థలను నెలకొల్పి విద్యాబోధన లో విప్లవాత్మక సరళిని ఆశిస్తున్నప్పటికీ ఆయన భక్తులకు పంచే విభూతి, ప్రసాదించే ఉంగరాలు, వాచీలు విమర్శలకు మూలమయ్యాయి

మహర్షి మహేశ్‌యోగి



పెరుగుతున్నట్లే వాస్తవాలు తెలుపుతున్నాయి ఆచార్య రజనీశ్, ధీరేంద్ర బ్రహ్మచారి, గురుమాయి చిద్విలాసానంద, మహర్షి మహేశ్ యోగిలతో పోలిస్తే సత్యసాయిబాబామీద ఉండే ఆరోపణలు కొట్టివెయ్యదగ్గవే



పుట్టపర్తి సత్యసాయిబాబా

## తుపాకుల బ్రహ్మచారి ధీరేంద్ర

కీ శే శ్రీమతి ఇందిరాగాంధీ కుటుంబంతో సన్నిహిత సంబంధాలున్న వ్యక్తి స్వామి ధీరేంద్ర బ్రహ్మచారి ఒకప్పుడు దూరదర్శన్‌లో యోగ బోధించడం ఈయనకు నిత్యకృత్యంగా ఉండేది కాని జలాంతర్గామికి సంబంధించిన ఆయుధాల గొడవ లలో ఈయన తగులుకున్నారు లయిసెన్స్ లేకుండా కాశ్మీర్‌లో ఒక తుపాకుల ఫ్యాక్టరీని ఈయన నడుపుతున్నట్లు వార్తలు వెలుగులోకి వచ్చాయి దీంతో వ్యవహారం మొత్తం బెడిసికొట్టింది ఏ పని చేసినా ధీరేంద్ర బ్రహ్మచారిని అడిగి చేసేవారని చెప్పబడిన కీ శే శ్రీమతి గాంధీ ఈయనను దూరంగా ఉంచారు దూరదర్శన్‌లో ఈయన కార్యక్రమాలు

స్వామి ధీరేంద్ర బ్రహ్మచారి



సర్వమత సమానత్వాన్ని గుర్తించాలని ప్రేమే భగవంతుని తత్వమని బోధించే సత్యసాయిబాబా ఒక ఇంద్రజాలికుడని తన ట్రిక్కులన్నీ ప్రయోగిస్తున్నాడని పి సి సర్కార్ జూనియర్ పత్రికా ముఖంగానే ప్రకటించడం ఆశ్చర్యంగానే తోస్తుంది

పుట్టపర్తిబాబా భక్తులకు ప్రసాదించే వాచీలు 'ఒమేగా' మార్కుతో ఎందుకుండాలని ప్రశ్నించే వారు ఉన్నారు మహిమతో సృష్టించేవి అయితే సీకోలు సిటిజన్‌లు నంబర్లతో సహా ఎలాగ వస్తాయని అడిగేవారూ ఉన్నారు వీరి సందేహం యుక్తంగానే ఉన్నట్లు అన్పిస్తుంది

ఎందరెందరో రాజకీయ నాయకులను అనుగ్రహించి వారి కోరికలను ఈడేరుస్తారని ఎన్నాళ్ళగానో నయంకాని జబ్బులను సయితం విభూతితో నే నయం చేస్తారని చెప్పబడుతున్న సాయిబాబామీద కూడా సెక్స్ నేరాలు ఆరోపించబడుతున్నాయి బ్రూక్ అనే అమెరికన్ భక్తుడు సెక్స్‌పరంగా బాబాకి సమతుల్యత లేదని సంశయం లేకుండా చెప్పాడు కూడా!

సాయిబాబా భక్తుల సంఖ్య రోజు రోజుకీ తగ్గుతోందని అనేవారు ఉన్నారు కాని ఆ సంఖ్య

తగ్గుముఖం పట్టాయి క్రమ క్రమంగా ఈయన తెరవెనక్కి వెళ్ళిపోయారు

అయితే ఇటీవల మళ్ళీ ఈయన పత్రికల్లో దర్శనమిస్తున్నారు ఉత్తరప్రదేశ్‌లో అధికారంలో ఉన్నవారి సహాయ సహకారాలతో యోగ విద్యాలయాన్ని రూపొందించే ప్రయత్నాలు చేస్తున్నారు మళ్ళీ నెహ్రూ కుటుంబంతో సత్సంబంధాలకోసం తహతహలాడుతున్నారు

ఆధ్యాత్మిక వికాసానికి యోగం ఒక సాధనం అని ఈయన నమ్మకం ఈయనమీద చట్ట విరుద్ధమైన కార్యకలాపాలు నడిపారన్న అభియోగాలు తప్ప సెక్స్ ఆరోపణలు పెద్దగా లేవు ఆర్థిక నేరాలు చేసినట్టు కూడా ఈయన గురించి ఎవరూ చెప్పడంలేదు

రాజకీయాలు నడిపి వెలుగులోకి రావాలని ప్రయత్నించి దెబ్బ తిన్న ఈ తుపాకుల బ్రహ్మచారి మళ్ళీ తుపాకులకు పనిపెట్టకుండా ఉంటే చాలు!



## గురుమాయి చిద్విలాసానంద

బొంబాయి దగ్గరలోని గణేశ్‌పురి ఈవిడ నివాస స్థానం మార్తా మేసన్, రాజేంద్రకుమార్, డయానా రాస్ ఈవిడ శిష్యులలో కొందరు

ఈవిడమీద ఉన్నన్ని అభియోగాలు బహుశా ఇంకెవరిమీదా ఉండి ఉండవు స్వామి ముక్తానంద 30 ఆశ్రమాలను, 350 ధ్యాన కేంద్రాలను, కోట్లాది రూపాయల ఆస్తిని స్వామి నిత్యానంద, స్వామిని చిద్విలాసానందలకు అప్పజెప్పి వెళ్ళిపోతే - ఈ యిద్దరు ఆనందలు స్వయానా అన్నా చెళ్ళెళ్ళయి ఉండి కూడా - ఆస్తి కోసం ఒకరి నొకరు దూషించుకున్నారు అతి నీచపు పదజాలంతో ప్రకటనలు చేసారు అన్నగారని కూడా చూడకుండా నిత్యానందని ఉడ్నావ్ చేయించి చిత్రహింసలకు గురి చేసి అధిపత్యాన్ని పూర్తిగా వదులుకునేలా చేసిందని గురుమాయిమీద ఆరోపణ ఉంది నిత్యానందకు సెక్స్‌మీద తప్ప మరో దానిమీద ధ్యాస లేదని గురుమాయి విమర్శిస్తే ఆవిడకు సెక్స్‌భూతం పట్టుకొందనీ లెబనాన్‌లో పుట్టి అమెరికాలో పెరిగిన చీఫ్ లెఫ్టినెంట్ జార్జ్ అఫీఫ్‌తో ఇప్పటికీ ఆమెకు సెక్స్ సంబంధాలు కొనసాగుతునే ఉన్నాయని నిత్యానంద ఆరోపిస్తున్నారు నిజా నిజాలు ఎలా ఉన్నా ఆశ్రమాలకు అధిపతులుగా ఉన్నవారు ఇలాంటి వాద ప్రతివాదాలకు దిగితే అందరి దృష్టిలోనూ చులకన అవుతారుకదా!

గురుమాయికి విదేశీయుల అండదండలు బాగా ఉన్నట్టు చెబుతారు పరపతి, పలుకుబడి ఉన్న రాజకీయ నాయకులు ముహూర్తాలు పెట్టించుకోవడం కోసం ఈవిడ దగ్గరికి వస్తూ పోతుంటారట!

## కంచి స్వామి రాజకీయం

కంచి కామకోటి పీఠాధిపతి జయేంద్ర సరస్వతికి శిష్యగణం బాగానే ఉంది. అందులో లబ్ధ ప్రతిష్ఠులయిన రాజకీయవేత్తలు, విద్యావంతులు, సినిమా తారలు, వ్యాపార దక్షులు ఎంతమందో ఉన్నారు

ఒక మఠాధిపతి సలహాలు ఇవ్వవచ్చుకాని ఆ సలహాలు ఒక వ్యక్తికి మేలు కలిగించేవిగా మరో వ్యక్తికి కీడు కలిగించేవిగా ఉండకూడదు ఇటీవల ఒక న్యాయవాదిని ప్రధానమంత్రి కుక్క అనడం ఉచితం కాదని, అది మర్యాదగా లేదని కంచి స్వామి అనడం బాగానే ఉంది చక్కటి సలహానే కాని ఒక రాజకీయపక్షం వారిని ఒక అభ్యర్థికి ఓటు వేయమని సలహా ఇవ్వడం అంత సముచితంగా లేదు ఈ సలహావల్ల ఈ స్వామిజీకి ఒక అభ్యర్థిపట్ల మక్కువ ఉన్నట్టు తెలుస్తుంది రాగద్వేషాలకు అతీతంగా ఉండవలసిన మఠాధిపతి ఇలా ప్రవర్తించడం సమంజసం కాదు ఒక అభ్యర్థి గెలవడంవల్ల దేశానికేమన్నా ఉత్పాతం వస్తుందేమోనన్న సందేహం ఉన్నప్పుడు వేరే సంగతి ఇప్పటి పరిస్థితి సజావుగానే ఉంది కదా!

కంచి శంకరాచార్య జయేంద్ర సరస్వతి



ఒక మఠాధిపతి ఇటువంటి సలహాలను ఇవ్వడంలోని ఔచిత్యాన్ని గురించి ప్రశ్నించగలం కాని ఆయనని ఎలా ఆపగలం? ఈయన సలహా వెనుక ఏదయినా రాజకీయ ప్రమేయం ఉందా? ఉందేమో అనే సామాన్యుడు. అనుకొంటాడు. అది సహజం కూడా!

తీరా సలహాలు ఇచ్చినట్టు వార్తలు వచ్చాక వాటి ప్రభావం ప్రజలమీద బాగా చూపాక ఆ తరువాత ఆ వార్తలను ఖండించినా పెద్దగా ప్రయోజనం ఉండదు కంచి స్వామి అన్నట్టుగా వచ్చిన వార్తలు అననట్టుగా ఖండనలు వచ్చాయి కానీ వాటివల్ల ప్రయోజనం లేకపోయింది

మిగతా ఎంతో మంది స్వాములమీద ఉన్నట్టు ఈ కంచి స్వాములమీద ఇతరత్రా పెద్దగా ఆరోపణలు లేవు అంతవరకూ సంతోషించవలసిందే!

## ముక్తాయింపు

దేశం సంక్షోభంలో పడిపోతుందని భావించినప్పుడు రాజకీయాలకు అతీతంగా ఉన్నప్పటికీ ఒక మఠాధికారి లేదా పీఠాధిపతి లేదా గురువు కొన్ని గట్టి నిర్ణయాలు తీసుకొని ప్రజలను హెచ్చరించడం ధర్మమే అవుతుంది దీనిని ఎవరూ కాదనరు కాని సామాన్యులలాగా కోపతాపాలను ప్రదర్శిస్తూ స్వప్రయోజనం ఆశిస్తూ స్వార్థంతో తల మునకలవుతూ రాజకీయ ప్రలోభాలకు లోనవుతూ రకరకాల నేరాలకు తావిస్తూ యోగులలాగా, బాబాలలాగా బయటికి ప్రవర్తించడం మాత్రం దురదృష్టకరం స్వామి, బాబా, ఆచార్య అని అనిపించుకున్నంతమాత్రాన గురుస్థానం లభ్యం కాదు కాషాయ వస్త్రాలు కట్టి భజన గీతాలు పాడినంతమాత్రాన అవధూత లక్షణం సిద్ధించదు

త్రికరణశుద్ధిగా కర్మ ఫల త్యాగాన్ని ఆశించాలి. నిండు సంయమనంతో మెలగాలి గీతాచార్యుడిలాగా వెలుగొందాలి అప్పుడే భారతీయ జాతి ఔన్నత్యాన్ని వెలిగించే భాస్కర జ్యోతిలా ఏ యోగైనా విలసిల్లగలడు ఈ మాట ఎవరికయినా వర్తిస్తుంది

-డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

సీరియల్



ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

అర్థరాత్రి నిర్విరామంగా మోగుతోంది ఫోన్

బద్ధకంగా కళ్ళు విప్పి ఫోన్ అందుకున్నాడు విజయ్.

"సార్.... నేను చమన్‌లాల్‌ని. నా షాపులో లూటీ జరిగింది. నన్ను నిలువునా ముంచి అంతా పారిపోయారు సార్." భయంగా.... ఆదుర్దాగా ఉంది చమన్‌లాల్ గొంతు.

ఇంద్రాపూర్‌లో చమన్‌లాల్ గురించి తెలియని వాళ్ళుండరు. అతి పెద్ద జ్యూయలరీ షాపతనిది....

"ఎప్పుడు జరిగింది? మీ రెప్పుడు చూసుకున్నారు? ఎక్కడ నుంచి మాట్లాడుతున్నారు మీరు?" అన్నాడు విజయ్.

"లలిత్‌పూర్ రాజాగారి కూతురు పెళ్ళి. సకాలంలో అందించటం కోసం రాత్రి పొద్దు పోయిందాకాపని చేస్తున్నాం సార్. లక్షలు విలువ చేసే నగలు....

షాపు మూసి లాక్ చెయ్యబోతుండగా పది మంది ముసుగు మనుషులు హఠాత్తుగా వచ్చి పడ్డారు. కొందరి చేతుల్లో రివాల్వర్లున్నాయి. నేనూ నా మనుషులు ప్రాణాలకు తెగించి పోరాడాం.

వాళ్ళ రివాల్వర్లకి సైలెన్సర్లున్నాయి. సెకండ్ షో జరుగుతున్న టైం.... రోడ్డు మీద జనసంచారం అట్టే లేదు. గొడవ విని పరుగెత్తిన బీటు కానిస్టేబుల్‌ని, ఇంకో ఇద్దర్నీ వాళ్ళు కాల్చి పారెయ్యటంతో ఇహ ఎవరూ ఇటు వచ్చే సాహసం చెయ్యలేదు సర్. ఘాటైన మత్తు పదార్థం ఉపయోగించటంతో మేం తెలివి తప్పి పోయాం. తెలివొచ్చి చూసేసరికి.... జనం చేరుకునే సరికీ, రాజాగారి నగలన్నీ దొంగిలింపబడి ఉన్నాయి..." చమన్‌లాల్ గొంతు బావురు మంటున్నట్లుంది....

వెంటనే బయల్దేరి ఆ స్పాట్ కెళ్ళాడు విజయ్. దార్లో తనే ఎస్. ఐ.ని పికప్ చేసు కెళ్ళాడు.

చమన్‌లాల్‌చేత జరిగిందంతా మరోసారి వివరంగా చెప్పించుకుని నగల వివరాలు తీసుకుని కాలి వేలి ముద్రలు.... ఫొటోలు లాంటి ప్రాథమిక చర్యలు పూర్తి చేసి శవాల్ని పోస్ట్‌మార్టంకు పంపేసరికి సాయంత్ర మయింది....

చమన్‌లాల్ దాదాపు పిచ్చివాడిలా తయారయ్యాడు. "రాజాగారి దగ్గర నా పరువు పోతుంది. అంతటి విలువైన నగలు మళ్ళీ నేనెక్కడ నుంచి తేను?" అంటూ దాదాపు ఏడ్చేస్తున్నాడతను.

చెయ్యెత్తి కళ్ళు తుడుచుకో బోతున్న చమన్‌లాల్ చేతిని అలాగే పట్టుకున్నాడు విజయ్. ఆ చేతికున్న వాచీ చెయిన్‌కి బూడిదరంగు దారం వేలాడుతోంది. అది విజయ్ దృష్టి నాకర్షించటం చూసి, "వాళ్ళతో పెనుగులాడేటప్పుడు ఇది దీనికి తగులుకుని ఉంటుంది. వాళ్ళలో ఒకడు బూడిదరంగు షర్టు వేసుకున్నాడు." అన్నాడు చమన్‌లాల్.

ఆ దారాన్ని తీసుకుని భద్రపరుస్తూ, "మళ్ళీ చూస్తే మీరు వాళ్ళని గుర్తుపట్టగలరా?" అన్నాడు విజయ్.

"ఉహుఁ! తల నుంచి మెడవరకూ వాళ్ళు ముసుగులు తగిలించు కున్నారు."

"ఆ కదలిక, మాట తీరు, స్వభావం మీకు తెలిసిన ఎవర్నయినా గుర్తు తెస్తున్నాయా?"

"లేదు."

"బూడిదరంగు చొక్కా వేసుకున్న వ్యక్తి ఎంత ఎత్తుంటాడు?"

"ఆరు అడుగులు. బలంగా ఉన్నాడు."

"అంత మందిలో అతనొక్కడి గురించే ఎలా గుర్తు పెట్టుకున్నారు?"

"వాడిమీదే నేను కలబడ్డాను. వాడే ఆ జట్టుకు నాయకత్వం వహిస్తున్నాడు. మర్డర్లు చేసింది కూడా వాడే.. మొహం కనపడక పోయినా.. . లావూ పొడవూ గుర్తున్నాయి "

"ఉహూఁ"

"సార్.... ఎలాగైనా మీరీ కేసు విషయంలో ఇంట్రెస్ట్ తీసుకోండి. ఆ సొమ్ము దొరక్కపోతే!–

మైగాడ్! ఊహించటానికే భయంగా ఉంది. మీ సమర్థత గురించి విన్నాను. అందుకే.... డైరెక్టుగా మీకే ఫోన్ చేశాను. సార్.... సార్.... ఎలాగైనా ఇంట్రెస్ట్...."

"సరే సరే! అలాగే. మీరు నిశ్చింతగా ఉండండి." అన్నాడు విజయ్.

జరిగిన కథ – 1: బ్లూస్టార్ హోటల్ యజమాని రంగారావుకు ఎన్నో అక్రమ వ్యాపారా లుంటాయి. కొత్త డి. ఎస్. పి. విజయ్ హోటల్ మీద దాడి చేసి శాసన సభ్యుడు ధర్మారావును, రౌడీ నాగును అరెస్ట్ చేస్తాడు. అక్కడ అనూహ్యంగా వైజయంతి కనబడి మాయమవుతుంది. విజయ్ పదిహేను రోజుల పాటు వేరే పనిమీద మరో ఊరికి వెళ్ళాల్సి వస్తుంది.

ఏ కేసయినా తాము శ్రద్ధగానే శోధిస్తారు. దేన్నీ అశ్రద్ధ చెయ్యరు. కానీ అదే విషయం చెపితే.... చమన్‌లాల్‌కి శాటిస్‌ఫాక్షనుండదు.

ఇంతకన్నా అక్కడ ఏ ఆధారాలు దొరక లేదు. హంతకులు చాలా తెలివైన వాళ్ళు. వేలిముద్రలు కూడా పడకుండా జాగ్రత్తలు తీసుకున్నారు...

* * * * * * * * * *

హోటల్ అప్సరాలో ఫామిలీ రూంలో కూర్చుని టీ తాగుతున్నాడు విజయ్. ఆ గది ద్వారం వేపున్న అద్దాల్లో నుంచి చూస్తే ఎదురుగానూ, కాస్త పక్కగానూ ఉన్న వాళ్ళు కనుపిస్తారు హాల్లో....

అక్కడొక టేబుల్ ఖాళీ అయింది. కొద్ది క్షణాల్లో మరో ముగ్గురొచ్చి ఆ స్థానాన్ని భర్తీ చేశారు. వాళ్ళను చూడగానే ఎలర్ట్‌గా అయ్యాడు విజయ్ వచ్చిన వాళ్ళలో ఒకడు నాగూ'

అతను బూడిద రంగు షర్టు వేసుకున్నాడు. నాగూ వీపు రూం వేపున్నది. నెమ్మదిగా లేచి అతని సమీపంగా వెళ్ళాడు విజయ్. మిగిలిన వాళ్ళు నాగూకు సౌంజ్ఞ చేశారు. అప్పటికే విజయ్ చురుకైన కళ్ళు నాగూ షర్టు చేతిమీద ఒక దారం పోగు ఊడినట్లు స్పష్టంగా కనుపిస్తున్న సన్నని చారను పసికట్టాయి. అతను కుర్చీలో నుంచి లేచే లోపలే విజయ్ అతని మీదికి లంఘించాడు. అప్పటివరకూ నిర్లక్ష్యంగానే ఉన్నాడు నాగూ. మోటు బలం తప్ప మెలకువలు తెలియని నాగూ కరాటే ఫైటరయిన విజయ్ చేతికి త్వరగానే చిక్కాడు.

అక్కడే యుద్ధం ప్రారంభమయింది....

ఆ హోటల్‌లో ఉన్నవాళ్ళు సహకరిస్తే వాళ్ళని తేలికగా బంధించొచ్చు. కానీ.... చాలా చోట్ల ప్రజలు పోలీసులకు సహకరించరు....

గొడవకు అటుగా వచ్చిన కానిస్టేబుల్స్ సహాయంతోనూ.... తన దగ్గర రహస్యంగా ఉన్న రివాల్వర్ సహాయంతో వాళ్ళని గాయపరిచీ మొత్తానికి వాళ్ళని బంధించ గలిగాడు విజయ్.

అనుమానం తన మీదకు వచ్చే అవకాశం లేదనే నమ్మకంతో నిర్లక్ష్యంగా ఉన్నాడు నాగూ హఠాత్తుగా ఇలా పట్టుబడటాన్ని ఊహించ లేదు. .



## డి. ఎస్. పి. విజయ్

ముగ్గుర్నీ వేరు వేరు గదుల్లో బంధించాడు విజయ్

నాగూ జోలి కెళ్ళినా అట్టే లాభముండదు నిజం కక్కించటం కష్టం అందుకే మిగతా ఇద్దరి మీదా తన దృష్టి కేంద్రీకరించాడు విజయ్

చెప్పు ఆ నగ లెక్కడ దాచారు?

నాకు తెలీదు సార్

విజయ్ చేతిలో ఉన్న లాఠీ-వాడి మోకాళ్ళను బలంగా తాకింది వరసగా ఛెళ్ళు ఛెళ్ళున తగుల్తున్న దెబ్బలతో కెవ్వున గోల పెడుతున్న వాడి మూతి మీద చాచి కొట్టాడు

మిగతా వాళ్ళపట్ల ఎంత మంచిగా మర్యాదగా ఉంటాడో నేరస్థుల పట్ల అంతకు పది రెట్లు కఠినంగా క్రూరంగా ఉంటాడు విజయ్

వాళ్ళలో మానసికంగా కాస్త బలహీనుడైన సూరిని ఎన్నుకున్నాడు విజయ్

నాగూ తనే మర్డర్లు చేశానని ఒప్పుకున్నాడు కానీ దొంగిలించిన నగలు మాత్రం నీ ఇంట్లోనే ఉన్నాయట ఈ మాట స్వయంగా అతనే చెపుతున్నాడు మర్డర్ల విషయం ఒప్పుకున్నాడు గనక దొంగతనం విషయంలో అతను నిజమే చెపుతున్నాడని మా నమ్మకం అనవసరంగా చిత్రహింసల పాలవకు.

టెంత్ క్లాస్ చదువుతున్న నీ కొడుక్కు కూడా ఈ దొంగతనంలో భాగముందంటున్నాడు నాగూ వాడి నరెస్టు చేసి తెమ్మని మా వాళ్ళని పంపాను గురి చూసి విసిరాడు విజయ్ అది సూటిగా తగిలింది

వాడికేం తెలీదు బాబోయ్! ఆ పసివాడినిరికించకండి-దులో వాడి నిక్కడికి లాక్కొచ్చి చంపి వదలకండి అంటూ లబలబ లాడాడు సూరి

నాగూ చెపుతున్నాడు?

ఛీ! అడే ఇశ్వాస ఘాతకుడు అన్నెం పున్నెం తెలీని పసివాడి మీద నేరం మోపుతాడా! థూ! వాన్నోరు బడ నగలన్నీ ఆడే దొంగిలించాడు అది కొంపలోనే ఉన్నాయవి

సరే నువ్వూ మాతోరా! నీ మాట నిజమైతే నీ కొడుకు జోలి కెళ్ళం అబద్ధమైతే

నిజంగా ఆడింట్లోనే ఉన్నాయి

సరే! అంటూ సూరిని తీసుకుని తమ బలగంతో కలిసి నాగూ ఇంటి కెళ్ళాడు విజయ్

నాగూ స్వయంగా ఒప్పుకున్నాడనే సరికి బెదిరిన సూరి తన కొడుకు నిరికిస్తారనే సరికి పూర్తిగా భయపడి పోయాడు జరిగిందంతా చెప్పు కొచ్చాడు నగలు మాత్రం నాగూ ఇంట్లోనే ఉన్నాయని అవి దాచిన చోటుకు తమని రానియ్యలేదనీ చెప్పాడు




నాగూ తలిదండ్రులు చాలా మంచి వాళ్ళు అందుకే నాగూ తరుచుగా ఇంటి కెళ్ళడు ఎప్పుడో ఓసారి ముఖం చూపిస్తాడు

మా కుటుంబంలో ఎవరూ అలాంటి దరిద్రులు లేరు నాయనా! మా ఖర్మ కొద్దీ వాడలా తయారయాడు వాడిని మార్చలేం శిక్ష అనుభవిస్తుంటే చూసి భరించలేం దీనికంతకీ కారణం ఆ నీచుడు రంగారావే ఇలా వేధిస్తామనే వాడు కొంప మొహం కూడా చూడడు మళ్ళీ ఏం చేశాడు? ఎందుకు ఇల్లు వెతుకుతా మంటున్నారు? ఆయన కూడా ఊళ్ళో లేరు అన్నది నాగూ తల్లి అమాయకంగా

ఏదో చిన్న అనుమాన మొచ్చిందమ్మా! అది తీరాక ఏమిటో చెపుతాం ముందు వెతక నివ్వండి ఆఖరుసారిగా నాగూ ఇంటి కెప్పు డొచ్చాడు? అన్నాడు విజయ్

మూడు రోజులవు తోంది ఆ రోజు వాడొచ్చేసరికి నేను లేను సినిమా కెళ్ళాను నేనొచ్చే వేళకి వాడు ఇంట్లో ఉన్నాడు

ఇల్లు తాళమేసుకోలేదా మీరు?

వేశాను కానీ వాడొచ్చేసరికి తాళం వేసి ఉంటే మారు తాళాలతో తీసో లేక బద్దలు కొట్టో ఇంట్లో జొరబడతాడు వాడు

ఆమె చెప్పిన రోజుకు ముందే చమన్‌లాల్ షాపు దోచుకో బడింది సో నగలు ఇక్కడే ఎక్కడో ఉండి ఉంటాయి నాగూ అతి తక్కువ వ్యవధిలో పట్టుబడటం చేత అవి ఇంకా చేతులు మార లేదు

ఎక్కడా ఏం దొరకలేదు సార్ అంటూ వచ్చారు కానిస్టేబుల్స్ అప్పటికి విజయ్ పూజ గదిలో ఉన్నాడు అక్కడ నాపరాళ్ళు పరిచి ఉన్నాయి

కాలితో యాదాలాపంగా తడుతుంటే ఒక చోట తేడా కనిపెట్టాడు విజయ్ ఒంగి జాగ్రత్తగా చూశాడు ఆ రాయిని ఒకసారి తీసి మళ్ళీ బిగించిన ఆనమాలు సిమెంటు అతుకు రంగుల్లో ఉన్న మార్పు గమనించి అక్కడ తవ్వించి రాతిని తొలగించాడు

రెండు వరసల్లో రెండు మూటలు దొరికాయి

రామ్ రామ్ అవే కానీ ఇంకా చాలా ఉండాలి సార్ అంటూ గోలపెట్టసాగాడు చమన్‌లాల్

ఉండండి చూద్దాం అంటూ సూరిని మళ్ళీ ప్రశ్నించసాగాడు విజయ్ నాగూ ఇంట్లో ఏ ఏ చోట్ల తిరిగాడో గుర్తు చేసుకుని చెప్పమన్నాడు

లఘుశంకకని బావి వైపెళ్ళాడు అంతే ఇంక నాకేం తెలీదు అన్నాడు సూరి

బావిలో మిగిలిన నగలన్నీ దొరికాయి

నాగూను కాపలా కాసే విషయంలో ప్రత్యేకమయిన జాగ్రత్తలు తీసుకున్నాడు విజయ్

* * * * * * * *

హఠాత్తుగా నాగూకు గుండెపోటు వచ్చింది నొప్పితో మెలికలు తిరిగిపోతూ కాసేపట్లో చస్తాడేమో అన్నట్లు తయారయిన అతని పరిస్థితి చూసి విజయ్‌కి తెలిపాడు ఎస్ ఐ

అతన్ని హాస్పిటల్‌లో చేర్చాల్సి వచ్చింది తీసికెళ్ళేటప్పుడు విజయ్ కూడా వెంట ఉన్నాడు నాగూను హాస్పిటల్‌లో చేర్చారు హాస్పిటల్‌లో అతని బెడ్ దగ్గర హాస్పిటల్ బయట పోలీసు కాపలా ఏర్పాటు చేశారు డాక్టర్లకీ నర్సులకీ జాగ్రత్తలు చెప్పారు నాలుగు రోజులయినా నాగూ పరిస్థితి మెరుగుపడలేదు అతని రోగం డాక్టర్లకే అంతుబట్టటంలేదు ఉండీ ఉండీ నొప్పితో మెలికలు తిరిగిపోతాడు మొహం రంగు మారిపోతుంది ఆ పరిస్థితి చూస్తే ఏ క్షణానయినా చేయి జారిపోతాడనిపిస్తుంది విజయ్ రెస్ట్‌లెస్‌గా ఫీలవుతున్నాడు భరించలేనంత టెన్షన్‌గా ఉందతనికి

నాగూ ప్రస్తుతం తనకున్న ఏకైక ఆధారం ఈ ఊపులో ఎలాగైనా వాడి చేత నిజం కక్కించి రంగారావు గుట్టుమట్టు తెలుసుకోవాలి కానీ వాడి పరిస్థితేమిటి రోజు రోజుకు క్షీణించిపోతోంది!? వాడికి బెయిల్ దొరక్కుండా చెయ్యగలిగాడు విజయ్ నలుగురు కానిస్టేబుల్స్ మూడేసి గంటల చొప్పున వంతులవారీగా నాగూను కాపలా కాస్తున్నారు తెల్లవారు జామున మూడు గంటల నుంచీ త్రీ నాట్ త్రీ కాపలా బాధ్యత చేపట్టారు

బాత్రూం కెళ్ళాలి అన్నట్టు సౌంజ్ఞ చేశాడు నాగూ లేస్తే పడిపోయేలా

ఉన్నాడతను

రైఫిల్ సర్దుకుని అతన్ని బాత్రూం వేపు నడిపించుకెళ్లాడు శ్రీనాథ్ శ్రీ.

అతని అసరా వదిలేస్తే తను పడిపోతాడన్నట్టుగా తనతో పాటు అతన్ని కూడా లోపలికి లాగాడు నాగు. కాలితో వెనకున్న బాత్రూం తలుపు దగ్గరకు నొక్కాడు ...

హాస్పిటల్లో కొందరి సహకారంతో అప్పటికే అక్కడికి వచ్చి దాక్కున్న సాయుధులైన వ్యక్తులు ఆరుగురు అకస్మాత్తుగా శ్రీనాథ్ శ్రీ మీద పడ్డారు.

రైఫిల్ పేల్చాలని అతను చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. నిశ్శబ్దంగా రక్తం మడుగులోకి జారిపోయాడతను.

తన వాళ్ల సహాయంతో హాస్పిటల్ వెనక వేపునున్న గోడ దూకి తప్పించుకుపోయాడు నాగూ. బాత్రూం వేపెళ్లిన నాగూ, శ్రీనాథ్ శ్రీ ఎంతకీ రాకపోవటంతో అనుమానంగా అటు వేపెళ్లిన రెండో కానిస్టేబుల్ బాత్రూం తలుపు తెరిచి నిశ్చేష్టుడయాడు. ఒంగి, శ్రీనాథ్ శ్రీ ముక్కు దగ్గర వేలు పెట్టాడు.

అతని ఊపిరెప్పుడో ఆగిపోయింది.

ఈ వార్త వినగానే హాస్పిటలంతా కలవరంగా అయిపోయింది. బయటవున్న కానిస్టేబుల్స్ వెనకవేపు పరుగెత్తారు.

భోజనం చేస్తుండగా వచ్చిన మెసేజ్ విని ఆ పళ్లెం అలాగే వదిలేసి లేచాడు విజయ్ ...

హాస్పిటల్ గోడవతల కొన్ని గుడిశలున్నాయి.

"ఎవరో గోడ దూకి ఇక్కడాగిన జీపెక్కి అటు వేపెళ్లారు". అన్నాడొకడు ...

బీట్ కానిస్టేబుల్స్‌ని, ఇంకా కొందరినీ వివరాలనడిగి తెలుసుకుంటూ మొత్తానికి జీప్ గోగినేనిపల్లె వేపు వెళ్లిందని నిశ్చయించుకుని జీప్ ముందుకు దూకించాడు విజయ్. అతనే స్వయంగా డ్రైవ్ చేస్తున్నాడు.

పోలీసు జీప్ గోగినేనిపల్లె శివార్లలో ప్రవేశించింది. అప్పటికి కొద్ది కొద్దిగా వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి ..

ఖాళీ చెంబుల్తో తిరిగొస్తున్న వాళ్లను, పాలవాళ్లను ఆపి ప్రశ్నించాడు విజయ్.

కాస్సేపు వాళ్లలో వాళ్లు తర్జనపడ్డాక చివరికి ఒకరిద్దరు తెల్లవారు ఒక జీప్ "పెద్ద బోనాలపల్లె" వేపు వెళ్లటం తాము చూశామన్నారు.

అటు వెడుతూ ఒక కిళ్లీ కొట్టు దగ్గర ఆగి అడిగాడు విజయ్.

"ఔను సార్. వాళ్లు ఇక్కడ ఆగి, నా కొట్లో సిగరెట్లు కొనుక్కున్నారు. చాలా హడావుడిగా ఉన్నారు ..."

"సిగరెట్లు ఏ బ్రాండ్‌వి కొన్నారు?" కిళ్లీ కొట్టతన్ని మధ్యలో ఆపుతూ అడిగాడు విజయ్.

"చార్మినార్. "నాలుగు పాకెట్లు తెచ్చావేమిటి? ఆ అడవిలో నా బ్రాండ్ దొరికి చావదు. రెండు డజన్లు పట్రా" అని ఓ వ్యక్తి నెమ్మదిగా విసుక్కోవటం నాకు, వినిపించింది సార్. మొదటివాడు మళ్లీ వచ్చి రెండు డజన్ల ప్యాకెట్లు కొనుక్కెళ్లాడు" అన్నాడు కిళ్లీ కొట్టతను.

విజయ్‌లో కాస్త ఉత్సాహం పుంజుకుంది.

అప్పటికే జిల్లాలో అన్ని పోలీసు స్టేషన్లకీ మెసేజ్ అందింది. చెక్ పోస్ట్‌ల దగ్గర కాపలా ఉధృతం చెయ్యబడింది ...

జీప్ పెద్ద బోనాలపల్లె దగ్గర ఆపాడు విజయ్. నాగూవాళ్లు ఎటు వెళ్లి వుంటారు? ముందుకెళ్లి ఉండరు. రెండు ఫర్లాంగులు దాటితే అక్కడ చెక్‌పోస్ట్ ఉంది. పోలీసుస్టేషన్ ఉంది. ఇంతవరకూ పక్క దార్లంట వచ్చినా ఇక్కడ నుంచి తిన్నగా వెళ్లాల్సిందే. అలా వెడితే పట్టుబడక తప్పదు. ఇక్కడ వరకే వచ్చి ఉంటారు వాళ్లు. ఇక్కడే మాయమయ్యారు ...

రోడ్డు కిరుపక్కలా అల్లుకుని ఉంది ఫారెస్ట్. కుడి చేతి వేపు వెహికల్ వెళ్లటానికి వీల్లేదు. అటు అడవి దట్టంగా ఉంది. చెట్టుకీ చెట్టుకీ మధ్య నున్న స్థలం జీప్ వెళ్లటానికి సరిపోదు. ఎడమచేతి వేపు ఫారెస్ట్ వాళ్ల ప్లాంటేషన్ ఉంది. వరుసలుగా వేసిన టేకు చెట్ల పక్క నుంచి ఫారెస్ట్‌లోకి రాళ్లు రప్పలతో ఎగుడు దిగుడుగా ఓ దారి ఉన్నది. ఇటే వెళ్లి ఉంటారు ఖచ్చితంగా.

"మళ్లీ ఆ అడవిలో నా బ్రాండ్ సిగరెట్లు దొరికి చావవు" కిళ్లీ కొట్టతను చెప్పిన మాటలు ...

నాగూ చార్మినార్ తప్ప ఇంకేం కాల్చడు.

జీప్ ఎడమవేపు తిప్పాడు విజయ్. కాస్త దూరం వెళ్లాక ఎక్స్‌రే కళ్లతో చూస్తే అక్కడక్కడ టైరు గుర్తులు కనిపిస్తున్నాయి. అక్కడ రోడ్డుకు బదులు రాళ్లు ఉండటంచేత టైరు గుర్తులు అస్పష్టంగా ... ఎక్కడైనా కాస్త మట్టి బాట ఉన్నచోట కనిపిస్తున్నాయి. చాలా ఇరుకుగా ఉన్నదా దారి. బాట కిరుపక్కలా ఎత్తుగా ఉన్న దిబ్బల మీద పిచ్చి కలప, చెట్ల కొమ్మలు జీప్‌ను ఒరుసుకుంటూ ఫ్రంట్ సీట్లో వాళ్లకు తగులుతున్నాయి ..

ఆ రాళ్ల దారిలో జీప్ ఎగిరెగిరి పడుతోంది ... ఒక్కోసారి సాంతం ఒక పక్కకు ఒంగిపోతున్నట్టుంది ...

జీప్ విన్యాసాలు ... దట్టంగా కీకారణ్యంలా ఉన్న అడవి ... అందులోకి దూసుకుపోతున్న విజయ్ సాహసం చూస్తుంటే మతిపోతోంది హెడ్ కానిస్టేబుల్ రంగస్వామికి ...

"ఈ దొరగారికంటే పెళ్లికాలేదు. ఎలా పోయినా రిస్క్ లేదు.

తనకో?

తనకు పెళ్లికెదిగిన ఆడ పిల్లలున్నారు. మగపిల్లలు చిన్నవాళ్లు. తను చస్తే వాళ్లంతా రోడ్డున పడతారు.

'విధి నిర్వహణ' లో ప్రాణాలర్పించిన హెడ్ కానిస్టేబుల్! అంటూ కాసేపు పొగిడి ... మౌనం పాటించి అంత్యక్రియలు జరిపి చేతులు దులుపుకోవటమేగానీ ప్రభుత్వం తన కుటుంబానికేం శాశ్వత రక్షణనివ్వదు. తన కుటుంబంలో వాళ్లకు ఖచ్చితంగా ఉద్యోగమిస్తుందనే గారంటీ కూడా లేదు. ఎలా పోయినా ఎవరూ పట్టించుకోరు.




తను పోయినా తన కుటుంబానికి భద్రత ఉంటుందనే పూచీ ఉంటే తను కూడా ఇలాగే ప్రాణాలకు తెగించి అడవుల వెంట పరుగెత్తేవాడు.

తనేమిటి? ఏ పోలీసాఫీసరైనా ... ఏ కానిస్టేబులైనా అంతే. ఎవరి కుటుంబ బాధ్యత వాళ్లదే. వాళ్లు పోతే ఆ రక్షణ బాధ్యత ప్రభుత్వం తీసుకుంటుందనే నమ్మకం, హామీ గనక ఉన్నట్లయితే తమ డిపార్ట్‌మెంటులో మూడొంతుల మంది తమ ప్రాణాల్ని పణంగాపెట్టి, దొంగల్నీ, హంతకుల్నీ వేటాడేవారు ...

ఈ డి. ఎస్. పి. సాహసం తన కొంప ముంచేలా ఉంది. ఎటు నుంచి ఏ పెద్ద పులయినా ఛార్జి చెయ్యవచ్చు ... ఏ ఎలుగుబంటో మీద పడి పీకొచ్చు ... ఏ పామో కాటెయ్యవచ్చు ..."

గాబరాగా వుంది రంగస్వామికి. ఇంతలో అతని మెడకు ఏదో చల్లగా చుట్టుకుంది. భయంగా అరిచాడు అతను.

ఆశ్చర్యంగా చూచిన విజయ్ తన మెడను చుట్టుకున్న తీగను చూసి సిగ్గుపడి పోతున్న రంగస్వామిని చూసి సన్నగా నవ్వి ముందుకు సాగాడు ...

ఇహ జీప్ వెళ్లదు. అడివి అత్యంగా కమ్ముకుందిక్కడ. దిగి చుట్టూ చూశాడు విజయ్. కుడివేపు ఒత్తుగా పేర్చిన ఘుండల్ని తొలగించి చూస్తే మళ్లీ అక్కడో బాట ఉన్నది ...

(ఇంకా ఉంది)

ఎ. బి. ఆర్., బిలాస్‌పూర్

★ కె. రా. గారూ మీకు జోస్యం మీద నమ్మకం వుందా? తెలియజేస్తారా?

● లేదు. ఓసారి మా శీనుని 'ఏరా మనం యింటికి వెళ్ళేసరికి చెక్కు వస్తుందా? వస్తే నీకు రూపాయి యిస్తా' అన్నా. వాడు టపీమని 'చెక్కు రాదు. టెలిఫోను బిల్లు వస్తుంది' అన్నాడు. వాడన్నట్టుగా - అదే వచ్చింది. అప్పటి నుంచీ నేను అడగను -వాడు చెప్పడు!-

ఎస్. ఎస్. ఆర్., కోటబొమ్మాళి

★ అక్కా వరకట్న దురాచారం తగ్గే మార్గం లేదా? తగ్గకపోతే ఆడపిల్ల తల్లిదండ్రులు ఏమైపోవాలి?

● ఏమైపోనక్కరలేదు. అబ్బాయిని పెంచినట్టే అమ్మాయిని పెంచి - ఆర్థికంగా తన కాళ్ళపై తాను నిలబడేలా చేయాలి. జీవితం అంటే - ఆడదానికి పెళ్ళి ఒక్కటే కాదు, అదామె జీవితంలో ఓ భాగం అని - చిన్నతనం నుంచీ తెలియజెప్పాలి 'పెళ్ళయ్యేదాకానే' అన్న ధోరణి మానుకోవాలి.

వి. ఎస్. ఆర్., బాల్కోనగర్

★ ఎవరు ప్రశ్నలు వేసినా వారి పూర్తి పేరు రాయరు. కారణం ఏమిటి? అయినా అంత రహస్యమయిన ప్రశ్నలేవీ కనబడుట లేదే?

● ప్రశ్నల్లో రహస్యం లేదు. కాని చాలామంది మగవారిలో అసభ్య చాయలు ఎక్కువ. చిన్న చిన్న పల్లెల్లోవుండే స్త్రీల చిరునామాలు పట్టుకోవడం కష్టం కాదు. యిలాంటి వాళ్ళు వారిని వేధించడం నా దృష్టికి వచ్చింది. అందుకే పొడి అక్షరాలు.

పి. ఆర్. కె., బరంపురం

★ ఉదయించే ఉదయభానుడు గూర్చి కొద్దిగా వివరిస్తారా?

● నేనేం కెమెరా కన్నునా?!

జి. ఎన్. ఆర్., రామక్రిష్ణాపూర్

★ కాంగ్రెసులో వుండి అక్రమంగా ఆర్జించిన పెద్దలే ఈనాడు కాంగ్రెసును విమర్శిస్తున్నారు - కారణం?



● దొంగలతో కలిసి 'దొంగ దొంగ పట్టుకోండి' అని అరిస్తేనే కదా - దొంగ దొర అయ్యేది!

వి. ఎస్. ఎస్; పి. ఎస్., ముబారక్‌నగర్

★ రామలక్ష్మిగారూ మీ నవల చదవాలని వుంది. మా కోరిక తీరుస్తారు కదూ?

● తీరుస్తా - కాస్త కోలుకోనివ్వండి!

ఎస్. కె. ఆర్., పర్లాకిమిడి

★ మనిషి ఎప్పుడూ విజయుడే. కాదంటారా?

● అంటే మగవాడనా మీ ఉద్దేశ్యం?!

★ విమర్శ అనేది జన్మించేదెప్పుడు?

● ఒళ్ళు మండినప్పుడు!

పి. ఎం. ఆర్., బాపట్ల

★ విద్యావంతురాలు, గుణవంతురాలు అయిన భార్య వ్యసనపరుడు పెసిమిస్టు అయిన భర్తతో పడివుండటం, నిత్యం దురదృష్టానికి కుమిలిపోవడం దేనికి? బయటపడి స్వేచ్ఛగా బ్రతకడానికి ఏదైనా చేయవచ్చుకదా?

● ఆమెను బ్రతకనివ్వాలి కదా చుట్టూ జనం? విద్యావంతురాలు గుణవంతురాలు కనుకనే - అంత ఆలోచన. అదే శ్రామిక వర్గపు స్త్రీ అయినా, సొసైటీ లేడీ అయినా ... బయటపడే ధైర్యం, సాహసం చేవ కల్గి వుండేది, చుట్టూ జనం నోరు మూసుకుని పడివుండేది కూడా అందుకే చదువుకున్న మధ్య తరగతి స్త్రీలు క్షణ క్షణం చస్తూ బ్రతుకు వెళ్ళమారుస్తూ వుంటారనడం. వీరికి చదువున్నా గుర్తింపులేదు. సంపాదన వున్నా ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. మర మనుషుల్లా బ్రతకడమే - వారి జీవితాదర్శమా అనిపిస్తుంటుంది నాకు. మనిషి తన యిష్టాయిష్టాలను తెలియజేయకపోతే - ఎదుటి వాళ్ళు తెలుసుకొందుకయినా ప్రయత్నిస్తారనుకోవడం అత్యాశ అని వీరు ఎప్పటికి గ్రహిస్తారో - ఎవరూ చెప్పలేరు.

బి. వి. ఎస్., నందివెలుగు

★ స్త్రీకి స్త్రీయే శత్రువంటారు. ఎందుకని?

● ఒకరిని చూసి ఒకరు ఏడిచి చస్తుంటారు - అందుకని. ఇది మగవాళ్ళు చేస్తారు - కాని వాళ్ళకి ఈ సామెత సృష్టించబడలేదు!

★ ప్రతి రచయితా తమ రచనలో ఆడవాళ్ళచే వంచింపబడుతూ వ్రాస్తారెందుచేత?

● నమ్మేవాళ్ళనే కదా వంచించకలరు? ఆడది సులభంగా నమ్మేస్తుంది.

★ ప్రేమకు పెద్దరికానికి మధ్య అనాదిగాపచ్చగడ్డి వేసినా భగ్గుమంటుందెందుకు?

● పెద్దలది అనుభవం - చిన్నలది ఆవేశం. అనుభవం ఎప్పుడూ ఆవేశాన్ని అరికట్టాలని చూస్తుంది. (కాని చేతులు కాలాక ఆకులు పట్టుకునే తత్వం - ఆవేశానిది)

జె. వి. ఆర్. హైదరాబాదు

★ ముందుకు పోయేవాడికి అడ్డంకులు పెట్టే వాళ్ళని ఏమనాలి?

● మరేం ఫరవాలేదు. ఒకడుగు వెనక్కి తగ్గి ముందుమెట్టెక్కడం సులభం అని తెలుసుకోండి!

ఎమ్. ఆర్. డి. బళ్ళారి

★ మీరు నవలలు ఏఉద్దేశ్యంతో రాస్తారు? సంఘంలోని అరాచకాలను అద్దం పట్టేలా ఉండడం కోసమా లేక ఉబుసుపోకకా?

● సంఘానికి అద్దం పట్టేటంత మసాలా నేమి నూరలేను. ఉబుసుపోకకి రాయను. కొన్ని పాత్రల ద్వారా కొన్ని సమస్యలని, మానసిక ధోరణులని, మనుషుల తత్వాలని ఒక థీమ్‌గా పరిశీలించాలని ప్రయత్నిస్తాను. వాస్తవ సంఘటన ఎత్తుగడ అయినా కథ కల్పితంగా చేస్తాను. మక్కికి మక్కి వాస్తవాలు రాయడం దేనికి న్యూసుపేపర్లు చదువుతే చాలదా?

★ తెలుగులో కాక ఇతర భాషల్లో రాశారా?

● ఆ! కాస్త ఆంగ్లంలో –

ఎస్. వి. ఆర్. బిర్లా. గోవా

★ ఎన్ని తప్పులు చేసినా సరే చనిపోయే టప్పుడు మాత్రం మంచిమనిషి పాపం చనిపోయాడు అంటా రెందుకు?

● 'చచ్చిన వారిని గురించి చెడు మాట్లాడకు' అని సూక్తి. అంచేత బ్రతికుండగా మంచినీళ్ళు కూడా ఇవ్వని పిల్లలు సహితం "అన్ని బొండాలూ నువ్వే తాగారా అయ్యలు" అని గట్టిగా ఏడుస్తారు ఎంత క్రూరుడైనా, నీచుడైనా– చచ్చి పడివుంటే పాపం – అనడం మానవత్వ లక్షణం. అంతే. □



# అభిమాన తారలపై అభిప్రాయం

డేరింగ్ అండ్ డైనమిక్ హీరో చిరంజీవి అంటే నాకెంతో అభిమానము ప్రాణం ఖరీదు చిత్రం నుండి ఈనాటి ఆరాధన చిత్రం వరకు అతను ఎన్నో విభిన్న మైన పాత్రలలో నటించారు విజేత, శుభలేఖ వంటి అవార్డు చిత్రాలైనా రాక్షసుడు, దొంగమొగుడు వంటి మాస్ చిత్రము లైనా ఏ



పాత్రకైనా చిరంజీవి సరిపోగలడు అని నిరూపించు కున్నారు అగ్ర దర్శకుల దగ్గర నుండి చిన్న దర్శకుల దగ్గర కూడా నటించి తన ఉత్తమ సంస్కారం నిరూపించు కున్నాడు రాబోయే చిత్రాలు స్వయం కృషి, చక్రవర్తి, గీతా ఆర్ట్స్ చిత్రాలలో అతని నటన మహోన్నత శిఖరాలు అందుకోవాలని ఆ చిత్రాలు విజయవంతం కావాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ

–టి వి శ్రీనివాసరావు,
త్రోవగుంట,(ప్రకాశం)

★ ★ ★

నా అభిమాన నటి అందాల తార శోభన మలయాళ, తమిళ కన్నడ చిత్ర రంగంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించి తెలుగు వెండి తెరకు విక్రం తో పరిచయమై నేటి త్రిమూర్తులు వరకు ఎన్నో వైవిధ్యమైన పాత్రలు పోషించి పేరు ప్రఖ్యాతులు గడించినది ఆమె నటించిన అన్ని చిత్రములు చూస్తాను ఇటీవల విడుదలైన మువ్వ గోపాలుడు చిత్రములో ఆమె నటన అద్భుతంగా వుంది ఈ చిత్రములో ఆమె యొక్క అమాయక నటన నన్ను అమితముగా ఆకర్షించింది గతములో ఆమె నటించిన విజృంభణ శ్రీమతి కానుక



"హెచ్చరిక", "మరణ శాసనము", "అజేయుడు" చిత్రాలలో ఆమె నటన జనరంజకంగా వుంది.

ఆమెను అభిమానించే అభిమానిగా నా సూచన:–

శోభనగారు ఈ మధ్య కథాబలం లేని చిత్రములలో నటించడము మా అభిమానులకు నిరాశ కల్గిస్తున్నది. నటి చిరకాలము ప్రేక్షకుల హృదయాలలో నిలవాలంటే ఫేమిలీ సెంటిమెంట్స్, కథాబలం, ప్రేమకథా చిత్రములలో నటించాలని మా కోరిక మరియు మా మనవి

– రవిరాజ్ (డి ఎ ఇ), అనంతపూర్

★ ★ ★

నా అభిమాన మానసచోరీ అందాల తార చిరునవ్వులు వెలికిస్తూ నా హృదయంలో నాటుకుపోయిన సుహాసిని' కెమెరా ఉమెన్‌గా చిత్ర ప్రవేశమై ఆంధ్రుల అభిమానాన్ని అనతి కాలంలో నే అందుకున్న నా హృదయ స్పందన తార సుహాసిని సంసారం ఒక చదరంగంలో ఆదర్శగృహిణిగా ఆబాల గోపాలాన్ని ప్రతీ కుటుంబాన్ని చెరగని ముద్రగా వారి వారి హృదయాల్లో నాటుకు పోయింది 'సింధు భైరవి' చిత్రం ద్వారా జాతీయ అవార్డు గ్రహించి అభిమానులందరికి వన్నె తెచ్చింది ఎటువంటి



జటిలమైన పాత్రనైనా తన ముఖ కవళికలో తెలియ జెప్పే సుమధుర చిరుదరహాసిని సుహాసిని.

ఎస్. బిల్వేశ్వరరావు, నౌపడా

★ ★ ★

నా అభిమాన నటుడు అమెరికన్ హీరో టామ్ పదమటి సంధ్యా రాగం" చూసి అతని



అభిమానినయ్యాను ఆ చిత్రంలో అతని నటన అద్భుతము తెలుగు మాట్లాడేందుకు టామ్ చేసిన కృషి అభినందించవలసిన విషయము టామ్‌కు భారతీయ సంస్కృతిపై ఉన్న గౌరవము నన్ను అతని అభిమానిగా చేసింది 100 చిత్రాలు పూర్తి చేసి సూపర్ హీరో కావాలని నా కోరిక హాలివుడ్ నటుడుగా 'ఆస్కార్' అవార్డు, తెలుగు హీరోగా 'నంది' అవార్డు అందుకోవాలని నా ఆకాంక్ష

-యస్ రుక్మిణీదేవి,
పద్మావతినగర్, తిరుపతి

★ ★ ★

నేటి చలనచిత్ర పరిశ్రమలో తన కంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న కమల్‌హాసన్ నా అభిమాన నటుడు నేను 'ఆకలి రాజ్యం' సినిమా చూసి ఆయన అభిమాని నయ్యాను ఎన్నో జాతీయ రాష్ట్ర అవార్డులను గెలుచుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి ఆయన విభిన్న భాషలలో నటిస్తూ విభిన్న భాషా వ్యక్తుల అభిమాని కావటం గర్వించదగ్గ విషయం ముఖ్యంగా డాన్సులలో ఆయన వేసే వెరయిటీ స్టెప్స్, ఫైట్సులో చూపించే చిలిపితనం నన్నెక్కువగా ఆకర్షించాయి సంగీత భరితమయిన



చిత్రాలు కమల్ గార్కి తప్ప వేరొకరికి చేతకావు అన్న రీతిలో నటిస్తారాయన మొన్నటి 'మరో చరిత్ర', నిన్నటి సాగర సంగమం', నేటి 'స్వాతి ముత్యం' వరకు విభిన్న తరహా పాత్రలకు జీవం పోసిన 'డాన్సు మాస్టర్ మా కమల్‌హాసన్ ఏ రకపు పాత్రనయినా అవలీలగా అర్థం చేసుకుని తన నటనా కౌశలాన్ని ప్రదర్శించి 'అంతులేని కథ' 'వయసు పిలిచింది', అమావాస్య చంద్రుడు', 'వసంత కోకిల', 'ఒక రాధ ఇద్దరు కృష్ణులు' మొదలైన చిత్రాల ద్వారా ఎంతో మంది ప్రేక్షకుల అభిమానాన్ని పొందిన ఘనత ఆయనకే దక్కుతుంది తన నటనా సామర్థ్యంతో కోట్లాది సినీ ప్రేక్షకాభిమానుల హృదయాలను దోచుకున్న అగ్రకథా నాయకుడు కమల్‌హాసన్ కీర్తి ప్రతిష్టలు చిరస్థాయిగా నిలిచిపోవాలని కోరుకుంటున్నాను

-ఎస్ జోసెఫ్, మహారాణిపేట, విశాఖపట్నం

★ ★ ★

పదహారేళ్ళ పడుచు ప్రాయంలో సినీ వినీలాకాశంలో ఓ నూతన తార తళుక్కుమంది ఆమె ఆంధ్రుల అందాలతార, సూపర్ హీరోయిన్ విజయశాంతి నా అభిమాన కథానాయకురాలు. విజయశాంతి నటిగా



పరిశ్రమలో పేరు ప్రఖ్యాతులు పొందిన చిత్రము ప్రతిఘటన ఆ చిత్రములో విజయశాంతి నటన ఎంతో ప్రశంసనీయంగా ఉంది. ఆ తరువాత విజయశాంతి నటించిన చిత్రాలు వందేమాతరం, అరుణకిరణం, రేపటి పౌరులు ఆమెకు గొప్ప పేరు సంపాదించాలని నా అభిలాష.

ఎ. రాజి, ప్రొద్దుటూరు □



# శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

నల్లూరు భాస్కరరావు, రాజమండ్రి

ప్ర: ఒకరు 'తెలుగుదేశం' మరొకరు 'కాంగ్రెసు-ఐ'. ఇద్దరూ ధనవంతులు. ఇద్దరికీ కూతుళ్ళున్నారు. ఎవరి కూతుర్ని చేసుకోమంటారు?

జ: నేను సలహా ఇచ్చేలోగా వాళ్ళు పార్టీలు మారిపోతే ...?

మహేంద్రకుమార్, గుత్తి

ప్ర: కొందరు సంతోషం ఉన్నప్పుడు నోటితో ఈల వేస్తారెందుకండీ?

జ: సంతోషం లేనప్పుడు కూడా ఈలవేసే వారున్నారు - బస్ కండక్టర్లు.

వడ్డేల్లి వాసంతి, నందిగామ

ప్ర: అక్కా! అభిమాన సంఘాన్ని పెట్టి, ఆఫీసు కూడా ప్రారంభించాము. ఆఫీసులో మీ ఆటోగ్రాఫ్ గల అందమైన ఫోటో పెట్టాలి. ఎటువంటి ప్రశ్న అడగాలో దయచేసి చెప్పండి.

జ: అదేదో నేనే చెప్పేస్తే, మీరెలా బహుమతి కి అర్హులవుతారు? వాసంతి గారూ! తొందరేం లేదు. నిదానంగా మీరే ఆలోచించి, చక్కని ప్రశ్న పంపండి. మీకెందుకు బహుమతి రాదు!

ఎం. డి. నసీర్, గూడూరు

ప్ర: మీరింతవరకు ఏం సాధించారు?

జ: మీలాంటి సహృదయుల అభిమానం. కాదంటారా?

ముత్యాల కామరాజు, హుస్నాబాద్

ప్ర: నేను ప్రేమించిన యువతిని 'రుక్మిణీ హరణం'లో శ్రీకృష్ణుడిలా అపహరించుకు పారిపోతే?

జ: శ్రీకృష్ణ జన్మస్థానానికే చేరుకోవచ్చునేమో!

వంకా పూర్ణచంద్రరావు, తుని

ప్ర: నేటి సినిమా కథలు ఎక్కువగా ప్రేమతో నిండి ఉంటాయేమండీ?

జ: నేటి యువతరం ప్రేమలు ఎక్కువగా సినిమా కథల్లా ఉండడం లేదూ?

డి. హేమసుందర్‌రావు, ఖర్గపూర్

ప్ర : మీ దృష్టిలో ప్రేక్షకుల ప్రశంసలు ముఖ్యమా, ప్రభుత్వ అవార్డులు ముఖ్యమా?

జ : ప్రేక్షకుల ప్రశంసలే.

## ఉత్తమ ప్రశ్న

ఎ. ఇందిర, చిత్తూరు

ప్ర : మా ఫ్రెండ్స్ అందరూ నన్ను సుమలత లాగా ఉంటావు అంటారు. కావున నాకు సినిమాలలోకి రావాలని ఉంది. పోటీగా వస్తున్నాను. మీకు ఏమైనా అభ్యంతరమా?

జ : ఎందుకు అభ్యంతరం. సుస్వాగతం!

జి. పద్మజ, అనంతపురం

ప్ర : ఏమండీ, సుమలతగారూ! మీకు క్రికెట్ అంటే చాలా ఇష్టమటగా?

జ : చచ్చేంత ఇష్టం.

ఎం. నరసరాణి, వనపర్తి

ప్ర : మెత్తగా కనిపించే ఆడవాళ్ళే అవసరం వస్తే ఆదిశక్తిగా కూడా మారగలరని మనవాళ్ళు తెలుసుకునే రోజు ఎప్పుడొస్తుందండీ?

జ : ఇంకా రాలేదంటారా?

సాయికుమారి, మచిలీపట్నం

ప్ర : సుమలతగారూ! మీ ఇంటి అడ్రసు, ఫోన్ నెంబరు తెల్పరా?

జ : 17, పార్థసారథిపురం, టి.నగర్, మద్రాస్ 17. ఫోన్ నెం : 443989.

నవీన్‌కుమార్, ధర్మవరం

ప్ర : మీరు "శ్రుతిలయలు"లో నటించారు అనడం కంటే జీవించారు అనడం సబబుగా ఉంటుంది. ఈ చిత్రానికి మీకు తప్పక ఉత్తమ నటి అవార్డు రావాలని భగవంతుని ప్రార్థిస్తాను. మీరేమని ప్రార్థిస్తారు?

జ : మీ కోర్కెను నెరవేర్చమని.

ఆర్. జాన్సన్, మారుటేరు.

ప్ర : మీరెంతో అందంగా ఉంటారు. మీ నటన కడు అద్భుతం. అంచేత, మీరు కరెక్ట్‌గా జవాబిస్తారనే నా నమ్మిక. మీకో చిన్న ప్రశ్న.... 'లౌక్యం' అంటే ఏమిటండీ?

జ : నా జవాబు రాబట్టుకోవడం కోసం మీ ప్రశ్న ముందు నన్ను మునగ చెట్టు ఎక్కించే ప్రశంసా వాక్యాలు రాశారే! 'లౌక్యం' అంటే అలాంటిదే.

ఎస్. రఘు, రామ్‌నగర్

ప్ర : సుమలతగారూ! మీ మదర్‌టంగ్ ఏమిటో తెలుపగలరా?

జ : నా మాతృభాష ఏమిటని అడుగుతున్నారా? మీకీ సందేహం ఎందుకొచ్చింది? ☐

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న............................................................

......................................................................

......................................................................

పంపినవారి పేరు...............................................

పూర్తి చిరునామా...............................................

# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## డా. దాసరి కొత్త చిత్రాలు

ఆగస్టు 5న అంకురార్పణ జరిగే "ఓ తెలుగింటి ఆడబిడ్డ" అతి తక్కువ బడ్జెట్‌లో 20 రోజుల షెడ్యూల్‌తో చిన్న తారాగణంతో రూపొందుతుంది. కొత్త సాంకేతిక నిపుణులకు అవకాశాలివ్వబడతాయి.

దిన పత్రిక పతితలను విశేషంగా ఆకట్టుకున్న 'మోడల్' ఆధారంగా అక్టోబర్‌లో ప్రారంభమయ్యే చిత్రాన్ని జయసుధ సమర్పిస్తూ, నాయిక పాత్ర నిర్వహిస్తారు. కమలహాసన్ నాయకుడు.

ఎ. ఎన్. ఆర్. జన్మదినమైన సెప్టెంబర్ 20 నుంచి అన్నపూర్ణ స్టూడియోస్ నిర్మించే "ఉడుకు నెత్తురు" చిత్రంలో నాగార్జున హీరో.

1988 జనవరి 1న సెట్స్‌కు వెళ్ళే తారకప్రభు ఫిలిమ్స్ చిత్రంలో కూడా నాగార్జున హీరో.

## రాఘవేంద్రరావు దర్శకత్వంలో నాగార్జున, శ్రీదేవి

"నాదర్శకత్వంలో శ్రీదేవి, నాగార్జున తొలిసారిగా కలిసి నటిస్తున్నారు. యండమూరి తొలిసారిగా కథను సమకూరుస్తున్నారు. ఇళయరాజా తొలిసారిగా సంగీతమిస్తున్నారు." అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో వైజయంతీ మూవీస్ సి. అశ్వనీదత్ నిర్మించే చిత్రం సెప్టెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది. జనవరి 1న విడుదలవుతుంది. జంధ్యాల సంభాషణలు రాస్తున్నారు.





"జాకీ"లో శ్రీరామ్‌కుమార్, సువర్ణ

"రాక్షస సంహారం"లో
అర్జున్, కుష్బూ

## శోభన్, కోడి రామకృష్ణలతో ఆర్. ఆర్. ఆర్ట్ మూవీస్ చిత్రం

"శోభన్‌బాబు సరసన ఇద్దరు నాయికలుంటారు. డిసెంబర్‌లో పాటలు రికార్డ్ చేసి, జనవరిలో షూటింగ్ ప్రారంభిస్తాం" అన్నారు కోడి రామకృష్ణ. ఈయన డైరెక్ట్ చేసే ఆర్. ఆర్. ఆర్ట్ మూవీస్ చిత్రానికి పి. శ్రీధర్‌రెడ్డి, కె. వెంకటేశ్వర్లు నిర్మాతలు.

## విశు కథ, దర్శకత్వంలో "శ్రీమతి ఒక బహుమతి"

సూపర్‌హిట్ అయిన "సంసారం ఒక చదరంగం" చిత్ర కథకుడు, సుప్రసిద్ధ తమిళనాటక ప్రయోక్త విశు తెలుగు ప్రేక్షకులకు కొత్తేంకాదు. ఈ జాతీయ అవార్డు గ్రహీత తొలిసారిగా ఒక చిత్రంలో నటిస్తూ దర్శకత్వం వహిస్తున్నారు. ఈయనకీ అవకాశం కలిగించిన ఘనత దయాకర్, కరుణాకర్‌ది. ఈ యువ నిర్మాతలు "శ్రుతిలయలు" అనంతరం పవన్ ఎంటర్‌ప్రైసెస్ బానర్‌లో జూలై 1 నుంచి నిర్మిస్తున్న పై చిత్రంలో జయసుధ- చంద్రమోహన్, నరేష్- అరుణ, తులసీరాం, కల్పన, పి. ఆర్. వరలక్ష్మి, బిందుఘోష్, విశు తమ్ముడు కిమ్మి పాల్గొంటున్నారు. తెరవెనుక ఆశెల్ల, సీతారామశాస్త్రి, బాలకృష్ణ, గణేష్-కుమార్, శంకర్-గణేష్, సుందరరాజ్, పులియూర్ సరోజ, దాసంసాయి నాగప్రసాద్, నవకాంత్, మల్లి-రాజా, జి. మాధవరావు కృషి చేస్తున్నారు. "అక్టోబర్ విడుదల అన్నారు విశు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఈ చిత్రాన్ని సమర్పించే ఎ. వి. కె. రెడ్డి.

# అవి – ఇవి

ఇంతవరకు 500 చిత్రాలకు పైగా పని చేశాను నాకు దాదాపు వంద మంది శిష్యులున్నారు ఇప్పుడు సుమారు 81 చిత్రాలకు పని చేస్తున్నాను, అన్నారు స్టంట్ మాస్టర్ సూపర్ సుబ్బరాయన్ ఈయన వయసు 31 పి యు సి చదువుతూ మానేశారు ఈయన కవితలు కూడా అల్లుతూంటారు కమలహాసన్ వగైరా ఎంతో మంది మెచ్చుకున్నారట కొన్ని సినిమాలలో ఈయన పాటలు కొన్ని చోటు చేసుకుంటున్నాయట ఇటీవల ఒక నిర్మాతకు ఒక చక్కని కథను వినిపించాను కూడా అన్నారు సుబ్బరాయన్

* * *

సంసారం ఒక చదరంగం' కథకుడు 'విశు' ఎవరికీ స్వయంగా కథ వినిపించరు కథను టేప్ చేసి పంపిస్తారట

* * *

ప్రముఖ కథకుడు, దర్శకుడు వసౌళి బి టెక్ పాసయ్యారు సినిమారంగంలో ప్రవేశించడానికి ముందు 'పాండ్స్ కంపెనీలో పని చేశారు

* * *

మధురై 'ఇంపీరియల్' థియేటర్ ఆవరణలో ఒకటీ కొట్టు ఉంది అక్కడ బోర్డులో –

| | |
|---|---|
| పాలు నూరు మిల్లీ మీటర్లు | 0 35 |
| పంచదార – పది గ్రాములు | 0 06 |
| కాఫీ పొడి | 0 07 |
| పనివాడికి జీతం | 0 05 |
| కొట్టు అద్దె | 0 03 |
| పన్ను గ్లాసులు కడగడానికి, వగైరా ఖర్చులు | 0 02 |
| | -------- |
| | 0 58 |
| లాభం . . | 0 02 |
| | -------- |
| ఒక కప్పు కాఫీ వెల | 0 60 |
| | -------- |

తనిఖీ చేయడానికి వచ్చే అధికారులకు, రాజకీయవేత్తలకు అప్పుడప్పుడు ఉచితంగా మేం కాఫీలు ఇవ్వవలసి వస్తూంటుంది అంచేత, ఈ పరిస్థితుల్లో, అప్పు కూడా మేమిస్తే చివరికి మేం బావుకునేదేమిటి?'

–జి. వి. జి.



"అభినందన"లో శోభన

## సినిమా




## "అభినందన"

చిత్రకారుడు గాయకుడు అయిన హీరోకు, నర్తకీమణియైన హీరోయిన్‌తో చిగురించిన ప్రేమకు ఒక దశలో అవరోధం ఏర్పడితే, వారి జీవితాలు ఎంత మలుపులు తిరుగుతాయి సూక్ష్మంగా ఇది కథ షూటింగ్ పూర్తయింది ఛాయాగ్రహకుడు అశోక్‌కుమార్ దర్శకత్వ ప్రతిభ చిత్రమంతటా కనిపిస్తుంది అన్నారు లలితశ్రీ కంబైన్స్ అధినేత ఆర్ వి రమణమూర్తి శరత్‌బాబు, కార్తీక్, శోభన, రాజ్యలక్ష్మి, జె వి సోమయాజులు, చిట్టిబాబు, మిఠాయిచిట్టి, మాస్టర్ సతీష్, బేబీస్వాతి వగైరా నటవర్గం ఆత్రేయ మాటలు, పాటలు రాశారు ఇళయరాజా సంగీతం, మాధురి నృత్యాలు, లెనిన్ కూర్పు తెరవెనుక హంగులు

## కె. ఎస్. రామారావు సమర్పణలో రెండు చిత్రాలు

చిరంజీవి హీరోగా ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో యండమూరి వీరేంద్రనాథ్ విరచిత మరణ మృదంగం' చిత్రాన్ని నిర్మిస్తున్న 'క్రియేటివ్ కమర్షియల్స్' కె. ఎస్ రామారావు సమర్పణలో మరో రెండు చిత్రాలు తెరకెక్కనున్నాయి

పినిశెట్టి రవిరాజా దర్శకత్వంలో ప్రమోదా ఆర్ట్ ఫిలిమ్స్ కె బెనర్జీ నిర్మించే కొంగు చాటు కృష్ణుడు'లో రాజేంద్రప్రసాద్ హీరో

వెంకటేశ్ హీరోగా సి హెచ్ వి అప్పారావు నిర్మించే భాను ఆర్ట్ క్రియేషన్స్ తొలి చిత్రాన్ని కె ఎస్ రామారావుతో పాటు కె విశ్వనాథ్ సమర్పిస్తారు ఇళయరాజా సంగీత దర్శకుడు

## చిరంజీవి, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో రోజామూవీస్ చిత్రం

"చిరంజీవి సరసన రాధ, భానుప్రియ నాయికలు" అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో ఐ. అర్జునరాజు సమర్పించే రోజామూవీస్ తొలి చిత్రానికి చక్రవర్తి సంగీత దర్శకుడు. ఎం. రామలింగరాజు నిర్మాత.

## బాలకృష్ణ కొత్త చిత్రాలు

మురళీమోహన్ సమర్పిస్తూ, నటించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ 13వ చిత్రంలో బాలకృష్ణ ఒక విలక్షణమైన పాత్రను ధరిస్తారు. చక్రవర్తి సంగీతం, డి. కిశోర్ నిర్వహణతో కోడి రామకృష్ణ దర్శకుడు.

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో చలసాని గోపి నిర్మించే గోపి ఆర్ట్స్ "దొంగరాముడు" చిత్రంలో బాలకృష్ణ, రాధ, మోహన్‌బాబు ప్రభృత నటవర్గం. చక్రవర్తి సంగీత దర్శకుడు.

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో కె. దేవీ వరప్రసాద్ సమర్పించే తారకరామ ఫిలిమ్స్ తొలిచిత్రానికి కె. లీలాప్రసాద్, డి. సుజా నిర్మాతలు.

"దొరికితే దొంగలు"లో విజయశాంతి, శోభన్‌బాబు





"మదన గోపాలుడు"లో రమ్యకృష్ణ, రాజేంద్రప్రసాద్

## "గర్జించిన గంగ" త్వరలో

"అరాచకం ప్రబలిపోతే, ప్రళయం ఉత్పన్నమయినట్లు, అన్యాయాన్ని ఎదిరించడానికి స్త్రీ గర్జించక మానదు. తనను కొడుకు నుంచి వేరు చేస్తే భరించలేని ఓ స్త్రీ గర్జించిన గంగలా ఎలా చెలరేగిపోతుందో చాటి చెప్పే చిత్రం. తల్లీ కొడుకులుగా జయసుధ, అర్జున్ ఫెంటాస్టిక్‌గా నటించారు", అన్నారు కొమ్మినేని. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. జి. ఆర్ట్స్ అధినేత జి. గన్నయ్య నిర్మించిన పై చిత్రానికి కాశీ విశ్వనాథ్, ఇళయరాజా, వెంకటేశ్వరరావు, శివసుబ్రహ్మణ్యం, భానుప్రసాద్‌రెడ్డి ప్రభృత సాంకేతిక వర్గంతో కె. సత్యనారాయణ సమర్పిస్తున్నారు. శరత్‌బాబు, పూర్ణిమ, సూర్యకాంతం, వరలక్ష్మి, అనూరాధ, కల్పనారాయ్, బాలాజీ, వంకాయల, కాశీ విశ్వనాథ్, గోకిన రామారావు ఇతర నటవర్గం. □

"విజేత విక్రమ్"లో వెంకటేష్



సినిమా

## బాలకృష్ణతో సురేష్ ప్రొడక్షన్స్ "రాము" చివరి ఘట్టంలో

"షూటింగ్ దాదాపు పూర్తయినట్లే. ఈ చిత్రం ద్వారా నేను డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్న వై. నాగేశ్వరరావు టేకింగ్ సుపర్బ్‌గా ఉంది. ఈయనతో ఆర్టిస్టులు, టెక్నీషియన్లు ఎంతగానో సహకరించారు", అన్నారు సురేష్ ప్రొడక్షన్స్ డి. రామానాయుడు. ఈయన "రాము" చిత్రంలో బాలకృష్ణ, జగ్గయ్య, శారద, హరిప్రసాద్, భాస్కరబాబు; సుధాకర్, రజని, దీప, శ్రీదుర్గ పాత్రధారులు. జంధ్యాల మాటల రచయిత. గుహనాథన్ కథకుడు. వేటూరి గీతాలకు ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం స్వరకర్త. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, ఆర్. ఆర్. షిండే సంయుక్త దర్శకత్వం, విజయకుమార్ - పి. వి. శాస్త్రి ప్రొడక్షన్, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తున్నారు.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క
నమ్మకమైన ఫార్ములా చేసేదిది–చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు
తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే
సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ
లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన
కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని
కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు
తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన,
తాజా శ్వాస, దాంతోటే దృఢమైన,
ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా
కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి.
నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.
వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

B84.55 Tel

# జాలికథ

## వేదుల వెంకటరమణమూర్తి

సాయంత్రం ఐదింటి నుండి కాలుగాలిన పిల్లిలా గదిలో పచార్లు చేస్తున్నాడు చంద్రశేఖర్. సిగరెట్టు మీద సిగరెట్టు పోటీ పడి కాలిపోతూ పొగులు పడుతున్నాయి. మనస్సులోని ఆలోచనలు ఎక్కడెక్కడికో పరిగెడుతున్నాయి. ఏ ఆలోచనా సరియైన పద్ధతిలోకి రావడంలేదు. టేబులు మీద తెల్ల కాగితాలు ఫేను గాలికి రెపరెపలాడుతూ ఒక్కొక్కటీ పక్కకు జరుగుతున్నాయి చంద్రశేఖర్ మనస్సులోని ఆలోచన్లలాగ.

కాగితా లన్నిటిని మళ్ళీ వరుసలో పెట్టి-దానిపై పేపర్ వెయిట్ వుంచి కుర్చీలో కూర్చుని మళ్ళీ ఆలోచిస్తున్నాడు. ఆరోజు కొన్న వార పత్రికను తెరచి మళ్ళీ ఆ ప్రకటన చదివాడు. "జాలి కథల పోటీ", కథ సారాంశం జాలి, కరుణ కలిగించేదిలా వుండాలి. పుస్తకాన్ని మూసేసి మళ్ళీ ఆలోచన్లలో పడ్డాడు.

ఎలా? ఏ కథ వ్రాయాలి? ఎవరిని కథా వస్తువుగా తీసుకోవాలి? రోజూ ఉదయం నుండి సాయంత్రం వరకు అనేక రకాలుగా జాలి కలిగించే మనుష్యుల్ని చూస్తున్నాం. ఉదయం అంట్లు తోమడానికొచ్చే పనిమనిషి, రోడ్డుమీద పారేసిన ఎంగిలాకులలో మిగిలిన అన్నాన్ని తింటూ కనిపించే బిచ్చగాళ్ళ పిల్లలు, వికలాంగులు, గుడ్డివాళ్ళు, పొట్ట నింపుకోవటం కోసం కష్టాలు పడే గారడీవాళ్ళు.......యిలా ఎంతోమంది వున్నారు వీరిలో ఎవరిని కథా వస్తువుగా తీసుకోవాలి? కథకు ముగింపు ఎలావుంటే బావుంటుంది? యిలా ఎన్నో ఆలోచనలతో సతమతమవుతున్నాడు చంద్రశేఖర్.

తను ఓ పేరున్న రచయిత కాదుగాని, తను రాసిన కథలు చాలామటుకు ప్రచురించబడ్డాయి. కాని అవన్నీ ప్రేమ కథలు, సస్పెన్స్, క్రయిం కథలు వున్నాయి. ఇంతవరకు జాలి, కరుణ కలిగించే కథలు వ్రాయలేదు. అందుకే యిప్పుడింతగా ఆలోచించవలసి వస్తోంది.

అదేమిటో ఆ వార పత్రికవాళ్ళు యింకేదైనా టాపిక్ అడగొచ్చు కదా! ఏమీ దొరకనట్టు "జాలి" కథ లెందుకో? సరే ఏదో ఓ నిర్ణయానికి రావాలి అనుకుని కుర్చీలో కూర్చుని పెన్నును చేతిలోకి తీసుకున్నాడు.

"టక్......టక్.....టక్......" తలుపు చప్పుడయింది.

"అబ్బ! మంచి మూడ్ పాడు చేసారు కదా! ఎవరొచ్చారో.....?" అనుకుంటూ తలుపు తీశాడు చంద్రశేఖర్.

"గుడీవినింగ్!.......ఏమిటి చేస్తున్నావు" అంటూ గదిలోకి ప్రవేశించారు మురళీ, శ్రీకాంత్.

"రండి! రండి!....." అంటూ లోనికి ఆహ్వానించాడు చంద్రశేఖర్. మూడ్ చెడగొట్టేసారు కదరా! అని మనసులో అనుకుంటూ.

ఇద్దరికీ చెరో కుర్చీ చూపించి తానూ ఓ కుర్చీలో కూర్చున్నాడు చంద్రశేఖర్. టేబిల్‌మీద కాగితాలు, పెన్ను కనిపించడంతో........

"ఏమిటి? మళ్ళీ ఏదైనా కథ మొదలెట్టావా?" అడిగాడు శ్రీకాంత్.

"అవును! ఈరోజే ఈ వీక్లీలో "జాలికథ"ల పోటీ తాలూకు ప్రకటన పడింది. కథలు పంపటానికి సమయం కూడా చాల తక్కువగావుంది. సరే! యిప్పుడు మొదలెడితే కనీసం నాలుగైదు రోజులలో పంపగలనని అనుకుంటున్నాను" అన్నాడు చంద్రశేఖర్.

"ప్లాటు దొరికిందా యింతకీ" అడిగాడు శ్రీకాంత్.

"లేదింకా! దానిగురించే ఆలోచిస్తున్నాను" అన్నాడు చంద్రశేఖర్.

"జాలి కథల పోటీ అంటున్నావు కాబట్టి చెబుతున్నాను. నేను ఓ నిజమైన సంఘటన చెప్తాను. ఆ సంఘటన నాలో ఎంతగా నాటుకు పోయిందో చెప్పలేను. అది తలచుకొన్నప్పుడల్లా నా హృదయాన్ని ఎవరో పిండుతున్నట్లనిపిస్తుంది. అంతటి విషాద సంఘటన నా కెప్పుడూ ఎదురవ్వలేదు. అది నీకు చెప్తాను. నీకు ఆ సంఘటన నచ్చితే దానిని ఆధారంగా తీసుకుని కథ వ్రాయి" అన్నాడు మురళి.

"అంత హృదయానికి హత్తుకుపోయిన సంఘటన అంటున్నావు. తప్పకుండా చెప్పు. నాకుగాని నచ్చితే తప్పకుండా కథ వ్రాస్తాను" అన్నాడు చంద్రశేఖర్.

"ఆ సంఘటన జరిగి యించుమించు రెండు సంవత్సరాలవుతోంది. అప్పుడు నేను విజయనగరంలో వుండేవాడిని. జరిగింది జరిగినట్టుగా చెప్తాను. విను" అంటూ చెప్పడం మొదలెట్టాడు మురళి.

* * * * *

అప్పుడు నేను డిగ్రీ ఫైనలియర్‌లో వున్నాను. విజయనగరం కోట దగ్గరగా వున్న లక్ష్మపందిరి వీధిలో మా రూం. నాతో పాటే శ్రీనువాసు అనే మరొకడు అదే రూంలో వుండేవాడు.

ఓ రోజు మా రూంకి మా ఫ్రెండ్స్ ప్రసాద్, రవి అని మరో యిద్దరు స్టూడెంట్స్ వచ్చారు. అంతా కలిసి రాబోయే పరీక్షల గురించి మాట్లాడుకుంటున్నాం.

అంతలో మా యింటి తలుపు ఎవరో తట్టినట్లయింది. ముందు మా యింటి తలుపు కాదేమోననుకున్నాం. మళ్ళీ చప్పుడయింది. అందరమూ ఎంతో సీరియస్‌గా మాట్లాడుకుంటుంటే మధ్యలో ఎవడొచ్చాడురా అని విసుక్కుంటూ తలుపు తీసాడు రవి.

"బాబూ! కాస్త ధర్మం చేయి బాబూ!" అంటూ అడుక్కుంటున్నాడు ఓ బిచ్చగాడు.

"ఓర్నీ! పెద్ద సీరియస్‌గా తలుపు కొట్టి మరీ అడుక్కుంటున్నాడే! ఘరానా పెద్ద మనిషిలా..... వెళ్ళు వెళ్ళు....." కోపంగా అన్నాడు రవి

"అలా అనకుబాబూ! ఉదయం నుండీ ఏమీ తినలేదు. ఆకలేస్తుంది" మళ్ళీ అడిగాడు ఆ బిచ్చగాడు

"నువ్వు వెళ్తావా లేదా........" అని అరచినట్టుగా అనడంతో అంతవరకూ రూంలో వున్న నేను, ప్రసాద్, శ్రీను బయటికి వచ్చి చూసాము.

ఆ వచ్చిన వ్యక్తికి సుమారు డెబ్భై ఏళ్ళుంటాయి. మనిషి పీలగా వున్నాడు అతని ముఖంలో కనిపిస్తున్న దైన్యం, అతని చిరిగిన బట్టలు అతని పేదరికాన్ని స్పష్టపరుస్తున్నాయి.

ఆకాశంలో గుడ్లురిమి చూస్తున్న రవి తాపం, బిక్షం వేయటానికి నిరాకరిస్తున్న మా రవి కోపం అతని పాలిట శాపమై కూర్చున్నాయి.

అతని అవస్థ చూస్తుంటే నాకు చాలా జాలేసింది

"పోన్లేరా! ఎంతో కొంత యిచ్చి పంపేద్దూ......." అన్నాను నేను.

"నువ్వేమిటిరా మధ్యలో....... యిటువంటి వాళ్ళకు భిక్షం వేయకూడదు. వీడిలో వున్న తక్కువేమిటిరా హాయిగా కళ్ళూ, కాళ్ళూ వున్నాయి. అడుక్కోవటమేమిటి ఖర్మ! హాయిగా పని చేసుకు బ్రతకొచ్చుగా" అన్నాడు ప్రసాద్

"అవున్రా! అసలు యీ ముష్టి వాళ్ళందరికీ యిదో సులువైన సంపాదన అయిపోయింది. మనదేశం యిలా పాడవటానికి కారణం వీళ్ళే. నిక్షేపంలా వున్నాడు. ఏదైనా పని చేసుకోవచ్చుగా.....అహా చేయరు. తేరగా డబ్బులొస్తున్నప్పుడు పనెవడు చేస్తాడు.. మళ్ళీ ఒక్కొక్కరికి ఎంత బద్ధకమో..... చాల్లే! వెళ్ళవయ్యా వెళ్ళు" అన్నాడు రవి.

"బాబూ! మీరన్నదీ నిజమే! కళ్ళు కాళ్ళు వున్నాయి కనుక నన్ను అడుక్కోవద్దు అంటున్నారు. కానీ నాలో జవసత్వా లుడిగి పోయాయి బాబూ! నేను ముసలివాణ్ణి. మీలా వయసులో వుండేటప్పుడు నేను ఎవ్వరికీ తలొంచేవాణ్ణి కాదు. నాలో శక్తి సన్నగిల్లిపోయింది. పని చేయటానికి అస్సలు ఓపికలేదు. పోనీ నలుగురు పిల్లలకి చదువు చెప్పి నాలుగు రాళ్ళు సంపాదించుకుందామనుకున్నా నాకు చదువు రాలేదు. విధి నాతో ఆటలాడుకున్నాడు. నామీద దయతలచి నాకు ఎంతో కొంత ధర్మం చేయండి బాబూ!" అన్నాడా బిచ్చగాడు.

"పోన్లేరా! అతనితో వాదనెందుకు? మీకు తోచితే యివ్వండి. లేకపోతే లేదు.

ఇదిగో నయ్యా......తీసుకో...." అంటూ జేబులోంచి తీసిన పావలా అతని కివ్వబోయాను.

అంతే! శ్రీను నా చేతిలోని పావలాను గభాలున లాక్కున్నాడు. "నీకు బుద్ధుందా లేదా! అసలు బిచ్చమెత్తుకోవడాన్ని నేరంగా పరిగణిస్తే, నీలాటి భిక్షం వేసే వాళ్ళను నేరస్తులనాలి. ఎందు కివ్వాలట అతనికి డబ్బు! నీకే కాదు జాలి! మాకూ వుంది. ఇదే ఓ గుడ్డివాడో, కుంటివాడో అయివుంటే మేమూ యిచ్చేవాళ్ళం డబ్బు! కాని యిలాంటి వాళ్ళకు యిస్తే మాత్రం సహించలేను" అన్నాడు శ్రీను.

తనకు రాబోయే ఆ పావలా డబ్బులు కూడా యివ్వకుండా చేసినందుకు శ్రీను మీద అతనికి ఓ రకమైన ఏహ్యాభావం కలిగింది. అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఇంత నిర్దయ వుండకూడదు బాబూ! మీకివ్వాలని లేకపోయినా యిచ్చేవాళ్ళను ఎందుకు వద్దంటావు. పోన్లే! నీ మనసుకు తోచినట్లు వికలాంగులకే యివ్వు" అంటూ విరక్తిగా మా వైపుచూసి వెళ్ళిపోయాడు.

ఆస్థితిలో మరి నేను ఏం చేయాలో తోచలేదు. నేను ఆ ముసలాడి గురించే ఆలోచిస్తున్నాను. మిగతా ముగ్గురూ ఈరోజు మనమో ఆదర్శవంతమైన పని చేశామనుకుంటూ గర్వంగా ఆ విషయం గురించే చర్చించటం మొదలెట్టారు.

ఇంచుమించు ఓ నెల రోజుల తర్వాత మేం నలుగురం కలసి సినిమా కని న్యూ పూర్ణాటాకీసుకి వెళ్ళాం. సినిమా ప్రారంభించటానికి యింకా సమయం వుండటంతో గంటస్తంభం దగ్గర నలుగురం నిలబడి మాట్లాడుకుంటున్నాం.

అంతలో ఓ భిచ్చగాడు మాదగ్గరకొచ్చి డబ్బులు అడిగాడు. ఆ వ్యక్తిని మేం నలుగురం చూసి నిశ్చేష్టులైపోయాం. ఆరోజు మా రూంకి వచ్చిన ఆ ముసలాడే. అయితే మేం ఆశ్చర్యపోవటానికి కారణం అతను అప్పటి స్థితిలో లేదు. అతని కుడికాలు తొడలవరకులేదు రెండు కర్రల సహాయంతో కుంటుకుంటూ వచ్చాడు. అతడు కూడా మమ్మల్ని పోల్చినట్లున్నాడు.

"బాబూ! మీరా రోజు అన్నట్లు నేనూ నిజంగానే కుంటివాణ్ణి అయిపోయాను. ఇప్పుడు మీ కోరిక నెరవేరినట్లేకదా! ఇప్పుడైనా కాస్త ధర్మం చేయండి" అన్నాడు మమ్మల్నిచూసి.

నా మనస్సు నిజంగా ఎంత బాధ పడిందో తెలియదు. అతన్ని ఆ స్థితిలో చూడలేకపోయాను. మా కెవ్వరికీ నోట మాటరాలేదు. నేనే ముందుగా తేరుకుని. . ..

"నీ కాలుకి ఏమయింది? ఎలా పోయిందది?" అడిగాను అతనిని.

"ఆరోజు మీ యింటికి వచ్చి డబ్బులడిగాను కదాబాబూ! అదేరోజు నేను రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫారంమీద అడుక్కుందికి వెళ్ళాను. అప్పుడు నేను పట్టాలు దాటుతూవుంటే అనుకోకుండా ఓ యింజను వచ్చి గుద్దేసింది. చావుతప్పింది కానీ....... నా కాలు శాశ్వతంగా పోయింది. పోనీలెండిబాబూ. నిజానికి నేను బాధపడలేదు. మీలాగే నన్నెంతమందో అన్నారు కళ్ళూ, కాళ్ళూవుండి అడుక్కోవడ మెందుకని. ఇదీ ఒకందుకు మంచిదేమోననిపించింది" అన్నాడు కన్నీళ్ళుపెట్టుకుంటూ.

మొదటిసారి అతడికి డబ్బులివ్వకుండా



వాదించిన నా ఫ్రెండ్స్ ముగ్గురూ అతని మాటలను, జరిగిన ప్రమాదమును విని చలించిపోయారు.

అసలది ప్రమాదమా? లేక ఆ రోజు మా మాటలని, యింకా ఎంతో మంది అన్న మాటలను భరించలేక, కళ్ళూ, కాళ్ళూ వుంటే ఎవ్వరూ భిక్షంవేయరని నిర్ణయించుకుని కోరే ప్రమాదానికి ఎదురెళ్ళాడా? అతనన్నప్రకారం అది ప్రమాదమని అనుకోవాలి. కానీ నాకు నమ్మకం కలగడంలేదు. ఏది ఏమైనప్పటికీ ఆ ప్రమాదంతో మాకు సంబంధం వుందనిపించింది.

అందరమూ కలిసి అతనికి పదిరూపాయలిచ్చాము. అతను మా అందరికీ నమస్కరించి వెళ్ళిపోయాడు. అతడికి జరిగిన ప్రమాదాన్ని గురించి మాట్లాడుతున్నాం చాలాసేపు.

ఇక మా కెవ్వరకు సినిమా చూడాలని మూడ్ లేక టిక్కెట్లు వాపస్‌యిచ్చి రూంకు వెళ్ళిపోయాము.

ఆ రోజు నుండి అతను మా కెన్నోసార్లు కనిపించాడు. మాకెంత తోచితే అంత సహాయం చేస్తుండేవాళ్ళం.

నాకిక్కడ ఉద్యోగం వచ్చినప్పటి నుండి క్రమేపీ అతడిని మరిచిపోయాను. కానీ ఆ సంఘటన మాత్రం హృదయంలో నిలిచిపోయింది.

గత ఆదివారం నేను జగదాంబ సెటర్లో నిల్చుని సిటీబస్ కోసం వెయిట్ చేస్తుంటే అతడే మళ్ళీ కనిపించాడు. అతడు కూడా కొన్నాళ్ళ క్రితం విజయనగరం నుండి వచ్చేసానని చెప్పాడు.

అతడు బిచ్చగాడే అయినా నా కెందుకో

# జాలికథ

అతనిమీద చెప్పలేని అభిమానం ఏర్పడింది. ప్రస్తుతం ఈ వూర్లోనే వున్నాడు" అని తనకు ఎదురైన సంఘటనను వివరంగా చెప్పి పూర్తి చేసాడు మురళి.

"నువ్వు చెప్పిన సంఘటన నిజంగా చాలా బాగుంది. జాలి కథల పోటీకి సరిగ్గా సరిపోయేటట్లుగా వుంది. తప్పకుండా దీనిని ఆధారంగా తీసుకుని కథ వ్రాస్తాను" అన్నాడు చంద్రశేఖర్ నిశ్చయంగా.

★ ★ ★ ★ ★

"మురళీ! గుడ్ న్యూస్! నువ్వు చెప్పిన సంఘటన ఆధారంగా తీసుకుని వ్రాసిన కథకు మొదటి బహుమతి వచ్చింది! ఇదిగో ఇందులో కథ పడింది" అంటూ ఆ వారపత్రికను మురళి కిచ్చాడు చంద్రశేఖర్.

"కంగ్రాట్స్! నాకు ముందే తెలుసు చందూ! నీలో ఆ కవి హృదయంవుందని. దీనికి తప్పకుండా ప్రైజ్ వస్తుందని ముందే ఊహించాను. అనుకున్నట్టే జరిగింది. రియల్లీ అయామ్ వెరీ హ్యాపీ" అంటూ కరచాలనం చేసి వారపత్రికలో పడ్డ అతని కథను చదవడం మొదలెట్టాడు మురళి.

కథ చివరిలో అతను చేసిన ముగింపు నిజంగా అద్భుతంగా వుందనిపించింది. అనాటి సంఘటన గుర్తొచ్చి, లేక ఆ ముసలాయన గుర్తొచ్చి లేక చంద్రశేఖర్ కథనంలో వున్న గొప్పదనమోగాని మురళి కళ్ళనుండి అప్రయత్నంగా కన్నీళ్ళు వచ్చేసాయి.

రెండువారాల తరువాత చంద్రశేఖర్ బహుమతిగా తన కొచ్చిన చెక్కుని మురళికి చూపించాడు.

"మురళీ నువ్వు ఆనాడు చెప్పిన సంఘటనే నా కథకు వూపిరినిచ్చింది. అందుకే ఈ బహుమతిని నీకు పార్టీరూపంలో యిద్దా మనుకున్నాను. పద! నీకు ఏది కావాలంటే అది యిప్పిస్తాను" అంటూ మురళిని పార్టీకై బలవంతంచేసి లేవదీసాడు.

ఇద్దరూ అప్సర హొటల్ వైపు దారితీసారు. దారిలో కథపై తన అభిప్రాయాన్ని వివరిస్తూ చెబుతున్నాడు మురళి.

ఉన్నట్టుండి సడన్‌గా "చందూ! ఒక్క నిముషం! ఆ దూరంగా వెళ్ళిపోతున్నాడు చూసావా! అతడే నే చెప్పిన వ్యక్తి. అతడికి జరిగిన సంఘటనే నేను నీకు చెప్పాను" అంటూ దూరంగా మరో సందులోకి వెళ్ళిపోతున్న బిచ్చగాడ్ని చూపించాడు మురళి.

కానీ అప్పటికే మరో సందులోకి వెళ్ళిపోవటంతో చంద్రశేఖర్ ఆ బిచ్చగాడ్ని చూడలేకపోయాడు.

"నువ్విక్కడే వుండు చందూ! అతడ్ని తీసుకొస్తాను" అంటూ ఆ బిచ్చగాడ్ని తీసుకు వచ్చేందుకు వెళ్ళాడు మురళి.

★ ★ ★ ★

చప్పట్లుకొడుతూ దూరంగా వెళ్ళిపోతున్న ఆ బిచ్చగాడ్ని పిలిచాడు మురళి. ఆ బిచ్చగాడు మురళిని చూసి ఆగాడు.



# సినిమా రంజని

## చందా వివరములు

విడి ప్రతి వెల – రెండు రూపాయిలు

| | ఏజంటు | పోస్టు |
| --- | --- | --- |
| 3 నెలలు — | రూ.26-00 | రూ. 28-00 |
| 6 నెలలు — | రూ.52-00 | రూ. 56-00 |
| సంవత్సరం – | రూ.104-00 | రూ.112-00 |

చందా సైకమును "ఆంధ్రపత్రిక, గాంధీనగరము, విజయవాడ–3" పేరిట యం.వో లేదా డ్రాఫ్టు పంపించవలెను.

– సర్క్యులేషన్ ప్రమోషన్ మేనేజర్

"ఏం బాబూ! ఎందుకు పిలిచారు?"

"నీ కారోజు చెప్పాను గుర్తుందా! మా ఫ్రెండ్ నీ మీద కథ వ్రాసి బహుమతి పొందాడని. అతడు అక్కడ నిలబడివున్నాడు, నీకు పరిచయం చేద్దామని పిలిచాను. నాతో రా" అంటూ బిచ్చగాడితో కథా విశేషాలు చెబుతూ నడిపించుకుంటూ చంద్రశేఖర్ నిలబడ్డ స్థలంవేపు తీసుకువస్తున్నాడు మురళి.

దూరంగా కిల్లీబడ్డీ దగ్గర సిగరెట్లు కొనుక్కుంటున్నాడు చంద్రశేఖర్.

"అదుగో! ఆ నీలం షర్టు వేసుకున్నాడే అతడే మా ఫ్రెండ్. పేరు చంద్రశేఖర్!" అంటూ దూరంనుంచే అత డిని చూపించాడు మురళి.

అతడిని చూస్తూనే ఆ బిచ్చగాడి ముఖంలో రంగులు మారిపోయాయి. ఓ రకమైన కోపం, అసహ్యం, వుద్వేగంతో వణికిపోయాడు. అక్కడనుండి మరో అడుగు ముందుకు వేయలేదతడు.

"ఏం? ఆగిపోయావేమిటి?" అడిగాడు మురళి.

"అతడేనా బాబూ! నువ్వు చెప్పిన రచయిత! గొప్ప జాలి హృదయం కలవాడని. అవును! చాల గొప్ప దయగలవాడు. అతడిలో వున్న జాలి, కరుణ, అభిమానం అన్నీ నాకు తెలుసుబాబూ! నేను అతడి దగ్గరకు రాను. అల్టాటి పాపాత్ముడి దగ్గర దేహీ! అని నేనడగను. వద్దు బాబూ! వద్దు!" అంటూ ఆవేశంగా వెనక్కి తిరిగి చాల తొందరగా నడవడం మొదలెట్టాడు.

అతడిని అనుసరించాడు మురళి.

* * * * *

ఆ బిచ్చగాడ్ని తీసుకొస్తానని వెళ్ళిన మురళి ఎంతకీ రాకపోయేసరికి విసుక్కుంటూ, కొన్నేపు మురళి వెళ్ళిన దారిలో వెతుక్కుంటూ తన రూంకు చేరుకున్నాడు చంద్రశేఖర్.

రూమ్ తలుపు తెరచిచూసిన తనకి నేలపైఓ కవరు వుండటం చూసి తెరచి చదివాడు.

డియర్ చంద్రశేఖర్,

ఆ బిచ్చగాడ్ని తీసుకొస్తానని వెళ్ళిన నేను ఎంతకీ రాకపోయేసరికి విసుక్కుని వుండివుంటావు కదూ! నిజమే! అది సహజం.

అయితే ఆ బిచ్చగాడ్ని కలుసుకున్నాక అతని నుండి మరికొంత సమాచారం నాకు తెలిసింది. ఈ విషయాలు ముందే తెలిసుంటే నీవు ఆ "జాలి కథ" వ్రాయకముందే చెప్పివుండేవాడిని. అప్పుడు నీ కథకు మరింత బలం చేకూరేది.

అయినా ఆ విషయాలు నీకు తెలియజేస్తున్నాను. కనీసం తరువాత వ్రాయబోయే కథకైనా వుపయోగపడొచ్చు.

ఆ బిచ్చగాడు ఒకప్పుడు మధ్య తరగతి కుటుంబీకుడు. ఒక మగ బిడ్డకు తండ్రయిన అతడు భార్యను పోగొట్టుకున్నాడు. తల్లీ, తండ్రీ తనే అయి ఆ మగపిల్లవాడ్ని పెంచి చదివించాడు.

అందరిలాగానే ఆ పిచ్చి తండ్రి తన కొడుకో మంచి వుద్యోగస్తుడవుతాడని, మహోన్నతమైన వ్యక్తిత్వాన్ని పొంది తనను వృద్ధాప్యంలో ఆదుకుంటాడని వూహించాడు. అవి కన్నవారి కలలు కదా!

కానీ పెంచి పెద్దచేసిన తండ్రిని తనకు గుదిబండలా వూహించి ఓనాడు అర్ధరాత్రి యిల్లొదిలి పారిపోయాడు ఆ రెక్కలు వచ్చిన కొడుకు.

కొడుకు భవిష్యత్తుకోసం అహర్నిశలు కష్టపడిన ఆ తండ్రికి కొడుకు వెళ్ళిపోయాక మిగిలినవి జవసత్వాలుడిగిన వృద్ధాప్యమూ, గంజికి నోచుకోని పేదరికమూను.

కోపమొచ్చి యిల్లొదిలి పోయిన కొడుకును వెదుక్కుంటూ, కొడుకు పనిచేస్తున్న ఆఫీసు తెలుసుకుని వెళ్ళాడా అభాగ్యుడు.

కన్న తండ్రిని కంటికి రెప్పలా చూసుకోవలసిన ఆ కొడుకు, కసాయివాడిలా ఆఫీసు బంట్రోతుకి చెప్పి తరిమేసాడు.

దిక్కుతోచని ఆ వృద్ధుడు యాచకుడయ్యాడు. పదిమంది ముందు ఛీ!......ఛో......అనే చీత్కారాలని భరించలేక కళ్ళూ, కాళ్ళూ వుంటే గంజికూడా పోయటానికి ఎవరూ ముందుకు రావటంలేదని తలచి తను ఆత్మహత్యకు ప్రయత్నించాడు. కానీ విధి వక్రించింది...... అతనికి చావు తప్పింది...... కానీ కాలు పోయి వికలాంగుడయ్యాడు.

ఇన్నాళ్ళూ నేను అప్పుడు జరిగిన ప్రమాదం యాదృచ్ఛికం అనుకున్నాను. కానీ అది స్వయంకృతం అని నిన్ననే తెలిసింది.

కన్న కొడుకు నిరాదరణ వల్ల ఆ తండ్రి యాచకుడు, వికలాంగుడూ అయ్యాడు.

ఇంతకీ ఎవరో తెలుసా ఆ వ్యక్తి? "నిన్ను కన్న తండ్రి!"

ఇట్లు
మురళి

ఉత్తరాన్ని పూర్తిచేసిన చంద్రశేఖర్ నిశ్చేష్టుడయ్యాడు. టేబిల్పైనున్న వారపత్రిక వారు పంపిన చెక్కు గాలికి రెపరెపలాడుతూ వెక్కిరిస్తున్నట్లనిపించింది. □

## విచిత్ర యధార్థ గాథలు

పులిగడ్డ విశ్వనాథరావు

# దివ్యదృష్టిగల హస్తసాముద్రికుడు కీరో

డెబ్బై ఎనభై ఏళ్ళ క్రితం ఇంగ్లండు నుంచి అమెరికాకు వచ్చిన ఒక హస్త సాముద్రికుడు న్యూయార్క్‌లో ఫిఫ్త్ ఎవెన్యూలో వాటా అద్దెకు తీసుకుని అమెరికాలో తన వృత్తికి శ్రీకారం చుట్టాడు. కాని అతణ్ణి సంప్రదించడానికి జనం రాకపోయే సరికి అతడు నిరాశ చెంది ఇంగ్లండుకు తిరుగు ముఖం పట్ట బోతూండగా ఒక చిత్రమైన సంఘటన జరిగింది.

"న్యూయార్క్ వరల్డ్" అని ప్రముఖ దినపత్రిక ప్రతినిధిగా ఒకామె అతన్ని కలుసుకుని, "అయ్యా, మేము మీకు ఒక పరీక్ష పెట్ట బోతున్నాం. దాంట్లో నెగ్గితే మా పత్రిక ద్వారా కనీ వినీ ఎరుగని ప్రచారం మీకు లభ్యమవుతుంది. లేకపోతే మీరు వెంటనే ఇంగ్లండుకు ప్రయాణం కావచ్చు" అని అన్నది. ఆ హస్త సాముద్రికుడు, "సరే, పరీక్ష ఏమిటి?" అని అడిగాడు.

"మీకు కొంతమంది హస్తరేఖా ముద్రలు చూపెడుతాం. ఐతే వాళ్ళెవరో మీకు చెప్పం. మీరు వాటిని చూసి వారి జీవిత విశేషాలను చెప్పాలి," అని ఆమె బదులు చెప్పింది. "అలాగే" అని అతడు ఆ సవాల్‌ను ఒప్పుకున్నాడు.

కొద్ది రోజుల తర్వాత ఆ ప్రతినిధి కొన్ని చేతి ముద్రలు తీసుకొచ్చి ఆ హస్త సాముద్రికుడికి అందించింది. అతడు వాటిని పరికించి ఆమెకు షార్ట్‌హాండ్‌లో వివరాలు డిక్టేట్ చేశాడు. చేతి ముద్రలలో నాలుగవదాన్ని చూసి, "ఈ చేతిముద్ర ఎవరిదో అతని అనుమతి కావాలి," అన్నాడు. "అందరి అనుమతి తీసుకున్నాం", అని ఆమె చెప్పి, "మీరు ఇతడి అనుమతి కోరడంలో రహస్యమేమిటి?" అని అడిగింది.

"ఈ వ్యక్తి హంతకుడు. అతడి నలభై నాలుగవ ఏట అతడి నేర విచారణ జరుగుతుంది. శిక్షకూడా పడుతుంది. అతడు ఏ వృత్తి చేపట్టినా తన తెలివి తేటల్ని దురుపయోగ పరిచి అక్రమంగా ధనార్జన చేస్తాడు. అతడు తర్వాత మృత్యువు నీడలో ఉంటూ అపార దుఃఖం, మనో క్షోభ అనుభవిస్తాడు. అతణ్ణి ఉరి తీయరు. అతడు కారాగారంలో నే కన్ను మూస్తాడు." అని ఆ హస్త సాముద్రికుడు చెప్పాడు.

ఈవిధంగా ఆ హస్త సాముద్రికుడు మిగతా చేతి ముద్రలను కూడా చూసి.రాయించాడు. తర్వాత తన జోస్యాలు నిజమవుతాయో లేదో అని మూడు రోజులు అత్యంత ఉత్సుకతతో గడిపాడు. నాలుగో రోజు ఉదయం అతని నీగ్రో తాబేదారు వచ్చి, "అయ్యా లేవండి. క్రింద వంద మందికి పైగా మీ కోసం వేచి ఉన్నారు," అని అన్నాడు. అలా జనం త్రోసుకు రావడానికి కారణం ఆ రోజు ఉదయం "న్యూయార్క్ వరల్డ్"లో ఆ హస్త సాముద్రికుడు మేయర్, డిస్ట్రిక్ట్ అటర్నీ మొదలగు ప్రముఖుల చేతి ముద్రలను చూసి వాళ్ళ జీవిత విశేషాలను ఖచ్చితంగా చెప్ప గలిగాడనే వార్త ప్రచురితమవడం. అప్పటి నుంచి అతడి హస్త సాముద్రిక వృత్తి మూడు పూవులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెందసాగింది. అతణ్ణి సంప్రదించ డానికి అతడి సెక్రటరీతో రెండు నెలల ముందుగా తేదీ నిర్ధారించు కోవలసి వచ్చేది.

ఇంతకీ ఆ హస్త సాముద్రికుడు హంతకుడని చెప్పిన వ్యక్తి పేరు డా మేయర్స్. అతడు పెద్దమనిషిలా చెలామణీ అవుతూ చికాగో పట్టణంలో భీమా చేయించుకున్న వ్యక్తి చనిపోయిన పక్షంలో తనకు భీమా రుసుము సంక్రమించేలా జనానికి భీమా చేయించేవాడు. పిమ్మట వాళ్ళకు డాక్టరుగా వ్యవహరించి వారికి విషం ఇచ్చి చంపి వాళ్ళ భీమా రుసుమును కాజేసేవాడు. చివరికి అతడు పట్టు బడ్డాడు కాని సాంకేతిక కారణాల వలన అది యావజ్జీవ కారాగార శిక్షగా మారింది అతడు కారాగారంలో దుఃఖంతో కుళ్ళి చనిపోయాడు.

పైన పేర్కొన్న ఆ హస్త సాముద్రికుడు మరెవరో కాదు తన జోస్యాలతో యావత్ ప్రపంచాన్ని ఊపి వేసిన కీరో. అతడి అసలు పేరు కౌంట్ లుయీ హేమన్. అతడి చేత చక్రవర్తులు, రాజకీయ నాయకులు, ప్రముఖ రచయితలు, నటులు జోస్యాలు చెప్పించుకుని ఆశ్చర్య చకితులయారు. వివిధ దేశాలు, ప్రపంచ భవిష్యత్తు గురించి చెప్పిన అతడి జోస్యాలు అక్షరాలా నిజమయాయి.

కీరో



ఒకసారి కీరో ఒక మహిళ చేయి చూసి ఆమె అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పాడు. ఆమె వెళ్ళాక ఆమెకు ఏదో అగ్ని ప్రమాదం వాటిల్ల బోతోందని అతడికి అనిపించింది. ఆమె నివసిస్తున్న హోటల్‌కు వెళ్ళి కీరో ఆమెను హెచ్చరించాడు. ఆమె నమ్మలేదు. కాని ఎందుకైనా మంచిదని స్నేహితురాలి ఇంటికి మారింది. ఐతే హోటలు గదిలో ఏ అగ్ని ప్రమాదం జరుగలేదు. కాని ఆ రాత్రి హోటలు గదిలో ఆమె విడిచిపెట్టిన ఆమె కుక్క గది నేలలో గ్యాసు పైపు లీక్ అవడం వలన ఊపిరి ఆడక చనిపోయింది. ఆ మహిళ ప్రసిద్ధ అమెరికన్ రచయిత్రి, కవయిత్రి బ్లాంష్ రూస్‌వెల్ట్.

అగ్ని ప్రమాదం జరిగిన కొద్ది రోజులకు బ్లాంష్ రూస్ వెల్ట్ పార్టీ ఇచ్చింది. దాంట్లో తెర వెనుక నుంచి కీరో అతిథుల చేతులు చూసి జోస్యం చెప్తున్నాడు. ఒక వ్యక్తి చేతులు చూసి కీరో,"అయ్యా, మీ ఎడం చేతిలో రాజభోగం ఉంది కాని కుడి చేతిలో దేశ బహిష్కారం ఉంది", అన్నాడు. ఆ వ్యక్తి అతడు చెప్పిన దాన్ని తిరిగి చెప్పి ఎగతాళిగా నవ్వాడు. ఆ వ్యక్తి ప్రసిద్ధ రచయిత ఆస్కార్ వైల్డ్. కొద్ది రోజుల తర్వాత వైల్డ్ మిత్రుడే అతడు సలింగ కామకేళి జరిపాడని అతడిపై కేసు పెట్టాడు. ఆ కేసులో వైల్డ్ చాలా అపకీర్తి పాలయాడు అతడికి రెండేళ్ళ కారాగార శిక్ష కూడా విధించ బడింది

కొంత కాలానికి వైల్డ్ పారిస్‌లో కీరోకు కనబడి నిరాశ, నిస్పృహలు వ్యక్తం చేసి పాత మిత్రులు తనను ఎలా ఈసడించు కుంటున్నారో, తాను సమాజంలో పూర్వస్థితికి చేరుకోవడం ఎంత అసంభవంగా ఉందో ఏకరవు పెట్టుకున్నాడు. కొద్ది రోజులకే అతడు చనిపోయాడు

అప్పటి బ్రిటన్ రాజు ఏడవ ఎడ్వర్డ్ కీరోని పిలిపించి తాను ఎన్నాళ్ళు జీవించేదీ అడిగాడు. కీరో సంఖ్యా జ్యోతిశ్శాస్త్రం బట్టి అతడు 69 ఏళ్ళు బ్రతుకుతాడని జోస్యం చెప్పాడు. 61 వ ఏట అతడికి తీవ్ర మైన అస్వస్థత కలిగింది. కీరోని పిలిపించి, "నేను 69 ఏళ్ళ వరకు బ్రతుకుతానని నువ్వు జోస్యం చెప్పావు ఇప్పటికీ అది నిజమే నంటావా?" అని ప్రశ్నించాడు. "మీరు 69వ ఏట వరకు తప్పక బ్రతుకుతారు," అని బదులు చెప్పాడు కీరో. అలాగే ఏడవ ఎడ్వర్డ్ అప్పటికి మృత్యువు బారి నుంచి బైట

పడి 69 ఏళ్ళ వరకు బ్రతికాడు.

కీరో తండ్రి కవి. తల్లికి సాముద్రిక శాస్త్రంలో ఆసక్తి ఉండేది. తండ్రి కవిత్వ సాధనలో కొడుకు అంతరాయం కలిగించకుండా తల్లి అతడికి చేతులు చూడడం నేర్పింది. తండ్రి అతణ్ణి చర్చిలో అర్చకుడిని చేద్దామనే ఉద్దేశంతో క్రిస్టియన్ ధర్మ శాస్త్రాలు, పురాణాలలో శిక్షణ ఇప్పించాడు. "బుక్ ఆఫ్ ఫేట్" మొదలగు ధర్మ గ్రంథాలలో జోస్యాలు సాముద్రిక శాస్త్రంలో అతడి ఆసక్తిని ఇనుమడింప జేశాయి. తండ్రి వ్యాపారంలో దివాళా తీసి నిరాశ చెంది నీ కిష్టమొచ్చిన వృత్తి చేపట్టు అని కొడుక్కు స్వేచ్ఛ నిచ్చాడు. దాంతో కీరో అర్చకుడి వృత్తికి వీడ్కోలు చెప్పి హస్త సాముద్రిక వృత్తి చేపట్టాడు.

కీరో చేతి రేఖలు చూసి జోస్యం చెప్పినా అతడిలో ఏదో అలౌకిక శక్తి నిజం పలికించేది. ఎందుకంటే కేవలం సాముద్రిక శాస్త్రం ద్వారా అంత ఖచ్చితంగా జోస్యాలు చెప్పడం అసంభవం.

కీరో లండన్ వచ్చి సాముద్రిక వృత్తి మొదలెట్టాడు. ఐతే అప్పుడు సాముద్రిక శాస్త్రాన్ని చేతబడిగా పరిగణించేవారు. ఆ వృత్తికి విరుద్ధంగా చట్టం కూడా ఉండేది. కీరో తన మేధస్సుతో ఆ ఇబ్బందులను ఎదుర్కొని నిలదొక్కుకున్నాడు. కొద్దికాలం తర్వాత కీరో సాముద్రిక శాస్త్రానికి పుట్టినిల్లు ఐన ఇండియాకు వచ్చి సాముద్రిక శాస్త్రం క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. ఈజిప్ట్‌ను సందర్శించి పిరమిడ్‌ల నిర్మాణంలో జ్యోతిశ్శాస్త్రానికి ఖగోళ శాస్త్రానికి సంబంధించిన రహస్యాలు కనుగొన్నాడు.

కీరో సంఖ్యా జ్యోతిశ్శాస్త్రాన్ని బట్టి ఇటలీ రాజు హంబర్ట్ హత్య జరుగుతుందని చెప్పి అదే నిజమయితే పర్షియా షా రాజ్యం విడిచి పలాయనం అవవలసి వస్తుందని జోస్యం పలికాడు. అలాగే ఇటలీరాజు హంబర్ట్ రాజప్రాసాదం నుంచి బైటకు వెళ్తుండగా బ్రెసీ అనే రాజద్రోహి అతన్ని చంపేశాడు. 1900లో పర్షియా షా ముజఫ్ఫరుద్దీన్ పారిస్‌కు వచ్చాడు. అప్పుడు షా కీరోని పిలిపించి తన చేతి ముద్రలు అతడిముందు ఉంచాడు. కీరో చెప్పింది విని, "నువ్వు చెప్పింది అందరికీ తెలిసిందే. ఇంకా ఏమైనా చెప్పదలిచావా?" అని అడిగాడు. "ఏదైనా మీ వస్త్రం ఇవ్వండి" అన్నాడు కీరో. షా తన రుమాలు ఇచ్చాడు. దానిని వాసన చూసి "ప్రస్తుతం మీ రాజధాని టెహరాన్‌లో భయంకర సంఘటనలు జరుగుతున్నాయి. గవర్నర్‌ని ఆకలిగొన్న ప్రజలు చుట్టు ముట్టారు. ప్రజలకు ఆహార ధాన్యాలు దొరక్కపోతే మీ గవర్నరు ప్రాణాలు పోవచ్చు. అక్కడ ప్రజలు ఎదురు తిరిగారు" అని చెప్పాడు

షాకు విపరీత మైన కోపం వచ్చింది. "నువ్వు చెప్పింది నిజం కాదు. నా ముందు నుంచి వెళ్ళిపో" అని షా గర్జించాడు. కీరో అవమానంతో కృంగి పోయి వెళ్ళిపోయాడు. ఇది జరిగిన రెండు రోజుల తర్వాత షా మనుషులు కీరో వద్దకు వచ్చి "షా మిమ్మల్ని ఆహ్వానిస్తున్నారు" అని చెప్పి షా వద్దకు



పర్షియా రాజు షాముజఫ్ఫరుద్దీన్

తీసుకెళ్ళారు. షా "కీరో నువ్వు ఆశ్చర్యకరమైన మనిషివి. నేను నువ్వు చెప్పింది శంకించి పొరబడ్డాను. నువ్వు చెప్పింది అక్షరాలా నిజమైనట్టు నిన్న రాత్రి కబురు వచ్చింది. నీకు 'షేరే ఆఫ్తాబ్ పర్షియా' అనే బిరుదు ప్రదానం చేద్దామను కుంటున్నాను" అని అన్నాడు.

కీరో షాను జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాడు. తర్వాత షాను చంపడానికి రెండు సార్లు యత్నాలు జరిగాయి కాని అతడికి ఏ హానీ కలుగలేదు. ఐతే 1907లో అతడు సింహాసనం విడిచి పెట్టి, ఎక్కడికో పారిపోవలసి వచ్చింది. ఆ ఏడే అతడు చని పోయాడు కూడా.

అప్పుడు బ్రిటిష్ యువరాజుగా (ప్రిన్స్ ఆఫ్ వేల్స్) ఉన్న ఎనిమిదవ ఎడ్వర్డ్ తీవ్ర పరిణామాలకు దారితీసే ప్రేమ వ్యవహారంలో చిక్కుకునే అవకాశం ఉందని అలా జరిగితే అతడు సింహాసనంతో సహా సర్వస్వం త్యజిస్తాడని కీరో నాడే చెప్పాడు. అతడు చెప్పినట్టే ఎనిమిదవ ఎడ్వర్డ్ రాజ్యం వదులుకుని తన హృదయ సామ్రాజ్ఞి అయిన మిసెస్ సింప్సన్‌ను వివాహ మాడాడు. ఆమె విడాకులు తీసుకున్న సామాన్య కుటుంబానికి చెందిన మహిళ. అందువలన బ్రిటిష్ ప్రభుత్వం ఆ వివాహానికి అడ్డు చెప్పింది. దాంతో అతడు రాజ్యాన్ని కాలదన్ని ఆమెను పెళ్ళాడాడు.

కీరో వివిధ దేశాలకు సంబంధించి చెప్పిన జోస్యాలు అక్షరాలా నిజమయాయి. ఇండియాను బ్రిటిష్ వలస రాజ్యంగా ఉంచే యత్నాలు విఫల మవుతాయని, ఇండియా స్వాతంత్ర్యం పొందు తుంది కాని మత కలహాలు చెలరేగి రెండు భాగాలుగా చీలిపోతుందని అతడు చెప్పాడు. ఇండియాలో మహిళలు ముఖ్య పాత్ర వహిస్తారని కూడా అతడు చెప్పాడు.

ద్వితీయ ప్రపంచ యుద్ధం జరుగుతుందని, ఇస్రాయెల్ నెలకొల్పబడుతుందని, రెండు వేల ఏళ్ళకు పైగా ప్రవాసులుగా జీవిస్తున్న యూదులు ప్రపంచం నలుమూలలనుంచి వచ్చి ఇస్రాయెల్‌లో స్థిరపడుతారని కీరో చెప్పాడు. 1980 నాటికి ఇస్రాయెల్ చాలా అభివృద్ధి చెందుతుందని, అది మున్ముందు అతి శక్తివంతమైన దేశంగా మారుతుందని పలికాడు.

ఇస్రాయెలీలు, వారితో కలిసి మెలిసి పని చేసే విదేశీయులు పాలస్తీన్, ఇస్రాయెల్ దేశాల సంపదలను కనుగొని అభివృద్ధి పరుస్తారని, అప్పుడు గ్రేట్ పిరామిడ్ ప్రపంచ నాగరికతను అదుపు చేసే కేంద్రంగా మారుతుందని జోస్యం చెప్పాడు. కీరో పిరమిడ్‌ల గురించి అధ్యయనం చేసి వాటి గురించి చాలా ఆసక్తి కరమైన విషయాలు చెప్పాడు. పిరమిడ్‌లు కట్టినవారు ఖగోళ శాస్త్రంలో ఆరితేరిన వారై ఉండాలని, అటువంటి అద్భుతమైన కట్టడాలు కేవలం శవాలకి గోరీలుగా ఉపయోగ పడేందుకు కాదని, వాటిలో జ్యోతి శ్శాస్త్రానికి, ఖగోళ శాస్త్రానికి సంబంధించిన

పిరమిడ్‌లలో రహస్యాలు అనేక శాస్త్రీయ సూత్రాలను తారు మారు చేస్తాయని కీరో జోస్యం చెప్పాడు.



రహస్యాలు నిహితమై ఉన్నాయని అతడు పేర్కొన్నాడు గ్రేట్ పిరమిడ్ సౌర - చాంద్రమాన గడియారం లాటిదని, సూక్ష్మ శేషాలతో సహా సౌర సంవత్సరంలో తిధులను, విమవత్తు (ఈక్వినాక్స్) లని సూచించే ఖచ్చితమైన కొలమానాలు దాంట్లో ఉన్నాయని చెప్పాడు

గ్రేట్ పిరమిడ్ ఆదారం క్రింద కల్పనా తీతమైన బంగారం, నగల నిక్షేపాలున్నాయని ఆ ఆధారం త్రవ్వితే పిరామిడ్ నిర్మాణంలో శాస్త్రీయ రహస్యాలు వెలుగులోకి వస్తాయని చెప్పాడు కీరో ఖగోళ శాస్త్రం, భూమ్యాకర్షణ, శక్తి, విద్యుచ్ఛక్తి, ప్రకాశం అంతరిక్ష కిరణాలు అణువులలో నిహితమై ఉన్న శక్తులకు సంబంధించిన నియమాలను ఈ రహస్యాలు తారుమారు చేస్తాయని, బైబిల్‌లో చెప్పిన విధంగా ఈ విధమైన పరిజ్ఞానం సాధించిన ఇస్రాయిలీలు, వారి సంతతివారు భూమికి యజమానులవుతారని పేర్కొన్నాడు ఈ విధంగా యూదులకు ఉత్తినే ప్రాముఖ్యం అంటగట్టడానికి తాను యూదుని కానని సంజాయిషీ కూడా చెప్పుకున్నాడు కీరో

కీరో చెప్పిన జోస్యాలు ఈ విధంగా ఉన్నాయి వచ్చే 500 ఏళ్ళలో (1925లో అతడు ఈ జోస్యాలు చెప్పాడు) వాషింగ్టన్, న్యూయార్క్ బఫెలో, బోస్టన్, టోరంటో మొదలగు ఉత్తర అమెరికా తూర్పు వైపు పట్టణాలు భూకంపాల వలన తీవ్రంగా దెబ్బతింటాయి నూయార్క్ పెద్ద భాగం నాశన



భారత విభజన గురించి జోస్యం చెప్పిన కీరో.

# విచిత్ర యధార్థ గాథలు

మవుతుంది ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో కొత్త భూభాగం ప్రత్యక్షమవుతుంది దీని వలన గల్ఫ్ స్ట్రీమ్ దారి మారుతుంది అందు వలన అమెరికా తూర్పు రాష్ట్రాలలో తీవ్రమైన శీతాకాలం ఏర్పడుతుంది ఉత్తర యూరోప్‌లో ఉత్తర రష్యా జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్స్, స్పెయిన్, డెన్మార్క్ మొదలగు దేశాలు క్రమంగా మానవ నివాసానికి పనికి రాకుండా పోతాయి ఐతే చైనా, ఇండియా, ఆఫ్రికా, ఈజిప్ట్‌లాంటి దేశాలలో సమశీతోష్ణ వాతావరణం వృద్ధి చెందుతుంది అక్కడ నాగరికత వర్ధిల్లుతుంది భూకంపాల పరంపర వలన అట్లాంటిక్ సముద్రంలో అజోర్స్ ద్వీపాలు లేస్తాయి పురాతన కాలం నుంచి మాయమైన అట్లాంటిస్ భూఖండం అవశేషాలను మానవులు కనుగొని వాటిని అన్వేషిస్తారు అట్లాంటిస్ ప్రత్యక్షం అవడం వలన భౌగోళిక పరిణామాలు జరిగి సహారా ఎడారి భూమధ్య సముద్రంగా మారుతుంది దీని వలన ఈజిప్ట్ మొదలగు ఆఫ్రికా ఉత్తర భాగపు దేశాలలో సమ శీతోష్ణ వాతావరణం నెలకొని పాలస్తైన్ ఈజిప్ట్ మొదలగు దేశాలు ప్రపంచ ధాన్యాగారాలుగా వర్ధిల్లి నాగరికతకు కేంద్రాలు అవుతాయి

వచ్చే 500 ఏళ్ళలో ప్రపంచంలో సామ్రాజ్యాలు విచ్ఛిన్నమవుతాయి, కొత్త దేశాలు ఉద్భవిస్తాయి విప్లవాలు, యుద్ధాలు జరుగుతాయి ఈ పరిణామాలు ఒక మహాయుద్ధానికి దారి తీస్తాయి ఆ తర్వాత పాలెస్టైన్ కేంద్రంగా ప్రపంచ ప్రభుత్వం ఏర్పాటు అయి అది యావత్ ప్రపంచంలో జీవన సూత్రాలను, మానవత్వపు విలువలను ప్రసరింప జేస్తుంది తర్వాత ప్రపంచమంతా శాంతి, భద్రతలు రాజ్యమేలుతాయి □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1987 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాదిక్రమంలో ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము

**ముగింపు తేదీ : 22 ఆగస్టు,1987**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు 700/- చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 750/-, రు 650/-, రు 550/- వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్కదానికీ అదనంగా రు 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

## నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర రావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై 1987 దీపావళి కథల పోటీకి అని మొదటి పేజీ పైభాగంలో స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు అనుసరణలు కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన రేడియోలో ప్రసారం అయిన ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

4 రచయితలు రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది.

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 22 ఆగస్టు 1987కి గానీ ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు జత పరచి పంపనవసరం లేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

11 పోటీకి పంపే కథలని సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వార పత్రిక గాంధీనగరం విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పై భాగంలో 1987 దీపావళి కథల పోటీకి అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

# ప్రేమసాగరమథనం

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



సీరియల్

(గత సంచిక తరువాయి)

కొద్ది క్షణాలున్నాక విలాసిని కనులు తెరిచింది. ఆమె కళ్ళల్లో కానవస్తున్న అరుణిమ చూచాక దీప్‌కు ఆమెకు కోపం వచ్చిందని అర్థం అయింది. జేవురించిన ఆమె ముఖం చూచి "డాడీ ప్రస్తావన తెస్తేనే విలూకు ఇంత కోపం వచ్చింది! బాంకులో నేను ఎనిమిది లక్షల రూపాయలు వేయడం డాడీ కోరికప్పైన చేసిన పని అని తెలిస్తే యీమె సహించలేదు. ఆ డబ్బు ముట్టుకోదు!" అనుకున్నాడు దీప్.

"దీప్ దయచేసి ఆ కిరాతకుడి ప్రస్తావన నావద్ద తీసుకురావద్దు!" అన్నది విలాసిని.

దీప్ మారాడకపోయేసరికి "కన్న తల్లిలా చూచుకున్న అక్కను నిలువునా హత్యచేసి పరారైపోయిన వ్యక్తి, నన్ను అనాధను చేసి నా జీవితం అంధకార బంధురంచేసిన వ్యక్తి నా మేనమామ అని చెప్పుకోవలసి రావడం నా దౌర్భాగ్యం!" అన్నది విలాసిని ఆవేశంగా.

డాడీ మీద విలాసిని మనసులో ఏర్పడిన విద్వేషభావం స్వరూపం అర్థం అయింది దీప్‌కు!

ఆమెవద్ద ఇక ఆ ప్రస్తావన తేవడం శ్రేయస్కరంకాదని అనిపించిందతనికి!

కన్న తల్లి మరణంతో సవతితల్లి పోరు భయంకర హింసలతో ఆమె జీవితం అంధకార బంధురమైంది. అందుకు కారణం మేనమామ అన్నభావం ఆమె మనసులో నాటుకు పోయివున్నది.

"నేను తన మేనమామ కొడుకునని తెలిస్తే యీ విలూ నన్ను కూడా ద్వేషిస్తుందేమో!" అన్నభావన మనసులో కి రాగానే దీప్ మనసు జల్లుమంది.

డాడీ నిరంతరం విలాసిని గుర్చి ఆలోచిస్తుండేవాడని, ఆకస్మికంగా చనిపోయే ముందుకూడా ఆమె గురించే మానసిక వ్యధకు లోనయ్యాడని చెబితే విలాసిని మనసు మారుతుందేమో?

కాని అందుకింకా సమయం రాలేదనిపించిందతనికి!

* * * * * *

**జరిగిన కథ –9 :** తన ముఠా స్థావరంపై దాడికీ, విలాసిని ఖాతాలో ఎనిమిది లక్షలు చేరడానికీ సంబంధం ఉన్నదని అనుమానించి విలాసిని మీద, సన్నీ మీద పగబడతాడు నాగరాజు. సన్నీ కుడి భుజమైన సాంబును చంపేయిస్తాడు. నాగరాజు మనుషులు, సన్నీ మనుషులు విలాసిని గది ముందర భీకరంగా ఘర్షణ పడుతుండగా అక్కడ్నించి పారిపోయిన విలాసిని, సందీప్‌లు దొరికిన రైలెక్కి మద్రాసుకు ప్రయాణం కడ్తారు. తన ఆస్తులకు ముప్పు వస్తుందేమోనని రాఘవరావు కూడ విలాసిన్ని వెతకాలని నిర్ణయించుకుంటాడు. సందీప్ తన బావమరది కొడుకని రాఘవరావుకు తెలిసి పోతుంది. వాళ్ళిద్దరినీ చంపెయ్యమని ఆజ్ఞాపిస్తాడు.

"ఒరేయ్ కైలాసం! నాల్రోజులు తీర్థయాత్రలు చేసి వస్తాను! క్లబ్ జాగ్రత్తగా చూసుకో!

రాఘవరావుగారి దగ్గర్నుండి మాటరాకూడదు!" సెకండ్ ఇన్‌కమాండ్ కైలాసానికి బాచ్ వ్యవహారాలు అప్పగింతలు పెడుతూ అన్నాడు కింగ్‌కాంగ్ –

"గురూ! జేబులు కొడుతూ తన్నులుతింటూ జైల్లో మగ్గుతూ వుండే కైలాసాన్ని ఆదుకుని యీ రోజు సమాజంలో ఒక స్టేటస్ సంపాదించి పెట్టావు!

నువ్వు నిప్పుల్లో దూకమంటే దూకుతాను ప్రాణాలు తీసి యిమ్మంటే యిస్తా!" అన్నాడు కైలాసం బదులుగా!

అతని మాటలకు కింగ్‌కాంగ్, మనసులో తృప్తి ముఖంలో కనపడకుండా జాగ్రత్తపడి సందీప్ వేట ఏర్పాట్లలో పడిపోయాడు.

సందీప్, విలాసిని పార్కు టాక్సీలో రైలు స్టేషన్ దగ్గరకు వెళ్ళింది సుమారు ఏడు ఏడున్నర ప్రాంతంలో.

ఆసమయంలో విజయవాడ స్టేషన్‌లో వుండే రైళ్ళు కొద్ది. మద్రాసు వెళ్ళే సర్కారు ఎక్స్‌ప్రెస్ ఆసమయంలో స్టేషన్‌లో వుంటుందని తట్టగానే అతని మనసు ఆనందంతో నిండిపోయింది.

ప్రాణభీతితో విజయవాడ నుండి పారిపోయే వాళ్ళు వీలున్నంత దూరం వెళ్ళిపోవాలనుకుంటారు!

సందీప్ విలాసిని ముప్పాతిక ముప్వీసం సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కి వెళ్ళే అవకాశాలు ఎక్కువ!

ఏవిషయమైనా వొకటికి రెండు మార్లు నిర్ధారణ చేసుకోవటం కింగ్‌కాంగ్‌కు అలవాటు.

స్టేషన్‌లో జేబులు కొట్టే అవతారానికి కబురంపాడు కింగ్‌కాంగ్.

అవతారం వంగి కింగ్‌కాంగ్‌కు నమస్కరిస్తూ "దణ్ణాలు గురూగారూ!" అన్నాడు.

"అరేయ్ అవతారం! నిన్న రాత్రి ఏడు ఎనిమిది ఆప్రాంతాల ఏం చేస్తున్నావ్?" అని అడిగాడు కింగ్‌కాంగ్.

బుర్రగోక్కుంటూ "ఆసమయంలో నా? డూటీలో వున్నా గురూగారూ!"

"ఏట్రైన్ దగ్గర?"

"సర్కార్ ఎక్స్‌ప్రెస్ దగ్గర!"

"పెద్దమ్మాయిగా ర్నెరుగుదువుగా?"

"ఆ! అమ్మాయిగార్నెరగక పోటం ఏంటి? నిన్న సర్కార్‌లో ఎల్లారుగా! ఆరితో పాటొ క సినిమా హీరో లాంటి కుర్రాడు కూడా వున్నాడు".

వెదకబోయిన తీగ కాళ్ళకు తగిలింది అన్నట్టు తనకు కావలసిన ఇన్‌ఫర్మేషన్ అయాచితంగా లభించే సరికి కింగ్‌కాంగ్ మనసు ఆనందంతో నిండిపోయింది.

"సరే! వెళ్ళిరా అవతారం! అమ్మాయిగారు సరిగ్గా రైలెక్కారో లేదో

కనుక్కోమన్నారు బాస్! అందుకు నీకంటే సరైన వ్యక్తి నా మనసుకు తట్టలేదు" అన్నాడు కింగ్‌కాంగ్.

"దణ్ణాలు గురూగారూ!" అంటూ వంగి నమస్కారం చేసి వెళ్ళి పోయాడు అవతారం.

తన బాచ్‌తో సహా ఆరాత్రి సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు వెళ్ళి పోయాడు కింగ్‌కాంగ్.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

"అరేకోటీ!" మూలుగుతూ అరిచాడు నాగరాజు.

"బాస్!"

"విలాసినిని ఎత్తుకు రమ్మంటే టైగర్‌తో సరసాలాడి ఏడుచువ్వలెనకెవరు జేరమన్నార్రా?"

"నా ఏరియాలో అడుగెట్టి నాకడ్డం వచ్చింది గాకుండా నా మీద కయ్యానికి కాలుదువ్వాడు బాస్! అందుకని ఆ టైగర్ గాడికి నా తడాఖా రుచిచూపించాను!"

"ఏడవలేక పోయావ్! అసలు విషయం వొదలి కొసరు తగూలు తెచ్చి పెట్టావ్!

ఎలాగైనా విలాసినిని పట్టుకురావాలి భూమి మీద ఏ మూలన వున్నాసరే!"

"అలాగే బాస్! ఇందాక అవతారం కనపడి అమ్మాయిగారు సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళారని చెప్పాడు!"

"అలాగా! అయితే నువ్వు వెంటనే బయల్దేరి మద్రాస్ వెళ్ళు. అది ఎక్కడవున్నా పట్టుకుని నాదగ్గరకు తీసుకురా! వెళ్ళు!"

"అలాగే బాస్!"

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

"బాస్!"

"యస్! టైగర్ స్పీకింగ్!"

"విలాసిని నిన్న రాత్రి సర్కారులో వెళ్ళిందట. కోటిముఠా, కింగ్‌కాంగ్ ముఠా బయల్దేరి మద్రాస్ వెళ్ళారు!"

రైల్‌స్టేషన్ దగ్గర్నుండి అనుచరుడు ఫోన్ చేయగానే ఎలర్టయి పోయాడు టైగర్.

"రేయ్! మనవాళ్ళందర్నీ చవ్వున స్టేషన్‌దగ్గరకు రమ్మను. మెయిల్లో అందరం మద్రాస్ వెళ్ళాలి!" అంటూ ఫోన్‌లో అరిచాడు టైగర్.

కోటి, కింగ్‌కాంగ్‌లు సర్కార్‌లో బయల్దేరి వెళ్ళిన వెంటనే మెయిల్లో టైగర్ ముఠా మద్రాస్ బయల్దేరి వెళ్ళింది!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

"విలూ! నువ్విక్కడే వెయిటింగ్ రూంలో వున్నావంటే నేను సిటీలో పల మంచి బట్టల దుకాణం దగ్గరకు వెళ్ళి నీకు మంచి సారీ అవీ తెస్తాను!" దీప్ మాటలకు విలాసిని కొంచెం సిగ్గుపడింది.



# ప్రేమసాగర మథనం

"కట్టుకున్నది పాతచీరె, ఫస్ట్‌క్లాస్‌కూపేలో ప్రయాణించినా నలిగి దుమ్ము కొట్టుకు పోయివున్నది. చూసే వాళ్ళు పనిమనిషి అని అనుకుంటారు" మనసులో ఆలోచనల వలన బిడియంతో తలదించుకు పోయింది.

విలాసిని అనుకున్నట్లే చెకింగ్ ఆమె వచ్చి "టికెట్ ప్లీజ్!" అని అడిగి విలాసిని దగ్గర టికెట్ చూసి ఆమెను పైకి కిందకు ఎగాదిగా పరికించి వెళ్ళి పోయింది. పట్టు చీరో లేక పోతే నైలెక్స్ చీరో కట్టుకుంటే గాని ఫస్ట్‌క్లాస్ వెయిటింగ్ రూంలో వుంటానికి అర్హురాలివి గాదు అన్నట్లున్నాయామె చూపులు!

ఇరవై నిముషాలలో తిరిగి వచ్చాడు దీప్. అతను రెడీమేడ్ టెర్లిన్ పాంట్ పాలిస్టర్ షర్ట్ వేసుకుని వున్నాడు. ఒక సూట్‌కేస్ విలాసినికిస్తూ "విలూ! ఇందులో నీక్కావలసిన దుస్తులు టాయిలెట్ సామాను వుంది" అన్నాడు.

సూట్‌కేస్ తెరచి అందులో వున్న టెర్లిన్ చీరె, రెడీమేడ్ జాకెట్ టవలు, సోపు టాయిలెట్ సామాను తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళి శుభ్రంగా తలస్నానం చేసి వచ్చింది. విడిచిన బట్టలు సూట్‌కేస్‌లో వుంచుకుని వెయిటింగ్ రూం బయటకు వచ్చింది.

"హలో విలూ! మంచుబిందువులతో తడిసిన మల్లె మొగ్గలా వున్నావు!" అన్నాడు దీప్.

చిరునవ్వుతో "కవిత్వం చెప్పేట్లున్నావు దీప్" అంది విలాసిని.

"నిన్నీక్షణాన చూసి కవిత్వం చెప్పలేనివాడు మనిషికాడు" అన్నాడు దీప్

విలాసిని మారాడకపోయే సరికి "విలూ! నా స్నేహితుని కుటుంబం కీల్పాక్‌లో ఎపార్ట్‌మెంట్‌లో వుంటున్నారు. వాడూ నేనూ చిన్నప్పట్నుంచీ రెండేళ్ళ క్రితం వరకూ క్లాస్ మేట్స్! హోటల్‌లో వుండి విజయవాడ నుండి మనను వెంటాడుతూ వచ్చే రాబందుల కళ్ళ బడే కంటే గుట్టుగా వాళ్ళ ఎపార్ట్‌మెంట్‌లో వుంటం మంచిది! ఏమంటావు".

సరేనన్నట్లు తలూపింది విలాసిని కాసేపున్నాక "మద్రాసులో నా స్నేహితురాలు షీలా వున్నది గాని, విజయవాడ నుండి నాకోసం ఎవరైనా వస్తే ముందామె యింట్లో వెతుకుతారు"! అంది

దీప్ విలాసిని మాంబళంలోని 'అప్నాఘర్' ఎపార్ట్‌మెంట్స్ దగ్గరకు వెళ్ళారు.

దీప్ ఫ్రెండ్ పేరు పురుషోత్తం! అతన్ని ఇంట్లోను, క్లోజ్ ఫ్రెండ్స్ పిమా అని పిలుస్తారు. అప్నాఘర్ ఏడంతస్తుల మేడ. పిమా వాళ్ళుండే ఎపార్ట్‌మెంట్ అయిదో అంతస్తులో వున్నది. విలూ, దీప్ వెళ్ళేసరికి పిమా అపార్ట్‌మెంట్ తలుపు వేయబోతున్నాడు.

"అరే! దీప్! ఎన్నాళ్ళకు కనబడ్డావురా!"

"పిమా! యు ఆర్‌ది సేమ్ వోల్డ్‌గై!" ఒకరినొకరు అమాంతం కావిలించుకున్నారు.

"అరే! బాభీని వాకిట్లోనే నిలబెట్టేసాను! రండి! లోపలకు రండి!"

పిమా మాటలకు విలాసిని ముఖం జేవురించింది. అపార్ట్‌మెంట్ లోని డ్రాయింగ్ రూంలో కూర్చుంటుండగా పిమా "అరేయ్ దీప్! చెప్పా పెట్టకుండా పెళ్ళి చేసుకున్నావు! కనీసం నాకు ఇన్విటేషన్ కార్డు పంపలేదు! ఎంత దుర్మార్గుడివిరా!"

"ఏదో హడావిడిగా పెళ్ళి జరిగి పోయింది అందుకని నీకు ఇన్విటేషన్ పంపలేక పోయాను! పరిహారంగా వివాహమైన వెంటనే మద్రాసు వచ్చి మీ అపార్ట్‌మెంట్‌కు వచ్చాను!" అన్నాడు దీప్.

అతని వంక చురుక్కున చూసి ముఖం పక్కకు తిప్పుకుంది విలాసిని.

"ఆంటీ ఏదిరా పిమా?" అని అడిగాడు దీప్.

"మమ్మీ డాడీ బెంగుళూరు లోని అక్కగారింటికి వెళ్ళారు! బావగారి చెల్లెలు పెళ్ళి! నేను యిప్పుడు బయల్దేరి ఫ్లైట్‌లో వెళ్ళిపోవాలి!" అన్నాడు పిమా.

"అలాగా! సరే! మేము ఏదైనా హోటల్‌కు వెళతాంలే!" అన్నాడు దీప్.

"నథింగ్ డూయింగ్! ఇక్కడే వుండాలి మీరు. అయిదారు రోజులలో మమ్మీ నేను డాడీ తిరిగి వస్తాం అప్పటి వరకూ మీరిక్కడే వుండండి!"

"మీరు లేకుండా మీ ఎపార్ట్‌మెంట్‌లో వుండమంటావా? బాగుండదు!"

"ఎందుకు బాగుండదు? నేను ఢిల్లీలో ఎన్నిరోజులు మీయింట్లో వుండలేదు? అరే దీప్! నన్ను బొత్తిగా పరాయివాడిని చేయకు!

బాభీ! ఒరేయ్ దీప్! ఇంతవరకూ బాభీ పేరు చెప్పలేదురా నువ్వు!"

"విలాసిని!"

"విలాసినీ బాభీ! మమ్మీ వెళ్తూ వంటతనికి పనిమనిషికి శెలవ యిచ్చి వెళ్ళింది. కాని కిచెన్ అవీ చూపిస్తాను! ఇష్టమైనప్పుడు కుక్ చేసుకోండి. బద్ధకంగా వుంటే హోటల్‌కు వెళ్ళి మీల్సు చేసి రండి! కాని మేము తిరిగి వచ్చే వరకు మీరిక్కడే వుండాలి". అంటూ విలాసిని వెంటరాగా కిచెన్ లోకి వెళ్ళి మాడరన్ కుకింగ్ రేంజి, ఫ్రిజ్, కప్ బోర్డు చూపించాడు

అయిదు నిముషాలున్నాక సూట్‌కేస్ తీసుకుని హడావిడిగా

"దీప్! ఇలా మిమ్మల్ని వదలి వెళ్తున్నందుకు ఏమీ అనుకోకు!

బట్ ఐనో న్యూలీ వెడ్‌కపుల్ విల్ వాంట్‌టు లీడ్ ఏన్ ఐసోలేటెడ్ లైఫ్" అని ఎడమకన్ను చికిలించి వెళ్ళిపోయాడు.

పిమా వెళ్ళగానే దీప్ ఎపార్ట్‌మెంట్ తలుపు గడియ వేసి వచ్చాడు.

"నువ్వింత అబద్ధాల కోరు వనుకోలేదు దీప్"!

"నన్నేనా అంటున్నావు?"

"మరి! నీ మాటల గారడీ చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది!

పిమాతో మన పెళ్ళి అయినట్లు, హనీమూన్‌కి వచ్చినట్లు చెప్పావ్?!"

"అదా! అలా చెప్పకపోతే చాలా అగ్లీ సిట్యుయేషన్‌లో పడివుండే వాళ్ళం!

నీకు నాకూ పెళ్ళి కాలేదని తెలిస్తే పిమా మనకు తన ఎపార్ట్‌మెంట్ యిచ్చి వెళ్ళి వుండేవాడు కాదు!

మనం ఏ హోటల్‌కో వెళ్ళి కాలం గడపవలసి వచ్చేది! విజయవాడ నుండి మనల్ని వేటాడుతూ వచ్చిన వాళ్ళకు తేలికగా దొరికేవాళ్ళం!"

"మాటల్లోనే మరిపిస్తావు దీప్!" అంటూ కిచెన్ లోకి వెళ్ళింది విలాసిని నవ్వుతూ!

* * * * * * * * * *

"బాస్!" కోటి గొంతు ఫోన్‌లో నమ్రతగా పలికింది.

"యస్! నాగరాజుని మాట్లాడుతున్నాను!"

"మద్రాస్ చేరాం బాస్! పెద్దమ్మాయి గారు వుత్తరాది వాడూ ఫస్ట్‌క్లాస్ కూపేలో మద్రాసు వరకు ప్రయాణం చేసారని సర్కార్ ఎక్స్‌ప్రెస్ టిటి చెప్పాడు!"

"మంచిది! వాళ్ళ ఆచూకీ తెలిసిందా?"

"హోటళ్ళు లాడ్జీలు గాలిస్తున్నాం బాస్! ఎక్కడకు వెళ్ళినా టైగర్ అతని ముఠా ఎదురౌతున్నారు!"

"ఆ!?"

"అవును బాస్! కింగ్‌కాంగ్ అతని ముఠా కూడా కనపడుతున్నారప్పుడప్పుడూ!"

"నువ్వు సరిగా చూసావా? కింగ్‌కాంగ్ అక్కడ కెందుకొచ్చాడు?"

"ఏమో బాస్!"

"నేను బయల్దేరి వస్తున్నా! నీకు చెప్పిన పని నువ్వు చెయ్యి!"

"అలాగే బాస్!! మేము ఉడిపి హోటల్లో వున్నాం బాస్!"

ఫోన్ పెట్టేసి తల చేతులతో అదుముకుంటూ కూర్చున్నాడు నాగరాజు.

"రాజూ అంకుల్! కాదు సిల్వెస్టర్ స్టాలోన్! అంటూ లోపలకు వచ్చింది



కె. శివరామిరెడ్డి, నందివెలుగు

ప్ర : మీ నవలలో మణిపూస పాఠకుల నిరాదరణకు గురి అయితే?

జ : ఇంకా ఆసమస్య ఎదురవలేదు!

జొన్నలగడ్డ ఏడుకొండలు, నందివెలుగు.

ప్ర . రచయితకు ముఖ్యంగా కావాల్సిందేమి?

జ : తన రచనలను పాఠకులచే చదివింప జేయగల శక్తి – అది వుంటేనే రచనలోని విశేషాలు రక్తికట్టేది.

కందుకూరు ప్రసాద్, కందుకూరు

ప్ర : అయినవారిని చేసుకుంటే మంచిదా? పరాయి వారిని చేసుకుంటేనా?

జ : మీ మనసుకు నచ్చి మీ వారికి తృప్తి కలిగించిన వారిని చేసుకోవడం మంచిది.

పూజారి లక్ష్మి, విజయనగరం

ప్ర : భవిష్యత్తులో నవలలు సినిమా కోసం వ్రాయదల్చుకున్నారా?

జ : లేదు!

కోటగిరి సీత– రేచర్ల, టి. వి. రమణ– పులివెందుల, వెలగ సుబ్రహ్మణ్యం – కోటనందూరు, పద్మశ్రీ ఆర్– ఒంగోలు, ఉపద్రష్ట జగన్నాథ్ – అయినాపురం, కె లలిత – మద్రాస్.

ప్ర : ప్రేమసాగర మథనం చాలా బాగుంది.

జ : మీ అభిమానానికి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను

కె. శ్రీధర్, టింపుల్ ఆల్వాల్

ప్ర : ప్రేమసాగర మథనం కాల్పనికమా వాస్తవికమా?

జ : పూర్తిగా కాల్పనికం! సందేహం ఎందుకు వచ్చింది?

జి. లలితా ప్రియదర్శిని, గాజువాక

ప్ర : సాహిత్యాన్ని అమ్ముకుంటే?

జ : కడుపు నిండుతుంది.

ప్రతాప వెంకటసుబ్బారాయుడు, బాలానగర్

ప్ర : ప్రయోజనాత్మక నవలలకు సామాజిక స్పృహ వున్న రచనలకు తేడా ఏమిటి?

జ : ఏమీ లేదు!

# రచయిత



# జవాబులు

## ఉత్తమ ప్రశ్న

**ఎమ్. ఎన్. అనంతరామన్, బెంగుళూరు**

ప్ర : చదువుండి సంస్కారం లేని వారినీ చదువూ సంస్కారం లేనివారినీ రచయిత లెలా సంస్కరిస్తారు?

**జ : లేని ఉదారుని కంటే వున్న లోభిమేలు! మొదటి తరహా వారిని రచనల ద్వారా ఎప్పటికైనా మెరుగు పరచవచ్చునేమో? రెండో తరగతి వారిని రచయితలు ఎలా మార్చగలరు?!**

ఎం నరసింహారావు, ఏలూరు

ప్ర . పేదవారికి సహాయం చెయ్యండి.

జ : అలాగే!

డి. మనోహర్, రాయగడ

ప్ర : సందీప్ విజయవాడ వచ్చాక తల్లిని వ్యాపారాన్ని మర్చి పోయాడు!?

జ : రెండు రోజులకే?! చివర వరకు నవల చదవండి

వి. రవీంద్రబాబు, గూటి

ప్ర : రచయితలు రాజకీయాలలోనికి రారెందుకు? పెద్ద మొత్తం బాంకులో జమ చేయటానికి బాంకు అవర్సు దాటినాక కూడ ఒప్పుకున్నట్లు రాసారు. ఆవిధంగా బాంకును క్రిటిసైజ్ చేసారు.

జ : రాజకీయాల మీద ఆసక్తి వున్న రచయితలూ వున్నారు! రెండో ప్రశ్నకు సమాధానంగా మరల ఒకసారి నవలా భాగం చదవండి. చురుకుగా పనిచేస్తే గాని యీరోజులలో కాంపిటీషన్ తట్టుకోలేరు బాంకు మేనేజర్లు!

కె ఆంజనేయకుమార్, భోగాపురం

ప్ర : మీరు కొంతకాలం క్రితం స్నేహానంద్ పేరుతో కథలు రాసారు. అవునా?

ఉన్న వాడు ధనబలంతో లేనివాడు కండబలంతో బతుకుతారు– మధ్యతరగతి వాడే మవాలి?

ఏది రాయటం కష్టం. థ్రిల్లర్సా? ఫామిలీ సబ్జెక్టా?

జ : ఆరు వుత్తరాలు రాశావు. వీరాజీగారు పెట్టిన కలంపేరు స్నేహానంద్‌తో కొన్ని నవలలు కథలు రాసాను. మధ్య తరగతి వాడు తనకింది స్థాయి వాళ్ళలో చేరడు– పైస్థాయి వాళ్ళు అతన్ని తమతో చేరనివ్వరు! కుడితిలో ఎలుకలా కొట్టుకుంటాడు. థ్రిల్లర్సు ఫామిలీ సబ్జక్ట్సు దేనికవే కష్టం.

టి. జగన్నాథాచార్యులు, వేములవాడ

ప్ర : సామాజిక స్పృహ అంటే?

జ : సమాజాన్ని పీడిస్తున్న సమస్యలకు ప్రతిస్పందించటం – పరిష్కార మార్గాల్ని సూచించటం.

టి. శశిధర కుమార్, తిరువూరు

ప్ర : సకాలంలో స్ప్రిప్టునందివ్వని రచయిత లంటే నాకు ఎలర్జీ. మీరిలా చేసారా?

జ : ఇంతవరకు అలా ఎప్పుడూ చేయలేదు.

భాస్కరుని వెంకట శ్రీనివాసరావు, నందివెలుగు

ప్ర : కాపీ రచయితల పైమీ అభిప్రాయం?

జ : కుకవులను తిడుతూ మన ప్రముఖ కావ్యాల్లో కొన్ని పద్యాలు రాసేవారు – కుకవి నింద అని. ఈ జబ్బు అనాదిగా వున్నదే! □

---

రాణి.

నాగరాజు మాట్లాడక పోయేసరికి "నువ్విలా దిగులుగా ఎందుకున్నావో నాకు తెలుసు!

డర్టీ క్రీచర్ విలూ అక్కని నువ్వెందుకు పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావో కూడా తెలుసు!"

"పోరాణీ! ఇప్పుడీ హరికథ ఏమిటి?"

"ఇందాకా డాడీ మమ్మీ పెద్దగా తగూలాడు కున్నారు.

"నువ్వు పెద్దమ్మాయిని సరిగా చూస్తే అది ఇంట్లోంచి ఎందుకు వెళ్ళి పోయేది?" అన్నాడు డాడీ.

"పోతే పోయింది! పీడా వదిలింది!" అంది మమ్మీ.

"ఈ మేడా క్లబ్ వున్న స్థలం ఆమెదే! ఇప్పుడు కోట్ల విలువ చేసే ఆస్తి ఆమెది! కోర్టులో దావా వేస్తే నువ్వూ నేనూ ఆస్తి అప్పగించి వూరుకోవాలి" అని అరిచాడు డాడీ! డాడీ మమ్మీ పెద్దగా పోట్లాడుకుంటుంటే నాకు ఏమీ తోచక ఇక్కడికి వచ్చాను.

వస్తే నువ్వు కోటిగాడితో ఫోన్‌లో మాట్లాడుతున్నావు.

ఎక్స్టెన్షన్ ఫోన్‌లో మీ సంభాషణ విన్నాన్లే! నిజం! కావాలంటె కోటి నీతో ఏం మాట్లాడాడో చెప్పనా?!

విలూ అక్క యింత వరకు కోటి మఠాకు కనపడలేదు!"

"కనపడి తీరుతుంది! హోటళ్ళన్నీ గాలిస్తున్నారు" కోపంగా అన్నాడు నాగరాజు.

"అక్క హోటల్‌లో ఎందుకుంటుంది?!"

"మరెక్కడుంటుంది!"

"నాకు తెలుసు గాని నేను చెప్పను!"

"రాణీ! చెప్పమ్మా! మంచి పిల్లవుగదూ!"

"నన్ను నీ వెంట మద్రాస్ తీసుకు వెళితే చెబుతా!"

"రాణీ! ఇందిరక్క అరుస్తుందే?"

"అదంతా నాకు తెలియదు! నన్ను మద్రాస్ తీసుకు వెళితే చెబుతా!"

"సరే చెప్పు!"

"అక్కకు మద్రాస్‌లో షీలా అనే స్నేహితురాలుంది! అక్క సరాసరి షీలా యింటికి వెళ్ళుంటుంది".

**(ఇంకా ఉంది)**

# ఆశ్రయం

## కప్పగంతుల మల్లికార్జునరావు

'నేను విధవగానే వుంటాను. మళ్లీ పెళ్లి చేసుకోను' సరళ ఖరాఖండిగా చెప్పింది.

'అదేమిటమ్మా. నీ యీడు పిల్లలకి యింకా పెళ్లే కాలేదు. నీ కర్మే యిలా కాలింది. పెద్ద హృదయంతో మీ అన్నయ్య పెళ్లి చేస్తానంటుంటి కాదంటావేం?' యిరుగు పొరుగు పెద్దలు నచ్చ చెప్ప పోయారు.

అయినా సరళ లొంగలేదు.

ఏణ్ణర్థం కాపురం చేయకముందే భర్త చనిపోయాడు. ఆ తర్వాత సంవత్సరం తిరగ కుండానే తల్లి తండ్రులు పోయారు. అత్త మామల దగ్గర వుండలేక సరళ అన్న వద్దకు చేరింది.

అన్న వదినలు ఆమెను పని మనిషిలా వుపయో గించుకొన్నారే కాని ప్రేమ సానుభూతులను ఆమెకు యివ్వలేదు.

అలాంటిది వున్నట్టుండి సరళకు రెండో పెళ్లి చేస్తామన్న పాట మొదలు పెట్టేరు. యిరుగు పొరుగు వారికి అది ఆశ్చర్యంగా తోచింది. అన్న పెళ్లి చేస్తానంటే సరళ వద్దనటం మరింత ఆశ్చర్యం!

మొదటి భర్తను ఆమె అంతగా ప్రేమించిందా?

'దాని మొహం. మేనరికమే కదా దానికి చేసేము? చలపతి అంటే దానికసలు యిష్టమే లేదు. మానాన్న దాని మెడలు వంచి పెళ్ళి జరిపించాడు. చలపతితో కాపురం చేసిన నాలుగు రోజులూ అది సుఖమంటే ఏమిటో ఎరుగదు'.

'ఏమైనా ఆమెకు యిష్టం లేదంటుంటే మీ కెందుకంత పట్టుదల? రెండో పెళ్లి అంటే మాత్రం మాటలా?'

'మాకు డబ్బు ముఖ్యం కాదండీ. దాని సుఖం ముఖ్యం. దాని పెళ్లి జరిగి తీరవల్సిందే' అన్న, వదినలు పట్టుబట్టి ఏదో పోరంబోకు సంబంధాన్ని తెచ్చారు.

ముహూర్తాలు నిర్ణయించారు. పెళ్లి వారు వచ్చారు. మేళాలు మోగేయి. మంత్రాలు విన్పిస్తున్నాయి.

'సరళ కన్పించటం లేదు. పెళ్లికూతురు 'పారిపోయింది'.

పారిపోయిన పెళ్లి కూతురు కోసం గాలింపు ప్రారంభ మయింది.

* *

రైలెక్కగానే సరళ బాత్‌రూమ్‌లో కెళ్లి పెళ్లి కూతురు అలంకరణను చెరిపేసుకొని మామూలు సరళగా తయారయింది.

యిప్పుడెక్కడి కెళ్లాలి? ఏం చేయాలి?

తాను వయసులో వున్న విధవ. పారిపోయి వెళ్తోంది. యీ సంగతి ఎవరైనా పసిగడితే పిచ్చి కుక్కల్లా తన వెంట పడరూ?

తనని ప్రేమించి ఆశ్రయం యిచ్చేవారెవరు?

ప్రేమ..... ప్రేమ......

ఆమెకు రమణ మూర్తి గుర్తుకు వచ్చాడు.

'సరళా నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నీలో నాకో గొప్ప కళాకారిణి కన్పిస్తున్నది. భార్య వయ్యాక ఆ కళాకారిణిని తీర్చి దిద్ది పైకి తీసుకొస్తాను.. నీకు అభ్యంతరం లేదుకదా?'

రమణమూర్తి ప్రధానంగా నటుడు. బ్రతుకు తెరువు కోసం ఏదో చిన్న వుద్యోగం కూడా చేసేవాడు.

తను నటి – అతను నటుడు. యిద్దరూ కల్సి నాటకాలు వేస్తారు.

ప్రేమ దృశ్యాలు నటిస్తారు: ఎంత సహజంగా వుంటాయో ఆ దృశ్యాలు?

భవిష్యత్తును తలుచుకొని సరళ ఎంత సంతోషించిందో?

'నాటకాలవాడు. వాడితో నీకు ప్రేమ ఏమిటి? పెళ్లేమిటి? ఇంట్లో మేనరికం పెట్టుకొని వీధిలో పోయే ఏబ్రాసి వెధవ కాళ్లు కడగనా నేను? వీల్లేదు. చలపతి నీ మొగుడు. బ్రహ్మదేముడు ఏనాడో నీ మొహం మీద రాసేడు'.

చలపతి తన మేనమామ. చదువు లేదు. అందంలేదు. మంచిగుణం లేదు. సకల గుణాభిరాముడు.

'నీకు ధైర్యం వుంటే నిన్ను లేవదీసుకొని పోయి పెళ్ళి చేసుకొంటాను సరళా. లేదా ముందే రహస్యంగా పెళ్ళి చేసుకొని లేచిపోదాం. నీకు నా మీద ప్రేమ, విశ్వాసం, వున్నాయా?'

సరళకి ఆ రెండూ వున్నాయి. కాని ధైర్యమే లేకపోయింది.

'సరే అయితే. మనిద్దరి మధ్య ప్రేమ, నాటకంలో సీనులాంటి దనుకొని మర్చిపోదాం. యిక నీదారి నీదే. నాదారి నాదే'.

రమణ మూర్తి అలా వెళ్లి పోయాక సరళ ఎంత దుఃఖించిందో?

కానీ తాళికట్టిన చలపతి చనిపోయి నప్పుడు కంటి వెంట వొక్క కన్నీటి బొట్టుకూడా రాలేదు.

చలపతి తన కేమిచ్చాడని ఏడుపొస్తుంది?

ప్రేమ ఎలాగూ లేదు. కనీసం వివాహ బంధాన్నన్నా గౌరవించాడా?

పెళ్లయినా బజారు తిరుగుళ్లు మానలేదు: ఫలితంగా తనకి ఏవేవో రోగాలు.

చలపతి చనిపోయే వరకు తనిని ప్రేమగానే చూచారు, తాతయ్య, అమ్మమ్మలు. కానీ ఆ తర్వాత కొడుకు చావుకు తనే కారణ మయినట్టు మాట్లాడ సాగారు. ఏక్సిడెంట్‌లో తన తలితండ్రులు పోయాక వాళ్లిద్దరూ అత్త మామలుగా మారి అరడి పెట్ట సాగేరు. అటు కొడుకుని, యిటు కూతురు అల్లుడిని పోగొట్టుకొన్న బాధ వారిది!

వాళ్లని కూడా కాదని అన్నదగ్గరికి చేరిందితాను. ఆతర్వాత కొన్నాళ్లకే ముసలా ళ్లిద్దరూ కళ్లు మూసేరు.

'అమ్మాయీ. ఎక్కడిదాకా వెళుతున్నావు?'

ఆలోచన తెగి ఆ ముసలామె వంక చూచింది సరళ.

'హైదరాబాద్ అండీ'

'ఏమిటి పని? చుట్టాలెవరైనా వున్నారా?'

సరళ దృష్టి అప్పుడు ఎదుటి బల్ల మీద వున్న వో వ్యక్తి చేతి లోని పేపరు పైన పడింది.

రమణమూర్తి, అతని భార్య కల్సి నటించే. నాటకం ప్రకటన అది!

యిద్దరిబొమ్మలు వున్నాయి.

'మా అక్కా బావా వున్నారు. అరుగో ఆ పేపర్లోని బొమ్మల్లో వాళ్లే. వాళ్ల దగ్గరి కెళుతున్నాను'.

'ఏమిటీ? రమణ మూర్తి నీ బావా! అబ్బో చాలా గొప్ప నటుడు. నాకతడి నాటకాలంటే ఎంతో యిష్టం' అంటూ ముసలామె రమణమూర్తి నాటకాలను గురించి చెప్పసాగింది.

వింటున్న సరళ మనసుపై పన్నీరు చల్లి నట్టయింది.

* * *

'యాదమ్మా. బిడ్డ అవసరాన్ని కనిపెట్టి పాలు పట్టు. పండ్లరసం కూడా తీసివుంచాను. వాడికి ఎత్తుడు జాస్తి. ఏడిస్తే ఎత్తుకో. విసుక్కోకు. ఆయన, నేను, యింటి కొచ్చేసరికి అర్ధ రాత్రవుతుంది. మేము వచ్చిందాకా లోపల తలుపు వేసుకొని బిడ్డ దగ్గర పడుకో. ఏం?'

చెప్పిన జాగ్రత్తలే పదిసార్లు చెపోతుంది కస్తూరి. నిద్ర పోతున్న బిడ్డను వదిలి వెళ్ల టానికి ఆమెకు బుద్ధి పుట్టటం లేదు. కాళ్లు కదలమంటున్నాయి.

మనసు కదలనని మొరాయిస్తోంది

యాదమ్మ మాట్లాడ కుండా తల వూపుతోంది.

వాళ్ళు అలాగే ఎదుట తల వూపుతారు. కానీ వాళ్ళకి తన బిడ్డ పైన ప్రేమ ఎందు కుంటుంది? కూలికొచ్చిన వారి దృష్టి కూలి పైనే వుంటుంది.

తన బిడ్డ ఆలనా పాలనా తనే చూచుకోవాలి. కానీ అది సాధ్యమా?

ఆమెకు తల్లి గుర్తుకొచ్చింది. ఆమె బతికి వుంటే తన కెంత అండగా వుండేది? ఎంత సంతోషించేది?

తల్లి బ్రతికి వున్న కాలంలో నాటకాలలో తను ఎక్కి రాలేదు. బ్రతుకుతో కుస్తీ పట్టింది.

అలాంటి తనను రమణమూర్తి సాన పెట్టేడు మహానటిని చేసేడు.

పెళ్ళి చేసుకొన్నాడు తను సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌లో వుద్యోగం సంపాదించుకొన్నాడు. తనకూ సంపాదించాడు.

ఇప్పుడు తమిద్దరి వుద్యోగం నాటకాలు వెయ్యటమే.

బిడ్డను కనటానికి మెటర్నటీ లీవు ఇచ్చారు. ఆ లీవు అయిపోయింది.

ఉద్యోగంలో భాగంగా ఎక్కడెక్కడో తిరిగి నాటకాలు వెయ్యక తప్పదు.

'పోనీ నేను ఉద్యోగం మానేస్తానండీ'

'నిన్ను యింత గొప్ప నటిని చేసింది పిల్లల్ని కనటానికా? బిడ్డను చూడటానికి డబ్బిచ్చి ఆయాను పెట్టుకో. నువ్వు నాటకాలు మానటం నాకిష్టం లేదు నీ లో కళాకారిణిని గృహిణిత్వం చంపకూడదు. ఒక కళాకారిణి మంచి గృహిణి. కూడా కాగలదని నిరూపించాలి నువ్వు'

యిక ఏమనగలదు తను?

'యాదమ్మా. బిడ్డ జాగ్రత్త. యిల్లు జాగ్రత్త.'

'ఏంటండీ. జాగరత్త జాగరత్త అన్ని అన్ని మార్లు చెప్తారు? నేనేం దొంగ నను కొన్నారా? యింత అనుమానం మనుషుల దగ్గర నేను పని సెయ్యలేను. మీ జాగరత్త లేవో మీరే సూసుకోండి. నేను ఎళ్తున్నా'

యాదమ్మ పెద్దగా అరిచి వెళ్ళి పోయింది.

కస్తూరి నీరసంగా నేల మీద కూలబడింది.

* * *

'అమ్మా. రమణమూర్తి గారిల్లు యిదేనా?'

'యిదే. మీరెవరు?'

'మీ పేరు కస్తూరికదూ? నా పేరు సరళ. రమణమూర్తిగారు నాకు బాగా తెల్సు. మీతో మాట్లాడాలని వచ్చాను. కానీ మీరిలా వున్నా రేమిటి?'

'ఏం చెప్పుకో నమ్మా?' అంటూ కస్తూరి తన బాధను చెప్పుకొంది.

'మీరు వెళ్ళండి. నేను బిడ్డను చూచుకొంటాను'

'మీరా!'

'అవును. నా కెవరూ దిక్కు లేరు. మీరు అంగీకరిస్తే నేను మీ దగ్గర వుండి పోవాలని వచ్చాను' అంటూ రమణమూర్తితో తన ప్రేమ కథను పూస గుచ్చినట్టు చెప్పింది.

'పెళ్ళి వద్దని, ఎప్పుడో ప్రేమించిన మా ఆయనను వెతుక్కుంటూ వచ్చావా? నిన్ను యీ యింట్లో వుండనివ్వాలా? ఏ ఆడదైనా చూస్తూ చూస్తూ తన కాపురంలో నిప్పులు పోసుకుంటుందా?'

'నీ కాపురంలో నిప్పులు పోద్దామని రాలేదు చెల్లీ. రమణమూర్తి ప్రేమ తత్వం నాకు బాగా తెల్సు. పెళ్ళి చేసుకొన్న నిన్ను తప్ప ఆయన ఎవరినీ ప్రేమించలేరు. నాకాయన ప్రేమ అక్కర్లేదు.'

'మరేం కావాలి?'

'ఆశ్రయం. పాము పడగ నీడలో వుండటం కన్నా ప్రేమ మూర్తుల పాదాల చెంత వుండటం మేలుకదా?'

సరళ మాటలపై కస్తూరికి విశ్వాసం కలిగింది.

తన భర్తకు తను ప్రేమ నివ్వగలిగినంత కాలం, పరాయి స్త్రీ తన కాపురాన్నేం చేయగలదు? రమణమూర్తి నాటక లోలుడు కాని స్త్రీ లోలుడు కాదు.

సరళ యింట్లో వుంటే బిడ్డ విషయంలో తను నిశ్చింతగా వుండవచ్చు.

'సరే అక్కా. ఆయనతో నేను మాట్లాడతాను. నువ్వు మాయింట్లో వుండవచ్చు'. సరళకు బిడ్డ నందిస్తూ అంది కస్తూరి

* * *

పాత పేపర్లో అడ్వర్ టైజ్ మెంట్ కళ్ళపడగానే సరళ అన్న బుర్రలో ఫ్లేష్ మెరిసింది.

'సరళదగ్గరికి తీసుకు పోతాను వెంటనే బయలు దేరండి'

సరళను పట్టుకో టానికి వాళ్ళు చేయని ప్రయత్నం లేదు. పోలీసు రిపోర్టులు, పత్రికల్లో. రేడియోలలో ప్రకటనలు... .

అంతా రమణమూర్తి యింటికి చేరుకొనే సరికి చీకటి పడుతోంది.



# ఈ వేమన పద్యాలు




విటుల కనులకెంతొ విభ్రమమైయుండు
సాటిలేని పొలతి చక్కదనము
కంటిలోని పాప కుంటెనకాడయా★
విశ్వదాభిరామ వినుర వేమ

★ తార్పువాడు

## ఆశ్రయం

సరిగ్గా అప్పుడే మరో వైపు నుంచి, రమణమూర్తి, కస్తూరిలు ఆటో దిగేరు.

'ఎవరు కావాలండీ?'

'రమణమూర్తి గారు మీరేకదూ?'

'అయితే?'

'మా సరళ పెళ్లి పీటల మీది నుంచి పారిపోయింది. మీ దగ్గర వున్నట్లు తెల్సివచ్చాము'

ఎప్పుడో వో రోజు యీ సీను వస్తుందని రమణమూర్తి మొదట్లోనే వూహించాడు.

'లోపలికి రండి' అంతా లోపలికెళ్ళారు.

సరళను పిల్చుకొచ్చింది కస్తూరి.

'పెళ్లి చేస్తామంటే చేదయిందిటే నీకు! పారిపోయి ప్రియుడి దగ్గరి కొచ్చావా? లోకానికి యీ విషయం తెలిస్తే ఎంత పరువు తక్కువ? పదపద వెళ్దాం'.

'నేను రాను. యిక్కడే వుంటాను.'

'ఎంత తెగించావే?'

'ఒకసారి నా జీవితానికి వురి వేసేరు. చాలదూ? మీ పరువు ప్రతిష్ఠ లేమిటో నాకు తెల్సు. మీ బుద్ధు లేమిటో నాకు తెల్సు. పెళ్ళికి వైధవ్యం వుంది. కానీ ప్రేమకు లేదు. మర్యాదగా వెళ్ళండి'.

'మేం గాజులు తొడుక్కోని వున్నామను కొంటున్నావా? ఎలా రావో చూస్తాను. పద' అంటూ సరళ అన్న దండ ప్రయోగాన్ని వుపయోగించాడు. వీధిలో వారిని పోగు చేసేడు.

'సరళేం చిన్న పిల్లకాదు. మేజర్. బలప్రయోగాల ద్వారా చేసిన పెళ్లిళ్ళు నిలుస్తాయా? మా యింట్లో అమెకు ఆశ్రయం యిచ్చాము. అమె వస్తే తీసుకు వెళ్ళండి. దౌర్జన్యానికి దిగితే మాత్రం వూరుకొనేది లేదు' రమణమూర్తి వారిని మందలించాడు.

సరళ అన్నయ్య తారా జువ్వలా లేచాడు. కస్తూరి పైన బాణాన్ని సంధించాడు.

'ఆడదానివి. నీ భర్త మాజీ ప్రియురాలిని యింట్లో పెట్టుకోటానికి నీకు మనసెలా వొప్పిందమ్మా? సరళ పైన నీకంత ప్రేమ వుంటే, నీ భర్తకిచ్చి పెళ్లి చేయి. నీ సవతిగా యింట్లో అట్టే పెట్టుకో. కానీ యిలా..... అవ్వ.....!'

కస్తూరి మొహం కత్తి వేటు పడ్డట్లయింది.

సరళ కోపం పట్టలేక పోయింది.

'అన్నయ్యా. నీ నాటకాలింక అపు. నాకు పెళ్లి చేయాలని నువ్వు ఎందుకంత పట్టు పడుతున్నావో నాకు తెలీదనుకొన్నావా?'

'ఎందుకు? చెప్పమ్మా' జనంలో ఎవరో అడిగారు.

'నేను పెళ్లి చేసుకొంటే నా అత్త మామల ఆస్తి నాకు చెందదు. ఆ ఆస్తంతా అప్పుడు మా అన్నయ్యకు చెందుతుంది. అలాగని వాళ్ళు చచ్చిపోతూ విల్లు రాసి పోయారు. మా అన్నయ్య ప్రేమ నా మీద కాదు. నా ఆస్తి మీద'.

సరళ అన్నయ్య, వదిన మొహాలు వెల్ల వెలిసి పోయిన గోడలయ్యాయి.

'ప్రేమ, అవతలి వారి సుఖశాంతుల్ని కోరుతుంది. ఆ చింతన మీకులేదు. ప్రేమానుభవాలను నేను కోరుకోను. కానీ ప్రేమ నిండిన యీ వాతావరణాన్ని వదులుకోను'

'మరి నీ ఆస్తంతా ఏం చేస్తావ్?' వదిన అడిగింది.

'స్వార్థ తత్వం కాక మనుషుల్లో ప్రేమ తత్వం పెరగటానికి ఖర్చు చేస్తాను. నాలాంటి అభాగినులకు ఆశ్రయం కల్పించటానికి వెచ్చిస్తాను. సరేనా? యిక వెళ్ళండి– మర్యాదగా'

సరళ లోపలికి వెళ్లి తలుపు బిగించుకొంది. □

# పంటినొప్పి వచ్చిందంటే గుర్తొచ్చేది భగవంతుడు, లేదంటే లవంగ నూనె.

---

సందేహం లేదు. పంటి నొప్పి తగ్గించడంలో తరతరాలుగా ఇంటింటా లవంగ నూనె ప్రధాన పాత్ర వహిస్తూనే ఉంది. లవంగం నిజంగా ఒక గొప్ప దినుసు. దీనిలో ఔషధ గుణాలే కాదు, ఆరోగ్యాన్ని చురుగ్గా ఉంచే ఆ తాజాదనాన్నిచ్చే సద్గుణం కూడా ఉంది. ఇందుచేత నిత్య జీవితంలో దీనికెంతో ఆదరణ ఉంది. పాక శాస్త్రంలోనేమి, ఔషధ శాస్త్రంలోనేమి, ఆఖరుకు ప్రామిస్ టూత్‌పేస్టులో కూడా దీని సద్గుణాల వినియోగం జరుగుతూనే ఉంది.

ప్రామిస్ టూత్‌పేస్టు ద్వారా లవంగ నూనెలోని ఔషధ గుణం, మీ పళ్లలో మూల మూలలా చేరి, మీ పళ్ల మొదళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులతో పోరాడుతుంది. తత్ఫలితంగా మీ పళ్లు సదా ఆరోగ్యవంతంగానూ, దృఢంగానూ ఉంటాయి. ఇంకా ప్రామిస్‌లోని ఇతర దినుసులు, మీ పళ్లను మంచి ముత్యాల్లా మెరిసిపోయేలా చేస్తాయి. ప్రామిస్‌తో పళ్లు తోముకున్న తర్వాత మీ పలుకులు సువాసనలు వెదజల్లుతాయి. ఎందుకంటే, నోటి దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూడా ఈ లవంగ నూనె కూల్చి వేస్తుంది, మీ శ్వాసలో తాజాదనం నింపి తెస్తుంది.

ప్రామిస్ టూత్‌పేస్టు, లవంగ నూనె...టూత్‌పేస్టుల ప్రపంచంలో ఇది నిజంగా ఒక అద్భుత మిశ్రమం. దీన్ని మీరు క్రమం తప్పకుండా వాడితే బహుశ: మీకు లవంగ నూనె గుర్తు రాకపోవచ్చు, మీకు దాని అవసరమూ కలగకపోవచ్చు. మీ పళ్లు మెరిసిపోతుంటాయి, మీ శ్వాస సువాసనా భరితంగా ఉంటుంది.






లవంగ నూనెతో అద్భుత సృష్టి - ప్రామిస్ టూత్‌పేస్టు

బల్సారా— టూత్ పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA - B BLS 820 TEL

సీరియల్

(గత సంచిక తరువాయి)

చెరువు గట్టుమీద కూర్చుని భూత భవిష్యత్ వర్తమానాల్లోకి దృష్టిసారిస్తూ, పడమటి కొండల్లోకి కృంగిపోతున్న రవిబింబాన్ని చూస్తున్నాడు సంగమయ్య–

సూర్యుడస్తమిస్తాడు– అంధకారం అలుముకుంటుంది– ఆ అంధకార అయోమయంలోంచే మళ్లీ సూర్యుడు పుట్టుకొస్తాడు– కొత్త వుదయంలో కాన్ని వెలుగుమయం చేస్తుంది–

ఇదీ కాలచక్రగతి!

గడచిన రోజుల్ని తల్చుకుంటే ఆశ్చర్యమేస్తుంది– ఎంత అమాయకంగా బ్రతికేరు తమతరంవాళ్లు?

తరం మారింది– తెలివితేటలూ ఎక్కువయ్యాయి–

ఈ పగ, ద్వేషం, కార్పణ్యాలూ, స్త్రీలపై యీ అత్యాచారాలూ తాము ఎరుగునా? అన్యాయాన్ని సహిస్తూ గొరెల్లా బతికేశారు– తమలో దేవుడొక్కడే తమకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించేవాడు– చివరికి అతను కూడా అన్యాయంగా చంపబడ్డాడు–

మారినతరంలో కాస్త మార్పొచ్చినా దేవుడి రక్తాన్ని పంచుకు పుట్టిన దేవుడు కొడుకు సత్యమే మళ్లీ కొత్తతరం వారికి నాయకుడయ్యేడు– రైతు సమస్యల్ని పరిష్కరించేందుకు కంకణం కట్టుకుని ప్రభుత్వం ముందు కెళ్ళడానికి సిద్ధమయ్యాడు–

**జరిగిన కథ –8 :** సత్యం తండ్రి గుణాలనే పుణికి పుచ్చుకుని ఊళ్ళో వాళ్ళ తలలో నాలుకలా ఉంటాడు. పంచదార కార్మల విషయంలో ఫీల్డ్‌మెన్ అన్యాయాన్ని ప్రతిఘటించి గ్రామస్తులకు న్యాయం చేస్తాడు. బుచ్చి శెట్టి బావమరది ప్రతాప్ పద్మకు చేసిన అన్యాయాన్ని ప్రజల ముందు పెట్టి బుచ్చిశెట్టిని నిలదీస్తాడు. గ్రామ ఎన్నికల్లో ప్రతాప్ నిలబడుతున్నాడని తెలిసి పోటీగా మాధవయ్యను నిలబెట్టించి, గెలిపించడంలో ప్రధాన పాత్ర వహిస్తాడు. రైతుల సమస్యల పరిష్కారం కోసం జిల్లాలో రూపొందుతున్న ఉద్యమంలో భాగం పంచుకుంటాడు. సత్యం భార్య మీద అత్యాచారం జరపడానికి ప్రయత్నం జరుగుతుంది.

అటువంటి సత్యం భార్యపై అత్యాచారం జరగబోయింది. దీనికి కారణం ఏమిటి?

తమలోని పిరికితనమా? తిరగబడలేని చాతగానితనమా?

అదే అయితే తమ ప్రవర్తనల్లోనూ, స్వభావాల్లోనూ మార్పు వచ్చితీరాలి–

స్వతంత్రదేశంలో మనిషి స్వతంత్రంగా బతగ్గలగాలి– జీవంపోయినా తమవంటివారు ఉడుకు నెత్తురున్న యువకులకు ధైర్యసాహసాల్ని నూరిపొయ్యాలి–

లేచి నిలుచున్నాడు సంగమయ్య–

చుట్టూ చీకటి తెరలు– ఆకాశం మీద స్వేచ్ఛగా ఎగిరే పక్షులు.

అడుగులు ముందుకువేశాడు సంగమయ్య. అతని ఆలోచనల్లోనూ, నడకలోనూ ఏదో పట్టుదల!

★ ★ ★ ★ ★ ★

ఆకాశంలో మబ్బులు ముసురుకుంటున్నాయి. నల్లమబ్బులు ఒకదానితో ఒకటి కల్సుకుంటూ పెద్దవౌతున్నాయి–

నెమ్మదిగా వెలుగుతగ్గి చీకటి ఆవరిస్తోంది నలుదెశలా–

తూర్పుగాలి ర్మానాను పుంజుకుంటోంది. దానికి దక్షిణపుగాలి కూడ తోడవుతోంది!

గుడిసెలో చీకట్లు ముసురుకుంటున్నాయి.

నులక మంచం మీద పడుకుని నిస్సహాయంగా బయటకు చూస్తోంది సత్యం భార్య సోములమ్మ– శరీరంలోని బాధ, మనసులోని ఆవేదన; బయట ప్రకృతీ ఒక్కలాగే అన్పించాయామెకు.

రెండు రోజుల్నించి ఆకాశం మబ్బులు కమ్ముకునే వుంది– అప్పుడప్పుడూ అక్కడక్కడా చిన్నగా చినుకులు పడుతున్నాయి– ఇలా చిలికి చిలికి యే గాలివానో అవదుగదా! అనుకుని భయపడింది–

ఆమె మనసు పరి పరి విధాల పోతూంది–

రైతు ఉద్యమంలో జేరి నాయకుడైన దగ్గర్నించీ సత్యానికి తీరికే వుండకుండా పోయింది.

వ్యవసాయపు పనులతో బాటు రైతాంగపు సమస్యల్ని పరిష్కరించడం, ఊరి ప్రయాణాలూ– వీటితో యింటిని గూర్చి ఆలోచించేందుకే సమయ

ముండటంలేదు. కొన్ని సమస్యల్ని పరిష్కరించడంలో వూరి పెద్దలకు చెడ్డయిపోయాడు గూడ. బుచ్చిశెట్టి అందరికీ యిచ్చినట్టు సత్యానికి అప్పుగూడ యివ్వడం మానేశాడు- అంచేత పంటకోసం ఎక్కడెక్కడో ఎక్కువ వడ్డీలకు అప్పులు చెయ్యాల్సివస్తోంది-

ఇంటి ఆర్థిక పరిస్థితి కూడ కుంటుబడి పోయింది

తమ రెండు ప్రాణాలకే యిలా కటకటలాడే పరిస్థితి ఎదురౌతూంటే రేపు యీ మూడో ప్రాణికూడా వస్తే ఎలా వుంటుందో!

బాధతో గిలగిల లాడింది సోములమ్మ. తొలిచూలు- తనకు కష్టంగానే వుంటోంది.

మధ్యాహ్నం నించే నెప్పులు ప్రారంభమయ్యాయి- నెప్పులు రావడం, ప్రాణాల్ని పిండేసినట్టు చేయడం- మళ్లీ తగ్గిపోడం. ఊళ్లో ఆస్పత్రిలేదు- ప్రమాదిస్తే పదిమైళ్ళ అవతల పట్నం పోవాల్సిందే! ఎందుకో తన మనసు కీడును శంకిస్తోంది-

"మరేం ఫర్వాలేదు- సుఖంగానే పురుడయిపోతుంది- ఈ నెప్పులూ యీ బాధా బిడ్డను కనే ప్రతి ఆడదానికీ వుండేవే- నేనున్నానుగా. నీకేం భయంలేదు' అంది మంత్రసాని. అడ డాక్టరులేని ఆ వూళ్లో యీ పురుళ్లొస్తే ఆమేగతి.

గాలి విసురు ముదిరింది- వానకూడా జోరుగానే మొదలయ్యింది.

ఊరెళ్ళిన సత్యం నేడో రేపో రావాలి! అంత వరకూ యింక ఆమెకు మంచినీళ్ళందించే దిక్కులేదు.

వెళ్లేటప్పుడు భార్యను చూస్తూండమని చుట్టు ప్రక్క వాళ్ళతో చెప్పి వెళ్లేడు సత్యం. బోగేమూ, సంగమయ్యవచ్చి పరిస్థితి కనుక్కుంటూ నాలుగు మాటలు చెప్పి వెళుతున్నారు-

డొక్కలో ఒక్కమారు పేగులు మెలితిప్పినట్లయి ఒక్క గావుకేక పెట్టింది సోములమ్మ.

చుట్టు పక్కల పాకల్లోని ఒకరిద్దరు ఆడవాళ్లు పరుగెత్తుకొచ్చారు- వాళ్ళకి తోచిన ఉపచారాలు చేశారు-

పరిస్థితి విషమించిందని తెలిశాక మంత్రసాని దగ్గరకు పరుగెత్తేడు బోగేము

ప్రకృతి భీకర రూపం దాల్చింది- ఆ కారు చీకటిలో ఆకాశంలో ఉరుములూ, మెరుపులూ- హోరున వర్షం! పెద్ద పెట్టున పెనుగాలి.

చెట్లు కూలిపోతున్నాయన్నారు పాకలు ఎగిరిపోతున్నాయన్నారు-

కలకలం మొదలయింది- పెద్ద పెట్టున కేకలూ అరుపులూ మొదలయ్యాయా వాడలో -

పశువుల్ని ఒకదగ్గరకు చేర్చి పాక ఎగిరిపోకుండా కట్టు దిట్టం చేసేడు సంగమయ్య. సత్యం వచ్చేస్తే బాగుండును అన్పించిందతనికి ఆ క్షణాన.

సత్యం యింటి అరుగుమీద ముళ్లమీద కూర్చున్నట్లు కూర్చున్నాడతడు- లోపల నిస్సహాయ స్థితిలో ఒక ఆడకూతురి బాధ- బయట ప్రకృతి చేసిన వికటాట్టహాసానికి ప్రజలగోల.

రాత్రి ఎనిమిది దాటుతూంటే మంత్రసానిని తీసుకొచ్చాడు బోగేము.

ఏవేవో మందులూ, యింజక్షన్లూ యిచ్చిందామె. రాత్రి చాలాసేపటివరకూ అరుపులతో కేకలతో నరకయాతనే అనుభవించింది సోములమ్మ. అక్కడ జేరిన ఆడవాళ్లెవరికీ నిద్దర్లులేవు.

సంగమయ్య మాత్రం ఎదురింటి చూరులో నులక మంచం మీద నడుంవాల్చేడు- అతని కంటిమీదా కునుకులేదు- మనసులో గూడు కట్టుకున్న భయం పోనూలేదు- పావు గంటకొమారు ఎవరెవర్నో పిలుస్తున్నాడు- ఏవేవో మాట్లాడుతున్నాడు.

అర్ధరాత్రి దాటింది-

గాలీ వర్షం తగ్గుముఖం పట్టేయి.



# తీపిగురుతు

గుడిశలోంచి ఒక్కసారి 'కేర్‌కేర్' మంటూ శిశువు రోదన విన్పించింది–

అందరి ముఖాల్లోనూ ఆనందం వెల్లి విరిసింది.

'మగపిల్లాడే. తల్లీ బిడ్డా క్షేమమే' అని మంత్రసాని నోటవినేదాకా సంగమయ్యలోని భయం పోలేదు.

అతని మనసు శాంతించింది–

ఎప్పుడు పట్టిందో కాసింత కునుకూ- ఎవరోవచ్చి కుదిపి లేపితే చటుక్కున మేల్కొన్నాడు– చుట్టూ చీకట్లు–

"ఏం జరిగిందయ్యా" అడిగేడు ఎదురుగావున్న జనాన్ని చూసి.

'ఏం జరగాలి? జరగక్కూడందే జరిగిపోయింది"·అంటూ విషయాన్ని అతని ముందుంచాడు వీరయ్య.

ఒక్కక్షణం కొయ్యబారి పోయేడు సంగమయ్య. రాత్రినుండే మనసులో ఏమూలో ఏదో కీడు జరుగనున్నదన్న భయం వుండనే వుంది–

చివరికి జరిగిందిదా?

అనుకోకుండా అతని కళ్లలో నీళ్లు తిరిగాయి.

"చెరువు గట్టునుండి నేనొస్తూ చూశానయ్యా అడ్డురోడ్డు దగ్గర నీళ్లు బాగా వుండిపోయాయి– కాసింత దూరంలో నడక దారిమీద పడున్నట్టువుంటే వెళ్లి చూతునుగదా... మొదట ఆ చీకట్లో గుర్తుపట్టలేకపోయాను– మాధవయ్యగారి దగ్గర్నుంచి టార్చిలైటు తీసుకెళ్లి చూస్తే ఇంకేముంది?

అతగాడు మనసత్యమే! తల వెనుక పెద్ద గాయమైంది– రక్తం ఆరిపోయి గడ్డకట్టుకుపోయివుంది–

ఎవరో పగబట్టి ఏ రాత్రో చంపేశారు." సంగమయ్యకు నవనాడులూ కుంగిపోయినట్లయింది–

చంపిందెవరైతేనేం? వాళ్లు హత్య చేసింది సత్యమనే మనిషిని మాత్రంకాదు– ఒక దేవుణ్ణి, 'సత్యాన్ని', నిజాన్ని! అహింసాతత్వాన్ని! స్నేహాన్ని!– అన్పించింది సంగమయ్యకు.

"ఈ వూరికేదో దాపరించింది– మంచి మనుషుల స్థానే దెయ్యాలూ, రాక్షసులూ వచ్చి పడుతున్నాయి.– వాటికి కావల్సింది తిండి మనుషులూ, వాళ్ళ మానాలూ" అన్నారెవరో–

"అందుకే భయపడ్డాం. లేకుంటే యీ సరికి వూళ్లోకి శవాన్ని తెచ్చేవాళ్లమే' అన్నాడు రంగయ్య.

ఆ మాటకు దిగ్గున లేచాడు సంగమయ్య. అతని బక్క శరీరంలో వెయ్యి ఏనుగుల బలం ఒక్కసారి జొరబడింది–

"ఎవడేం చేస్తాడో రమ్మనండిరా– దొంగచాటున మనుషుల్ని చంపే చవటనాయాళ్ళను నాకెదురు రమ్మను– రండిరా" అంటూ ఆవేశంగా అడుగు ముందుకేశాడు–




. అతనిలోని ఆ ఆవేశం చూడగానే చుట్టూ వున్న యువకుల్లోని రక్తం వుప్పొంగింది–

'రండర్రా' అన్నారంతా అటువైపు కదులుతూ–

మరో అరగంటలో సత్యం శవం సత్యం యింటి ముందుకు తేబడింది–

కాస్సేపు అతని కాళ్ళ దగ్గర కూర్చుని కళ్ళ నీళ్లు పెట్టుకున్నాడు సంగమయ్య. ఆ తర్వాత లేచి కళ్లు తుడుచుకున్నాడు. తుడుచుకుని ఎదురుగా వున్న జనంతో బొంగురుబోయిన గొంతుతో యిలా అన్నాడు.

"ఓ రయ్యల్లారా సచ్చిపోయింది మన సత్తెంగాదర్రా– దర్మం సచ్చిపోయింది– నాయం సచ్చిపోయింది. నిజం సచ్చిపోయింది– కాదు.... కాదు....! ఆ కిరాతకులు పొట్టనెట్టుకున్నార్రా. ఏళ్ల తరబడి నోళ్లు మెదపని మందర్రా మనది– మనకి జరిగే అన్యాయాన్ని ఎదిరిద్దామనేనా వూహలేనోళ్లం మనం. మన మద్దెలోకి బగవంతుళ్లా ఆ దేవుడు పుట్టేడు– మనకోసం ఆహుతైపోయేడు– ఆ దేవుడు కొడుకేయీ సత్తెం– తండ్రిలాగే మనూరి రైతుల కోసం ప్రాణాలిచ్చేసేడు–

ఎంతమంది మన మద్దెకొచ్చి మార్చాలన్నా మనం మారంరా– మనకంటే గొర్రెలు నయమర్రా– మనకంటె బండలు నయమర్రా–" సంగమయ్య కళ్లు వర్షించడం మొదలుపెట్టాయి. అతని గొంతులోని ఆ జీర; అతని గుండెల్లోని ఆ బాధ అక్కడి జనాల్ని అచ్చెరువొందేలా చేశాయి.

అప్పటికి వెలుగు పూర్తిగా వచ్చేసింది– ఒక్క క్షణం మౌనం వహించి కన్నీళ్ళను తుడుచుకున్నాడు సంగమయ్య. ఆ తర్వాత చటుక్కున సత్యం గుడిసెలోకి పరుగెత్తేడు. అపస్మారకస్థితిలో పడుకున్న సోములమ్మ పక్కలోంచి పసి బిడ్డను బయటకు తీసుకొచ్చేడు–

ఆ ఉదయపు వెలుగులో ఆ పసివాడిని వింతగా చూసేరంతా–

సంగమయ్య ముఖంలో ఆనందం, దుఃఖం ఒక్కమారు పొంగుకొచ్చాయి–

"ఒరేయ్ నాయనలారా. మనమంతా చెరకు పండించే రైతులంరా. పంట పండి కళ్ళకీ మనసుకీ సంతోషం కలిగినప్పుడు మొదటిగడ విరుచుకుని పొలంగట్టుమీద కూర్చుని ఏం తింటామో అంతే! ఆ తీపే యేటి పొడుగునా మనలో వుండిపోతుంది– అది తప్ప మన బతుకుల్లో అంతా చేదుమయమే– మన చెరుకునించొచ్చిన బెల్లంగాని, పంచదారగాని ఆ తర్వాత మనకళ్ల కగపడదు–

జనానికి తీపిని పంచి మనం చేదును దిగమింగుతున్నాం– ఏం అని అడిగినవాళ్లు లేరు– సరిగదా మన మంచి నాలోచించే వాళ్ళని మననించి దూరం చేస్తున్నారు–

నాకు తెల్సు– యీ రోజు లింకెన్నాళ్లో వుండవు. పంటలకి పట్టిన చీడను, తెగుళ్ళను పోగొట్టడం మనకు బాగా తెల్సు– చీడ తీపిని తినేస్తుంది– మొత్తం పంటనే మాయం చేస్తుంది చూస్తూ వూరుకుంటే– మన జీవితాల్నే హరించేస్తుంది– అందుకే మనం చూస్తూ వూర్కోకూడదు– అటువంటి తెగుళ్ళను కూకటి వేళ్ళతో నే చంపేయాలి–

మాతరం ఎనకబడిపోయింది– ఈ తరం వోళ్లు మీరంతా– మీలో పట్టుదల పెరగాలి. మీ తరంవోడే సత్యం.

–నిజానికి సత్యం చచ్చిపోయినా మనకి మార్గం చూపేడు. మన కళ్లు తెరిపించేడు.

వెదురు బొంగుల్లాంటి మన రైతుల కుటుంబంలో సత్యం ఒక బంగారు తీగ చెరుకురా! అతగాడి "తీపి గురుతే" యీ పసిబిడ్డడు– ఈడే రేపటి నాయకుడౌతాడు. ఆ పిడికిలి చూడండి అందులో ఎంత పట్టుదలో" అంటూ ఆ పసిబిడ్డ చేతిని పైకెత్తేడు సంగమయ్య.

ఆ పసివాడివైపే చూశారందరూ– చీకట్లలోంచి, మబ్బులు తొలగుతున్న తూరుపు ఆకాశం మించి లేలేత వెలుగు కిరణాలతో వుదయిస్తున్నాడు సూరీడు–

ఆ తొలి వుషస్సులో అక్కడ జేరిన అందరి మనస్సుల్లోనూ ఒకే నిర్ణయం.

ఆ నిర్ణయం వారి జీవితాల్లో తొలిసారిగా ప్రవేశించిన ఉషోదయం!

(అయిపోయింది)

## అందం కోసం ఒక కొత్త శీర్షిక

"ఆంధ్రపత్రిక" వారి మహిళల పత్రిక

# కలువబాల లో




**అందం ఆరోగ్యం రెండూ మీ యింట్లో మీరు ఖర్చు లేకుండా పొందాలంటే.... ఈ శీర్షిక కోసం "కలువబాల" వెంటనే కొని- చూడండి- మిగతా శీర్షికలు కూడా మీరు యిష్టపడతారు.**

పై చిత్రంలో ఎవరో పోల్చారా? ఔను! ఆమె ప్రఖ్యాత కూచిపూడి శోభా"రాణి" శోభానాయుడే కాని ఈ భంగిమ నాట్య భంగిమ కాదు! అదీ "త్రికోణాసనం."

మీరే అందం కోసం- లేక ఆరోగ్యం కోసం ఏయే ఆసనాలు ఎలా వేయాలో చెప్పే సచిత్ర వ్యాసావళి "కలువబాల"లో ఆగస్టు 1–15 సంచిక నుంచీ ప్రారంభిస్తున్నాం! మీ కాపీకై ముందుగా ఆంధ్రపత్రిక ఏజెంట్‌ని కాని, మీ పుస్తక విక్రేతకి కాని చెప్పి తెప్పించుకోండి.

మహిళల సమగ్ర సచిత్ర పత్రిక "కలువబాల"–

# తుప్పు ధ్వంసం చేస్తుంది

త్రీ-ఇన్-వన్ బ్రాండ్ ఆయిల్ తుప్పును నిరోధించడానికై తప్పనిసరిగా వాడవలసిన నూనె. ఉత్తమ నాణ్యత గల నూనెలు కలిపి ప్రత్యేకించి తయారు చేయబడిన ఈ నూనె కందెన నూనెగా పనిచేస్తుంది, యంత్ర భాగాలను శుభ్రం చేసి కాపాడుతుంది.




# త్రీ-ఇన్-వన్

బ్రాండ్ ఆయిల్

## తుప్పు నిరోధించడానికి తప్పనిసరి

*జెఫ్రీ మేనర్స్ అండ్ కం. లి. వారి ట్రేడ్‌మార్కు. వాడకానికి లైసెన్సుదారు.

OBM/8189-TEL

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## సమాజంలో మార్పులు రావాలి

"ఆ నోట్సు తనదేనని, తనకి 'చిరంజీవి' అంటే అభిమానంచే ఆ బొమ్మ ఉన్న నోట్సుని మాలిని, తను వెళ్ళి నిన్ననే కొన్నామని, మాలిని తన నోట్సుని తీసుకుని పొరపాటున తన పేరు రాసుకుందని, మరల దానిని కొట్టేసి తన పేరు రాసిందని. ఆ రోజే క్లాసుకి టైంటేబుల్ రావడం వలన ఆ నోట్సు చివరి పేజీలో రాసుకుని దానిని చించి ఇంటి కెళ్ళి అంటించానని, ఆ నోట్సు తనదేనని. 'లత'ది కాదని, మాలినిని మీరు కొడతారని భయపడి అబద్ధం చెప్పిందని, తను చెప్పేదంతా నిజమేన"ని చెప్పినా వినకుండా మూర్ఖంగా తనని ఇష్టం వచ్చినట్లు కొడుతున్న టీచర్'ని 'కొట్టవద్ద'ని వెక్కుతూ ప్రార్థించింది సుధ. ఆ పసిదాని దీన పలుకులు ఆమె రాతి గుండెను కరిగించలేకపోయాయి. నిన్నటి వరకు సుధని కాఫీ, పళ్ళు వంటి వాటిని తెప్పించుకోవడానికి హోటళ్ళకి, బజారుకి పంపించేవారు. కాని, నేడు ఆ టీచర్లు మౌనంగా ఉండిపోయారు. 'వెళ్ళి మీ నాన్నని పిలుచుకురా, లేకపోతే టి. సి. ఇచ్చేస్తా'న'ని బెదిరిస్తూ చెప్పిన టీచర్ మాటలు విని స్కూల్'ని విడిచింది.

వీపు మీద, చేతుల మీద తేలిన దెబ్బలను చూసుకుని సుధ ఏడుస్తుంది. తన ప్రాణ స్నేహితురాలు కూడా దెబ్బలకు భయపడి అబద్ధం చెప్పడంతో ఆ పసి హృదయం తల్లడిల్లింది. ఇంటికి వెళ్ళి ఈ సంగతి నాన్నతో చెబితే నాన్న తనని చావగొడతాడని సుధకి ముందే తెలుసు. ఇంటికి వెళ్ళలేదు. ఏడుస్తూ వెళుతున్న సుధని ఎవరూ పట్టించుకోలేదు. అప్రయత్నంగా ఆమె కాళ్ళు 'రైల్వే స్టేషన్' వైపు దారి తీసాయి. అప్పుడే బయలుదేరబోతున్న 'సర్కార్ ఎక్స్‌ప్రెస్'ని ఎక్కి మద్రాస్ చేరుకుంది సుధ. ఎవరో కానిస్టేబుల్ అడుగుతున్న ప్రశ్నలు ఆమెకి అర్థం కాలేదు. "తనిక ఇంటికి వెళ్ళనని. ఇక్కడే ఉంటానని" చెప్పుతూ ఏడుస్తున్న సుధని అనాథ 'శరణాల'యంలో చేర్పించారు. అతి చిన్నవయస్సులోనే తల్లిదండ్రులకు దూరమై, వారి ప్రేమాభిమానాలకు దూరమైన ఆ పసి హృదయం ఎంతో నరకయాతనను అనుభవిస్తుంది.

దీనికి కారణం ఈ సమాజం. ఎవరైనా పసిపిల్లల పట్ల దయతో, ప్రేమతో ప్రవర్తించాలి. తల్లిదండ్రులు తమ పిల్లలకు పసితనం నుంచి క్రమశిక్షణ పేరుతో క్రూరంగా ప్రవర్తించకుండా ఉండి తమంటే భయాన్ని కలిగించకూడదు. అలాగే నిజానిజాలు తెలుసుకోకుండా పసిపాపల భావి హృదయాలతో చెలగాట మాడకుండా ఉండాలి. తల్లిదండ్రులైనా, ఉపాధ్యాయులైనా పసి పాపలతో స్నేహంగా మసలుకుని, వారి మానసిక పరిస్థితిని అర్థం చేసుకుంటే ఈ "చిన్నారి బాలల దీనగాథలు" ఇక ఉండవు కదా!

—కొటికలపూడి లక్ష్మి,
సత్తెనపల్లి



* * *

## అనాథ శిశువులను ఆదుకోవాలి!

అనాథ పిల్లలు, కష్టపడి పొట్ట పోసుకొనే పిల్లలు మనకు ఎక్కువగా



కన్పిస్తుంటారు. ఇలాంటి వారు మనదేశములోనే ఎక్కువ కన్పించడానికి కారణము ఏమిటి? మనదేశములో కూలీనాలీ చేసుకొనే వారు ఎక్కువ. వాళ్ళు లెక్క లేకుండా పిల్లల్ని కనేయడము, వాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పించకుండా ఏదో ఒక పనిలో పెట్టడము చేస్తుంటారు. ఆ పిల్లలు నల్గురిలో నవ్వుతూ, తుళ్ళుతూ ముద్దుగా బొద్దుగా పెరగాల్సిన పిల్లలు పది, పన్నెండేళ్ళకే, ఉదయము నుంచి రాత్రి దాకా పని చేసి ముక్కు పోగులా తయారయి, తాము కష్టపడి సంపాదించిన రెండు, మూడు రూపాయలు తల్లితండ్రులకు ఇస్తుంటారు. "చిన్నపిల్లల మనసు అద్దం లాంటిది" కొన్ని కొన్ని విషయములు వారు చెప్పకుండానే మనము తెల్సుకోవాలి. వాళ్ళకు తోటి పిల్లలకు లాగే చక్కగా చదువుకొని తల్లితండ్రుల ప్రేమను, ఆప్యాయతను పొందాలని ఉంటుంది. కాని వాళ్ళకు ఆ చిన్ని కోరికలు గూడ నెరవేరవు. చిన్నపిల్లలు దేవుడితో సమానము. వాళ్ళలో కలతలు, కల్మషము ఉండవంటారు. కాని వారిని ఎంత మంది ఆప్యాయతతో పలకరించి ఆదరణ చూపుతున్నారు? అనకాశ మొస్తే వాళ్ళ చేత వెట్టి చాకిరి



చేయించుకొని, నాలుగు చిల్లర డబ్బులు విదల్చడము తప్ప. ఇక కొంతమంది బిడ్డల్ని కనేసి తమ బాధ్యత నేరవేరినట్లు చెత్తకుండీ వద్ద పడేస్తుంటారు. ఇలాంటి ఎంత మంది అనాథలు అడుక్కుంటున్నారో తెలీదు. "కొంత మంది పిల్లలు దొంగతనాలు చేసి బాలనేరస్తులుగా జైలుకు వెళుతున్నారు." దీనికంతటికి బాధ్యులు ఎవరు? ప్రభుత్వము ఈ విషయము పట్టించుకొని వాళ్ళకు కొన్ని ప్రత్యేక గృహాలు నిర్మించి, వారికి విద్యాబుద్ధులు నేర్పించి వారిని ఎంతో ఉన్నతముగా తీర్చిదిద్దాలి. ముఖ్యముగా మన కార్మికులు, ప్రతి ఒక్క కుటుంబములో ఒకరిద్దరు పిల్లలకన్న ఎక్కువ ఉండకుండా జాగ్రత్త పడాలి. వారి చేత చిన్నప్పటి నుంచే కూలి పనులు చేయించకుండా విద్యాబుద్ధులు నేర్పించి, ఉన్నతముగా తీర్చిదిద్దితే ఎక్కడా అనాథ బాలలు, వెట్టి చాకిరి చేసే చిన్నారులు మనకు కనపడరు.

-టి. మీనాక్షి
విశాఖపట్టణము

# మొక్కగా ఉన్నప్పుడే

**మే**ము ఇంగ్లండ్‌లో ఉన్నప్పుడు మా యింటి ప్రక్కనే ఒక అబ్బాయి ఉండేవాడు. చాల అల్లరిగా, తుంటరిగా ఉండే వాడు. ఆ అబ్బాయి చేస్తున్న అల్లరి పనులు చికాకు కలిగించేవి. ఆ తల్లి తన కొడుకుకి బుద్ధి చెప్పదా అనుకొని, ఆ అబ్బాయిని వాళ్ళ అమ్మ గురించి అడిగితే, 'మా అమ్మ వేరే అతనితో లేచి పోయింది' అని చెప్పాడు. అప్పటి నుండి ఆ అబ్బాయి మీద కోపం వచ్చేది కాదు పుట్టెడు జాలి కలిగేది.

ఈనాటి పిల్లలు రేపటి పౌరులు అన్నది ప్రతివారికి తెలుసు ఆ రేపటి పౌరులు నీతిగా, నిజాయితీగా, మంచిగా బ్రతకాలి అంటే ఈ నాటి నుండి తల్లిదండ్రులు వారిని జాగ్రత్తగా పెంచాలి. ఇంటిలోని వాతావరణం, బయటి వాతావరణం కూడ బావుంటే పిల్లలు బుద్ధిమంతుల్లా తయారవుతారు. ఇంటిలో వాతావరణం బావుండడానికి తల్లిదండ్రులు కృషి చేయవచ్చు, కాని బయటి సంఘం, అమ్మ ఒడిలాగ ఉండదు. బడిలో రకరకాల మనస్తత్వాలు గల పిల్లలుంటారు. మన పిల్లలను చెడు దారిలో నడిపించే వారుంటారు. అందుకే యింటి దగ్గర తల్లి దండ్రులే మొదటి గురువులై పిల్లలకు పాఠాలతో పాటు, మంచీ చెడు తెలియ జెప్పాలి. వారి పసిమనసు లకు అర్థమయ్యేలా చెబితే చాలవరకు వారి మనసుల్లో చెడు ముద్ర పడకుండా ఉంటుంది. పాడై పోయిన పిల్ల లందరి తల్లిదండ్రులు, వారికి మంచి చెప్పడం లేదు అనుకోవడం కూడ చాల తప్పు. ఏ తల్లి దండ్రులూ తమ పిల్లలు చెడు మార్గంలో నడవాలని కోరుకోరు. పిల్లల్ని అతిగారాబం చేయడం, అతిగా క్రమ శిక్షణలో పెట్టడం కూడ మంచిది కాదు.

విదేశాలలోని పిల్లలకు తల్లి దండ్రుల ప్రేమ తక్కువ పైగా సవతి తండ్రుల బాధ ఎక్కువ. తమ తండ్రి ఎవరో తెలియని పిల్లలు కోకొల్లలు అక్కడ. ఇక్కడ అటు వంటివి తక్కువైనా అనాథలు ఎక్కువ. అనాథలు తల్లి దండ్రుల గురించి పడే తపన ఎవరూ తీర్చలేనిది. ఇటువంటి







వారికి సంఘం మీద కసి, కోపం కలిగినా మనం ఆశ్చర్య పోనక్కరలేదు. ఒక్క చెడ్డ పిల్లవాడు మరెంతో మందిని చెడ్డవారిగా తయారు చేయగలడు. అందుకే ప్రతీ వారిని అతి జాగ్రత్తగా పెంచితే సంఘం మంచిగా శోభిల్లుతుంది.

పిల్లలలో పండిత పుత్ర, పరమశుంఠలు ఉండవచ్చు. గంజాయి వనం లాంటి యింట్లో తులసి పుట్ట వచ్చు. పసి మనసులపై మంచి చెడుల ప్రభావం చాల ఉంటుంది. మొక్కగా ఉన్నప్పుడు వారి మనసు మంచి వైపు పయనించేటట్లు చూడడం, తల్లి దండ్రుల బాధ్యత. ఎవరో వస్తారు, ఏదో చేస్తారు అన్నది అవివేకం. ప్రతీ పిల్లలకి తల్లిదండ్రులే బంగారు బాట వెయ్యాలి. ఒక మంచి ఉపాధ్యాయుడు వేలాది మంది విద్యార్థులను మంచిగా తీర్చి దిద్దినట్లే ఒక మంచి బాలుడు ఎంతో మందిని తన మార్గంలో పయనింప జేయగలడు.

—శ్రీమతి జి. కస్తూరి ప్రసాద్,
విశాఖపట్నం

# చీకటి నుండి వెలుగులోకి

"**సం**ధ్యా!! ఇదిగో ఇదీ నా జీతం. నా ఖర్చులకంటూ ఓ యాభై తీసుకొన్నాను. మిగతా ఏడొందలయాభై నీకిస్తున్నా. ఇందులో నీవు మిగిలిస్తే ఫర్వాలేదు. కానీ ఖర్చు మాత్రం మించనీయకు" అంటూ కవరందించాడు రాజు.

ఆ రోజు ఫర్ట్‌ఫస్ట్ కావడంతో, అందులోనూ భార్య కాపురాని కొచ్చాక అందుకొన్న జీతం కావడంతో, ఆమెకే ఆ బాధ్యత వప్పజెప్పేశాడు. భర్త తన మీదుంచిన గౌరవానికి మనసులో ఎంతో పొంగిపోయింది సంధ్య. అందుకు తగ్గట్టే పొదుపుగా వ్యవహరించి కూడబెట్టేది. ఇలా ఆర్నెల్లు గడిచిపోయాయ్.



ఓ రోజు, రాజు ఆఫీస్ నుండి ఇంటికి రాగానే "మిమ్మల్నడగకుండా ఓ పని చేశానండి" అంది ఎదురొస్తూ.

"ఏంటబ్బా అది" ఆశ్చర్యంగా అడిగాడు రాజు.

"ఇందాక ఓ కుటుంబం అడుక్కొంటూ వచ్చారండి. వరదల్లో తల్లీ తండ్రీ పోయార్ట. ఒంటరిగా మిగిలిన ఓ కుర్రాణ్ణి వెంటబెట్టుకొచ్చారు వాళ్ళు. మా పిల్లాడిలాగే చూసుకొంటాం-ఇంట్లో పనీ-పాటా చేసేందుకు ఓ పిల్లాడి అవసరంవుంది. మరి ఉంచేస్తారా అని అడిగాను. అందుకు వాళ్ళు ఒప్పుకొన్నారు గూడా. మనం వాడిని పనివాడిలా కాక చదువు సంధ్యా చెప్పించి యింట్లో వుంచుకొందామండి" అంది సంధ్య.

రాజుకి ఆమె మాటలు అద్భుతంగా తోచాయ్. "సంధ్యా! నీలాంటి చల్లటి మనసున్న ఓ పెద్దమనిషే-అనాథనైన నన్ను ఆదరించి విద్యాబుద్ధులు చెప్పించాడు. భార్య సణుగుతున్నా-ఈనాడు యిలా నా కాళ్ళమీద నేను నిలబడగలిగానంటే ఆయన చలవే. లేకుంటే ఏ దొంగగానో, భిక్షమెత్తుకొంటూనో, లేక సంఘ విద్రోహిగానో మారి వుండేవాడిని. నువ్వు ఓ పసివాడి భవిష్యత్తు పాడుకాకుండా బాధ్యత వహిస్తున్నానంటే నాకు అంతకన్నా ఆనందం ఏముంది? అసలు నా జీతంలో నా ఖర్చుల కోసం తీసుకున్నవి నేనేం చేస్తానో తెలుసా? ఓ పేద విద్యార్థి చదువు నిమిత్తమే ఖర్చు చేస్తాను.

సంధ్యా! మంచి మనసున్న నీవు నా ఇల్లాలు కావడం నేను చేసుకొన్న పుణ్యం. అందరూ నీలాగే వుంటే చిన్నారి బాలలకు ఎలాంటి అవస్థలూ వుండవు. పేవ్‌మెంట్లమీద బతుకుతూ, ఎండా వానలని లేకుండా జీవచ్ఛవంలా బ్రతికిన రోజులు నేనింకా మరిచిపోలేదు సుమా" అన్నాడు.

"పోనీలెండి. ఒకరు మీకింత సహాయం చేశారు. మంచి రోజులొచ్చాయని గర్వించకుండా మీరూ ఓ [illegible] చేరదీస్తే [illegible] మనకి మంచే [illegible]గుతుంది" అన్నది సంధ్య.

—వాలి హిరణ్మయీదేవి,
హైదరాబాద్. □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు :........................................
పూర్తి చిరునామా :........................................
........................................
........................................
పిన్‌కోడ్ :

"రవీ.... ప్రశాంతంగా కూర్చుని ఆలోచించు.... జరిగిందానికి మీ అమ్మా నాన్న గారు ఎంతో బాధ పడుతున్నారు. గతాన్ని తలచుకుంటూ ఇలా పిచ్చివాడవవుతుంటే వాళ్ళు మరింత బెంగ పెట్టుకుంటున్నారు. ఈ పరిస్థితిలో మీ నాన్నగారు చెప్పిందానికి నువ్వు ఒప్పుకుంటే మంచిది".

రవిని ఎలాగైనా ఒప్పించాలనే పట్టుదల మధుది.

"మధూ! నా మనసు అందుకు అంగీకరించడం లేదు. నా గుండెలో ఇంకా లావణ్య అడుగులు సందడి చేస్తున్నాయి. కళ్ళు మూసినా, తెరచినా లావణ్య కనిపిస్తుంది. లావణ్య మాటలు నా చెవుల్లో మారు మ్రోగుతున్నాయి. లావణ్యను నేను మరచి పోలేను....."

రవి అలా అనగానే చాలా సేపటి వరకు మాట్లాడలేదు మధు. భార్యగా లావణ్య రవిని ఎంత ఆరాధించిందో, ప్రేమించిందో, అనురాగం అందించిందో, భర్తగా రవి లావణ్యను ఎంత అపురూపంగా చూసుకున్నాడో మధుకు తెలుసు. మధు, రవి చిన్నతనం నుంచీ స్నేహితులు.... ఇద్దరికీ ఒకే ఊర్లో ఉద్యోగాలు రావడంతో మరింత దగ్గరయ్యారు.... సాయంత్రం ఆఫీసవగానే మధు భార్యను తీసుకుని రవి ఇంటికి వెళ్ళడమో, రవే లావణ్యతో మధు ఇంట్లో గడపడమో జరిగేది. ఆ రెండు కుటుంబాల మధ్య అరమరికలు, దాపరికాలు లేవు. జంటలుగా సినిమాలకు, షికార్లకు, పిక్నిక్‌లకు వెళ్ళేవారు.....

విధి రవి, లావణ్యల జీవితంలో విషం కురిపిస్తుందని ఎవరూ ఊహించలేక పోయారు.

లావణ్య గర్భవతి..... రవి ఆనందం అంతా ఇంతా కాదు. లావణ్యను మరింత అపురూపంగా చూస్తున్నాడు... మధు భార్య లావణ్యను ఏపనీ చేయనివ్వడం లేదు. దూరంగా ఉన్న రవి, లావణ్యల తల్లితండ్రులు నెలకొకసారయినా వచ్చి చూసి వెళ్ళేవారు...

డెలివరీ టైములో అందరిలో కలవరం....

అమ్మాయా! అబ్బాయా! అని బయట రవి, మధు నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు...

గదిలోంచి పసికూన ఏడుపు.....

రవి ఆనందంగా మధును కౌగలించుకున్నాడు...

ఆనందం అక్షణమే నని తర్వాత తెలిసింది.

డెలివరీ అయిన రెండు గంటలకే, రవిని, తన బిడ్డను కూడా చూడకుండానే కన్ను మూసింది లావణ్య... లావణ్య చనిపోయిందనే నిజం రవికి ఎలా చెప్పాలో తెలియక అందరూ గుండెలవిసేలా ఏడ్చారు....

జరిగిందేమిటో తెలుసుకున్న రవి కొయ్య బారి పోయాడు.

పిచ్చివాడిలా అలాగే నిలబడి పోయాడు ...

రవి ఏమైపోతాడనే భయం మధుది... ఎలా ఓదార్చాలి?

ఒక్క సంవత్సరం మాత్రమే లావణ్య సంసారం చేసింది. కొన్ని యుగాలకు సరిపడినంత ప్రేమ అందించింది లావణ్య. .

లావణ్యను ఎలా మరచి పోగలడు రవి.

భారంగా సంవత్సరం గడిచింది...

రవి అమ్మ పసివాడిని చూసుకుంటూ అక్కడే ఉండి పోయింది. ఇరవై ఆరేళ్ళకే తన కొడుకు ఇలా ఒంటరివాడవుతాడని, ఇలా పిచ్చిగా తయారవుతాడని ఏమాత్రం ఊహించని ఆ తల్లి బాధ వర్ణనాతీతం. ...

"ఒరేయ్ ... మళ్ళీ పెళ్ళి చేసుకోరా"

అని ఓ రోజున తన మనసులోని మాట బయట పెట్టింది.

విరక్తిగా నవ్వేడు తప్ప జవాబివ్వలేదు రవి.

రవి నాన్నగారు కూడా కొడుక్కి రెండో పెళ్ళి చెయ్యాలనే పట్టుదలతో మంచి సంబంధం కోసం తిరగడం మొదలు పెట్టారు.... ఎలాగైతేనేం తెలిసిన వాళ్ళ సంబంధం దొరికింది.

అమ్మాయి పేరు రంజని. .. డిగ్రీ పాసయింది... అందంగా ఉంది... రవికి మంచి జోడీ ... రవి గురించి పూర్తిగ తెలుసుకునే మనస్ఫూర్తిగా ఒప్పుకుంది....

ఆరోజునుండి రవిని రంజనితో పెళ్ళికి ఒప్పుకునేలా చేయడానికి అమ్మా, నాన్న, అటు మధు ప్రయత్నాలు.... ఎవరు ఎన్ని రకాలుగా చెప్పినా రవి తన నిర్ణయం మార్చుకో లేక పోతున్నాడు.

"చూడు రవీ .... లావణ్యను మరచి పోలేవని తెలుసు.... కానీ బాబు సంగతి చూడు. ఇప్పుడంటే ఫరవాలేదు.... వాడికి ఊహ వచ్చింతర్వాత అమ్మ ఏదని అడిగితే నువ్వేం జవాబియ్యగలవు... నీకు భార్య అవసరం కన్నా బాబు భవిష్యత్తుకు అమ్మ కావాలి.... మా కోసం కాకపోయినా బాబుకోసం నువ్వీ పెళ్ళికి ఒప్పుకో... రంజని బాబును కన్న తల్లిలా చూసుకుంటుందనే నమ్మకం మాకుంది .. నీగురించి మీ అమ్మ, నాన్న ఎంతగా విలపిస్తున్నారో చూడు."

"ఒరేయ్... లావణ్యంటే మాకూ ప్రేమే.... అయినా ఏం చేయగలం... ఇలా జరుగుతుందని ఊహించామా! ఏం వయసయి పోయిందని ఇలా తయారవుతున్నావు .. నీ జాతకంలో ద్వితీయ కళత్రం ఉందని చిన్నప్పుడు నవ్వుకునే వాళ్ళం గానీ ఇలా నిజమవుతుందని ఏరోజూ అనుకోలేదు బాబు కోసం నువ్వీ పెళ్ళికి ఒప్పుకో"

మధు, రవినాన్నగారి మాటలు రవిమీద పని చేయలేదు....

రవి అమ్మ ఏడుపుతో మొదలు పెట్టింది.

"నీ కొడుకును ఎన్నాళ్ళు చూస్తానురా! ఎవరికైనా ఇచ్చేస్తావో, నువ్వే పెంచు కుంటావో, ఏ అనాథ శరణాలయంలో చేర్పిస్తావో నీ ఇష్టం '.. ఈ వయసులో ఈ భారం నా మీద వేసుకోలేను... "

అని ఖచ్చితంగా చెప్పింది ...

"నా మాట కూడా అదే . నువ్విలా పిచ్చివాడిగా ఉంటే మేము చూడలేంరా! నువ్వు పెళ్ళి చేసుకుని నవ్వుతుంటేనే నిన్ను చూసేది... లేకపోతే ఎవరికి వాళ్ళు దూరంగా బ్రతుకుదాం ..'

నాన్నగారి మాటలకు రవి అయోమయంలో పడ్డాడు.

"రవీ.... ఒప్పుకో... బాబు కోసం, మీ అమ్మ నాన్నల కోసం... నువ్విలా ఉంటే మాకు మనశ్శాంతి ఏం ఉంటుంది .. ఇప్పుడు బాధగా ఉన్నా రంజని నీ జీవితంలోకి అడుగు పెట్టిం తర్వాత నూర్పు వస్తుంది లావణ్య లేని లోటు రంజని తీరుస్తుంది నీకు భార్యగా, బాబుకు అమ్మగా రంజని నీ కష్టసుఖాలలో తోడు, నీడగా ఉంటుంది...."

మధు అభ్యర్థన

చివరికి ఎలాగైతేనేం రవి రెండో పెళ్ళికి ఒప్పుకున్నాడు. ..

అమ్మా, నాన్న, మధు ఎంతో సంతోషించారు.

★ ★ ★ ★ ★

ఆఫీసు నుండి బయట పడి రోడ్డు మీద నడుస్తూనే ఆలోచిస్తుంది భారతి. తన నిర్ణయం చిన్న కాగితం మీద రాసి మంచం మీద పెట్టి, ఉదయం ఆఫీసుకు బయలు దేరింది. ఈ పాటికి ఇంట్లో అందరూ చదివే ఉంటారు. అందరూ చిందు లేస్తూ ఉంటారు... తను ఇంట్లోకి అడుగు పెట్టగానే విరుచుకు పడతారు.

భారతి అనుకున్నట్టుగానే జరిగింది

'నీకు మతి పోయిందా! పిచ్చి పట్టిందా"

అమ్మ గట్టిగా అరిచింది.

# ఇదీ లోక నీతి

కంచుమర్తి వెంకటేశ్వరరావు



"మొగుడు పోయి సంవత్సరమైనా తిరగలేదు. అప్పుడే పెళ్ళికి తయారయ్యావు... నువ్వసలు ఆడదానివేనా!"

భారతి జవాబివ్వకుండా బట్టలు మార్చుకుని అమ్మమ్మ చేతిలో ఉన్న పాపను తీసుకుంది.

"నిన్నే అడిగేది ... సమాధానం చెప్పవేం"

నాన్న రంకెలు వేస్తున్నాడు

"అదెందుకు సమాధానం చెబుతుంది. ఇప్పటికే ఆఫీసులో తలెత్తుకు తిరగలేక పోతున్నాను ఆ వర్మ గాడితో దీని తిరుగుళ్ళు. నవ్వులకు అందరూ రకరకాలుగా చెవులు కొరుక్కుంటుంటే ఇక ముందు ముందు నేనసలు బయట తిరగలేను."

అన్నయ్య మండి పడుతున్నాడు.....

"మీ రెన్నైనా అనుకోండి.... నానిర్ణయం మారదు."

అని ఖచ్చితంగా చెప్పి పాపతో తన గదిలోకి వెళ్ళిపోయింది భారతి.

మంచం మీద వాలి పాపను గుండెల మీద పడుకోబెట్టుకుని ఆలోచిస్తుంది....

మూడు సంవత్సరాల క్రితం ముచ్చటగా జరిగిన పెళ్ళి రెండు సంవత్స రాలకే ఆ ముచ్చట కాస్త తీరిపోయింది.

రఘుతో పెళ్ళయిన ఆరునెలలకు ఉద్యోగం రావడం.... మరో ఆరు నెలలకు తను తల్లి నవడం... ఇద్దరూ ఉద్యోగస్తులం .. పిల్లలను అందమైన బాటలో నడిపిద్దాం... అని ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నారు.

కానీ.... సంవత్సరం క్రితం స్కూటరు మీద ఆఫీసు నుండి వస్తున్న రఘును లారీ గుద్దితే తనను చూడకుండానే కన్ను మూసాడు....

ఇరవై మూడేళ్ళ వయసుకే తన జీవితం ఇలా ముగుస్తుందని ఏ మాత్రం ఊహించని భారతి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

"నువ్విలా బెంగపెట్టుకుంటే ఎలా! పాపకోసం మామూలు మనిషవ్వాలి" అని ఓదార్చేరు అంతా...

నెల్రోజుల తర్వాత బాధను గుండెల్లో దాచుకుని తిరిగి ఆఫీసుకు వెళుతుంది. ఉదయం, సాయంత్రం పాపతో గడిపేది....

ఒకే ఊర్లో అత్తా, మామయ్యలు, అమ్మా, నాన్నల ఇళ్ళు కావడంతో రోజూ వచ్చి చూసి వెళుతున్నారు.... నాన్న బలవంతం మీద వాళ్ళదగ్గరే ఉండసాగింది.

మూడునెలల తర్వాత భారతి జీవితంలో మార్పు.

ఆఫీసులో కొత్తగా జాయినయిన వర్మ భారతి మనసు పొరల్లో అంత తొందరగా చొచ్చుకు పోతాడని ఎవరూ ఊహించలేదు. స్వతహాగా మితభాషి.... మంచి మనిషి.... నిగర్వి.. అయిన వర్మ భారతి గురించి అంతా తెలుసుకుని ఆమెను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయం తీసుకున్నాడు.

ఆరు నెలలకు తన మనసులోని మాట బయట పెట్టాడు.

"భారతీ.... నీ మీద జాలితో, సానుభూతితో నేనీ నిర్ణయం తీసుకోలేదు.... నువ్వంటే నాకిష్టం... మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను".

భారతి చాలాసేపటి వరకు మాట్లాడలేదు.

"ఆలోచించు భారతీ.... నీకు అంగీకారమైతేనే."

భారతి చాలా రోజులు ఆలోచించింది.

అప్పుడే ఏం వయసయి పోయిందని తను ఇలా మోడులా మిగిలిపోవాలి! తన కోసం హృదయాన్ని ఇస్తానంటున్నాడు! తన పాపకు తండ్రి నవుతానంటున్నాడు. ఇంకా ఏం కావాలి! మగవాళ్ళలో ఇంత మంచి వాళ్ళుంటారా!

ఆలోచించే కొద్దీ భారతి మనసు వర్మ వైపే మొగ్గుతుంది.

'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమ పేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# "ఇదీ లోకనీతి"

తను అంగీకరించవచ్చు.... వర్మ చేయినందించవచ్చు....

ఎందరు హర్షిస్తారు. ఇంకెందరు చీదరించుకుంటారు.

సదాచార కుటుంబం తమది.....

ఇంట్లో అమ్మా, నాన్న అంగీకరించరు .... ఏం చెయ్యాలి!

ఆచారం కోసం, అమ్మా, నాన్నకోసం తన జీవితాన్ని బలి చేయకూడదు... తన జీవితాన్ని తను అందంగా తీర్చిదిద్దుకోవాలి... చివరికి ఓ నిర్ణయానికి వచ్చింది భారతి.

డైరక్టుగా చెప్పితే ఎలా ఫీలవుతారోనని చిన్న కాగితం రాసి ఆఫీసుకు వెళ్ళింది... ఆఫీసులో కూర్చుందే గానీ ఆలోచనంతా ఇంట్లో రేగుతున్న అలజడి గురించే....

"పిచ్చి పిచ్చిగా ప్రవర్తిస్తే సహించేది లేదు"

ఉలిక్కి పడింది భారతి....

మంచం చుట్టూ అందరూ....

"కొడుకు పోయాడని వాళ్ళు బెంగ పెట్టుకున్నారు.... ఇప్పుడు నువ్వేం చేసినా వాళ్ళూ, మేమూ ఈ ఊర్లో తిరగలేం".

"అయినా మన వంశంలో ఇటువంటి పనులు జరగలేదు. వంశగౌరవానికి మచ్చ తెచ్చే ఏపని జరిగినా సహించను".

అమ్మా, నాన్నల మాటలు పూర్తిగ విని మంచం మీంచి లేచింది.

"మీ వంశానికి చెడ్డ పేరు రాకూడదు.... నా జీవితం ఇలా రాలిపోవలసిందేనా" సూటిగా అడిగింది భారతి....

"ఇలా జరుగుతుందని ఎవరూ ఊహించలేదు. అయినా జరిగిపోయింది. ఇప్పుడేం చెయ్యగలం!" అన్నయ్య....

"నాన్నా..... నావయస్సు ఇరవై మూడు.... ఈ వయసులో అన్ని కోరికలు, ముచ్చటలు చంపుకుని బ్రతకమనడం ఏమంత భావ్యం. వర్మ మంచితనం నాకు అందకపోతే ఇలాగే ఉండి పోదునేమో మీరు చెప్పినట్లు. కానీ అతని మంచితనం, త్యాగనిరతి, ప్రేమ నన్ను జీవితంలోకి అడుగు పెట్టమని ప్రోత్సహిస్తున్నాయి...." భారతి మాట సగంలో నే ఆగిపోయింది.

'అందుకు మేము ప్రోత్సహించడం లేదు'.

గట్టిగా అన్నాడు నాన్న.

"మీరు ప్రోత్సహించరని తెలుసు. వయసులో ఉన్న ఆడపిల్లను. బ్రతకాలంటే ఓ తోడు కావాలి. నా పాపకు తండ్రి కావాలి.. తండ్రి లేని పాపగా నలుగురిలో చిన్నబోకూడదు పాప.... నా తోడు, రక్షణకు అతను కావాలి. నా పాపకు తండ్రిగా అతను కావాలి.... తండ్రి ప్రేమను అందిస్తానంటున్నాడు... అంత మంచి మనిషి నీడ నాకు ముందు ముందు దొరకదు ఇప్పుడు దూరం చేసుకుంటే".

భారతి నెమ్మదిగా చెప్పింది.

"నీకు తోడుగా మేమంతా లేమా! పాపను మేము చూడమా"

అమ్మ ప్రాధేయ పడుతుంది.

"నాకు నిజమైన తోడు, పాపకు తండ్రి కాలేరుగా"

"అంటే ఏమిటి నీ మొండి పట్టుదల" చిరాగ్గా అన్నాడు అన్నయ్య.

"ఎవరు ఏమనుకున్నా నా నిర్ణయం మారదు..... దొరుకుతున్న ఆనందాన్ని దూరం చేసుకోలేను..." అని ఖచ్చితంగా చెప్పేసింది భారతి.

"ఛీ.... పాపిష్టి దానా! కుటుంబంలో చెడబుట్టేవు కదే! నీ నిర్ణయం అదే అయితే ఇంట్లోంచి బయటకు వెళ్ళు. నీకు అమ్మా, నాన్న, అన్నయ్య, అత్తా మామయ్యలు ఎవరూ లేరు.... అందరూ చచ్చినట్లే. జన్మలో మాకు ముఖం చూపించకు. నా కూతురు చచ్చి పోయిందని చెప్పుకుంటాం"

అని నాన్న భారతి పెట్టే బేడా గదిలోంచి బయటకు విసిరాడు.

"ఎంత అల్లారు ముద్దుగా పెంచాందీన్ని.... ఆడపిల్లని కూడా ఆలోచించకుండా చదివించాం.... వేలకు వేలు పోసి పెళ్ళి చేసాం.... ఇన్ని చేసినా విశ్వాసం లేకుండా కుటుంబ గౌరవాన్ని మంటగలిపి ఎవడితోనో కులకడానికి వెళ్ళి పోతుంది" అన్నయ్య.

"వెళ్ళమ్మా వెళ్ళు.... నువ్వింకా ఇంట్లో ఉంటే మా పిల్లలకూ చెడ్డ పేరు వస్తుంది... వాళ్ళ పెళ్ళిళ్ళవ్వవు...."

అసహ్యించు కుంటుంది వదిన.

భారతి కన్నీళ్ళాపు కుని పాపను భుజాన వేసుకుని చేతో పెట్టె పట్టుకుని బయటకు నడిచింది...

తలుపులు దభేలు మన్నాయి.

★ ★ ★ ★ ★

బంధు మిత్రుల సమక్షంలో, ఆకాశమంత పందిరేసి, కళ్ళు చెదిరేలా పెళ్ళి పీటలు అలంకరించి, ఆ సరదాలో అందరి చిరునవ్వులు, సంతోషాల మధ్య రంగ రంగ వైభవంగా రవి, రంజనిల పెళ్ళి జరిగింది. మగాడు .... ఎన్ని పెళ్ళిళ్ళ కయినా అర్హుడే అన్న నగ్నసత్యాన్ని లోకానికి చాటి చెబుతున్నట్లుగా ఘనంగా కానుకలందిస్తున్నారు.....

అదే సమయంలో ....

రిజిష్టారాఫీసులో ....

దండలు మార్చుకుని హృదయాలు కలుపుకున్నారు భారతి, వర్మ. ఎన్ని తరాలు మారినా, ఎందరు సంఘ సంస్కర్తలు వెలసినా, ఎన్ని ఆశయాలు వల్లించినా ఆచరణలో ఎందరు ముందుకు వస్తారు... ఇంకెందరు ప్రోత్సహిస్తారు.... హర్షించే వాళ్ళు తక్కువ మంది అనడానికి, ఆశయాలను ఆచరణలో అమలు పరచి ఆశీర్వదించే వాళ్ళు చాలా చాలా తక్కువమంది అనడానికి నిదర్శనంగా నలుగురు స్నేహితులు హృదయ పూర్వకంగా అక్షింతలు జల్లి కానుకలందించారు....

ఇదీ లోకనీతి. 

రాత్రి పది గంట లయ్యింది.

ఆపేటంతా దాదాపు ప్రశాంతంగా ఉంది.

నిద్ర పోతున్నట్టో.... లేక నిద్రకుపక్ర మిస్తున్నట్టో ఉంది. అయితే.... ఆ వీధిలో చకచకా నడుస్తున్న పరశురాం మనసులో మాత్రం ప్రశాంతత లేనేలేదు.

అశాంతి చెలరేగుతోంది.

ఆగ్రహం అంచెలంచెలుగా మరుగుతోంది.

ప్రతీకారం జ్వాలలా మండుతోంది.

చీకటిగా ఉంది బజారు.

నిర్మానుష్యంగా ఉంది.



ఛటుక్కున జేబులోంచి ఓ వస్తువును తీశాడు.

బటన్ ప్రెస్ చేశాడు.

టక్! మంటూ విచ్చుకుంది కత్తి.

తళతళా మెరుస్తోంది.

మౌనంగానే వికటాట్టహాసం చేశాడు పరశురాం.

# రాక్షసి! నాన్నగారి ప్రేయసి!

## వడ్లమన్నాటి కుటుంబరావు




ప్రెస్ బటన్ నైఫ్‌ని ముడిచి నిర్లక్ష్యంగా జేబులో వేసుకున్నాడు.

పుట్టి పెరిగిన ఈ పంథొమ్మిదేళ్ళలో.... తను ఎవరికీ అపకారం తలపెట్టలేదు.

కనీసం ఎవరినీ తిట్టలేదు.

సౌమ్యుడు....! సాధుజంతువు... ! అసమర్థుడు లాంటి బిరుదులు సంపాయించాడు.

తను బి. ఎస్. సి. ఫైనల్ యియర్ అంటే ఎవరూ నమ్మరు!

అంత అమాయకంగా ఉంటాడు తను.

అలాంటిది. తను... ఏకదాటిగా.... ఓ గొప్ప పని చెయ్యబోతున్నాడు.

అది అలాంటి లాంటి అల్లాటప్పా పనికాదు.

ఆషామాషీ పని అంతకంటే కాదు.

నాన్న పాలిట శనిగ్రహంలా.....

అమ్మ పాలిట పిశాచంలా....

తమందరి పాలిట భయంకర మైన పీడ కలలా....

దాపురించిన . .. ఓ ఆడదాన్ని....

ఓ ఉంపుడుగత్తెని....

నాన్న చిన్నిల్లుని....

సమూలంగా నిర్మూలించెయ్యటం..... !

అంటే.....

పచ్చిగా చెప్పాలంటే. ..

హత్య చెయ్యటం....!!!

కత్తి పెట్టి కసుక్కున నరికెయ్యటం!

తనా పని చెయ్యగలడా? అన్న సందేహానికి తావు లేదు.

అంతటి ఘాతుకానికి తను ఒడిగట్ట గలడా? అనే ప్రశ్నేలేదు.

ఎందుకంటే....?

నాన్న చిన్నిల్లు గురించి తనకు చెప్తుకుంటూ.... కుమిలి పోతూ. అమ్మ పడే క్షోభ తనింక చూడలేడు. . భరించలేడు.

పతియే ప్రత్యక్ష దైవంగా భావించి.... సేవలు చేసే అమ్మ హక్కును. . అనాయాసంగా అదెవత్తో లాక్కు పోవటం తను సహించలేడు.

నాన్నని అది అంతగా ప్రేమిస్తే.... నాన్న నొదిలి ఉండలేకపోతే... అప్పుడే వివాహం చేసుకుని... నాన్నకి ఇల్లాలయి ఉండాల్సింది.

అంతేగానీ.... ఇప్పుడు నాన్న జీవితంలోకి తిరిగి ప్రవేశించి.. . అమ్మ జీవితంతో చెలగాటా లాడుతుంటే... చూసి ఊరుకోటానికి తనేమన్నా దద్దమ్మనుకుందా?

అసలు నాన్న సరయిన వాడయితే.... ఈ తిప్పలన్నీ ఎందుకొచ్చేవి?

కానీ.... జన్మ యిచ్చిన తండ్రిని తను మందలించలేడు.

ఈ ఒక్క విషయంలో తప్ప.... నాన్న వస్తుతః చాలా మంచివాడు. తనన్నా.... అమ్మన్నా... ఎంతో ప్రాణం



## రాక్షసి! నాన్నగారి ప్రేయసి!

మధ్యలో ఆ రాక్షసి ప్రవేశించి .... నాన్నని– అమ్మకీ తనకీ కాకుండా చేస్తోంది.

అందుకని దాన్ని అడ్డు తొలగిస్తే? అంతా సుఖాంతం! అమ్మ మనసుకు శాంతి కలిగించిన తరవాత తనేమయి పోయినా పరవాలేదు.

ఆలోచనలు ముగిసే సరికి ఆయింటి ముందు కొచ్చాడు పరశురాం.

వీధంతా నిర్మానుష్యంగా ఉంది.

చిమ్మ చీకటిగా ఉంది.

కీచురాళ్ళ రొదలు వినిపిస్తున్నాయి.

చేత్తో వీధి తలుపుల్ని మెల్లగా నెట్టాడు.

చప్పుడు చెయ్యకుండా తెరుచు కున్నాయి అవి.

ఆ రాక్షసి ఇల్లు..... పదడుగులు లోపలిగా ఉంటుందన్న సంగతి అతనికి తెలుసు.

లోపల లైటు వెలుగుతుంటం గమనించి దాని కాంతి తన మీద పడకుండా జాగ్రత్తగా గోడపక్కకు వెళ్ళాడు పరశురాం.

నాన్న గొంతు వినిపిస్తోంది.

అదోలా నవ్వుకున్నాడు.

నాన్న అలా బయటికి రావటం.... తను.... ఒక్కుదుటున కత్తితో దాని మీదకు లంఘించటం..... కసుక్కున పొట్టలో దించెయ్యటం.... పరలోకానికి పంపించెయ్యటం

ఫినిష్!

చెవులు రిక్కించాడు పరశురాం.

"రత్నా! ప్రాణంతో సమానంగా ప్రేమించిన నిన్ను.... ధనవంతుల అమ్మాయిని నేనెక్కడ సుఖపెట్టగలననే భయంతో.... పిరికి తనంతో.... దూరం చేసుకుని పారిపోయాను. నన్ను మరిచిపోయి.... హాయిగా పెళ్ళి చేసుకుంటా వనుకున్న నా నమ్మకాన్ని వమ్ముచేసి.... అజన్మ బ్రహ్మచారిణిగానే ఉంటా వనుకోలేదు. హాబీకోసం ఉద్యోగం చేస్తూ.... ట్రాన్స్ఫరు మీద ఇక్కడకొచ్చి.... మళ్ళ నాజీవితంలో తారస పడతా వనుకోలేదు. ఇక్కడికొచ్చిన ఈ అర్నెల్లలో నాకెంతో ఊరట కలిగించావు. ఆర్థికంగా నన్నెన్ని విధాలో ఆదుకున్నావు. నీ ఈ పరిస్థితికి కారకుణ్ణి నేను. నువ్వు.... నావల్ల జీవితంలో అమరసుఖాల్ని త్యాగం చేశావు. ఇక్కడ కొచ్చిన తరవాత కూడా స్త్రీ సహజమైన సిగ్గు వల్ల నోరువిప్పి అడగలేక పోతున్నావు. ఇంకా ఊరుకుంటే..... నేను నీపట్ల కృతఘ్నుణ్ణి అవుతాను. రా! రత్నా! ఆనందాకాశంలో... సుఖాల ఉయ్యాల లూగిస్తాను. రా!"

కుతకుత ఉడికి పోయాడు పరశురాం. కన్న తల్లి ఈవిషయంలో ఎందుకు పరితపించి పోతోందో అర్థమయ్యిందతనికి.

'కిటికీ చువ్వలు వంచేసో.... తలుపులు పగల గొట్టేసో.... లోపలికి ఉరికి ... దాని మెడ కొరికేస్తే.... ?' అని పించిందతనికి.... ఆ ఆగ్రహంలో.

"మూర్తీ! నన్ను కాదని వెళ్ళి పోయి.... నువ్వు నాగుండెల్లో రగిల్చిన చిచ్చు.... ఇంకా ఆరకుండా మిగిలే ఉంది. ఇంత వరకూ శారీరకంగా పవిత్రంగా ఉన్న మన ప్రేమని.... ఈ పాడు పనితో కళంకితం చెయ్యకు. నిన్ను నీ భార్య దైవంలా చూసుకొంటోందని నువ్వే ఎన్నోసార్లు చెప్పావు. ఆమె గుండెల్లో కుంపటి వెలిగించకు. నేనునీకు ఆర్థికంగా సాయం చేయటం కేవలం స్నేహధర్మం మాత్రమే.

పోతే .. ఒకనాటి ప్రేమికురాలిగా నేను నిన్నో మాట అడుగుతున్నాను. నీకు కృతజ్ఞత ఉంటే ఇవ్వు."

"ఏమిటది రత్నా?"

"నువ్వు నాకు తరచు కనిపిస్తూ మనశ్శాంతి కలిగిస్తుంటే అదే చాలు నా జీవితానికి. నీ భార్య – నేను – తన పంటంటి జీవితాన్ని దోచుకుంటున్నానని... మీ అబ్బాయి తన నాన్న దగ్గర డబ్బు దోచుకుంటున్నానని.... నిందించకుండా చూడు"

"రత్నా! రత్నా! నా కాళ్ళు చేతులు కట్టెయ్యకు."

"మూర్తీ! ఆగు. నా మీద నీకే మాత్రం ప్రేమ ఉన్నా ... నా శరీరాన్ని తాకటానికి ప్రయత్నించకు. ఒకవేళ మొండి పట్టు పట్టావో... ఆ కిటికీలో ఉన్న విషం సీసా... నీ ప్రేయసి రత్నని క్షణాల్లో శవంగా మార్చెయ్యగలదు. దయచేసి వెళ్ళు!"

క్షణాల్లో తలుపులు తెరుచుకున్నయి.

పక్కనే ఉన్న క్రోటన్ గుబుర్ల వెనక నక్కాడు పరశురాం.

హడావుడిగా నాన్న వెళ్ళగానే ఇవతలికి వచ్చాడు.

"ఎవరదీ?" అంది రత్నబాల – భయంగా.

"నేను" అంటూ అమాంతం ఆమె కాళ్ళ మీద పడిపోయాడు పరశురాం. కన్నీటితో అభిషేకం చేశాడు... ఆమె పాదాలకి.

మ్రాన్పడిపోయిన రత్న "ఏమిటి నాన్నా?

పరశూ! ఈ వేళప్పుడెందు కొచ్చావ్? ఎందుకిలా ఇదయిపోతున్నావ్?" లేవనెత్తి ... నెమ్మదిగా నడిపించుకుంటూ వెళ్ళి మంచం మీద కూర్చో పెట్టింది. గ్లాసుతో మంచి నీళ్ళిచ్చింది. తాగటం పూర్తి చేసి... వెక్కుతూనే విషయమంతా చెప్పాడు పరశురాం.

వేదాంతిలా నవ్వుతూ అంది రత్న "పొరపాటు చేశావు పరశూ! నువ్వనుకున్నట్టు కానిచ్చి ఉంటే ... అందరి సమస్యలకూ పరిష్కారం లభించి ఉండేదేమో?"

"పిన్నీ! నన్నింకా చంపకు" ఆమె చేతుల్ని తన తల మీదపెట్టుకుంటూ అన్నాడు పరశురాం.

"ఇలాంటి దేవతా మూర్తినా..? నాన్నగారి చిన్నిల్లు! ఉంపుడుగత్తె! లాంటి అసహ్యమయిన భావాలతో ఊహించుకున్నాను. ఇప్పుడే వెళ్ళి అమ్మకు చెపుతాను. నీ పట్ల ఆమె ఊహలు తప్పు. మంచి పిన్నిగా నీకు మా ఇంటికి రాకపోకలు ఏర్పాటు చేస్తాను.... వస్తాను" అంటూ దూకుడుగా వెళ్ళిపోయాడు పరశురాం.

"బాబూ! నువ్వు పసివాడివి. ఆవేశంతో ఏదో చేసెయ్యాలని తపనపడుతున్నావు. కానీ... ఇది. లోకం! కళ్ళకు పసర్లు కమ్మిన లోకం! దాని కంటికి నువ్వూ... నేనూ ... అందరం... పచ్చరంగుగానే కనిపిస్తాం... హు!" అదోలా అనుకుని నిర్లిప్తంగా నిట్టూర్చింది రత్నబాల. □

# హైదరాబాదు నోట్‌బుక్

## శ్రీ మాహేశ్వర యోగ భారతి సంస్కృత సేవ :-

మాహేశ్వరయోగ భారతి శివరాంపల్లిలో వున్న సాంస్కృతిక సంస్థ. ఇది పదహారు సంవత్సరాలుగా యోగ ధ్యాన జ్ఞాన తరగతులను నిర్వహిస్తున్నది. ఈ సంస్థ ఉపాధ్యక్షులు విద్వద్వరేణ్యులు శ్రీ పంతంగి వేంకటేశ్వరశాస్త్రిగారు. ఈయన ఈ సంస్థ పక్షాన సంస్కృత కక్ష్యలు నిర్వహిస్తూ భారతీయ విద్యాభవన్ సరళ సంస్కృత భాషా పరీక్షలకు విద్యార్థులను సిద్ధపరుస్తున్నారు. ఈయన ఉదయం ప్రకృతి చికిత్సా బోధన కళాశాలలో పార్ట్ టైమ్ ఉపన్యాసకులుగా, మధ్యాహ్నం అల్వాలలోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా, సాయంకాలం నగరంలోని వివిధ ప్రాంతాలలో సంస్కృత బోధకులుగా పనిచేస్తారు. ఆదివారాలు కూడా విశ్రాంతి ఎరుగని కర్మనిష్ఠులు. ఈ విధంగా ఈయన శిక్షణలో భారతీయ విద్యాభవన్ సరళ సంస్కృత భాషా పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణం జులై 7వ తేదీన శాలిబండలోని భారత గుణవర్ధక సంస్థ గ్రంథాలయ భవనంలో జరిగింది. ఈ సమావేశానికి భారత గణాంక శాఖ సహాయ గణాంకాధికారి శ్రీ రామారావు కామాతీ అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా శ్రీ తిరుమల రామచంద్ర పాల్గొన్నారు. ప్రారంభంలో మాహేశ్వర యోగ భారతి కార్యదర్శి శ్రీ వి. లక్ష్మీకాంతరావు స్వాగతం చెబుతూ అధ్యక్షులను, ముఖ్య అతిథిని పరిచయం చేశారు. తమ సంస్థ పదహారు సంవత్సరాలుగా 1300 మంది విద్యార్థులను సరళ సంస్కృత పరీక్షలకు పంపి, ఉత్తీర్ణులను చేసిందని అన్నారు. శ్రీ రామారావు తమ అధ్యక్షోపన్యాసంలో సంస్కృతం, భారతీయ సంస్కృతి సంపద ప్రాధాన్యాన్ని గురించి ప్రసంగించారు. విద్యార్థులు సంస్కృతాన్ని శ్రద్ధగా అభ్యసించాలని కోరారు. శ్రీ పంతంగి వేంకటేశ్వర శాస్త్రి ప్రసంగిస్తూ విద్యార్థులే నా జీవితం. బోధనే నా కర్తవ్యం. అది లేనిదే నేను జీవించలేను. విద్యార్థులు ప్రమాణపత్రాల దృష్టితో (సర్టిఫికెట్‌ల దృష్టితో) కాక జ్ఞానం కోసం, భారతీయ సంస్కృతిని తెలుసుకొనడం కోసం, ఆత్మ వికాసం కోసం సంస్కృతం చదవాలని హితవు చెప్పారు. జ్ఞానానికి ఎప్పుడూ మితిలేదని అన్నారు. శ్రీ తిరుమల రామచంద్ర తమ ప్రసంగంలో సంస్కృతం అతి ప్రాచీన భాష అని, వేదం ఆర్యుల, బహుశా మానవజాతి తొలి వాఙ్మయమని, దానిలోని విజ్ఞానాన్ని తెలుసుకొనడానికి సంస్కృత భాషాధ్యయనం అత్యవసరమని, సంస్కృతంతో పాటు ప్రాకృత భాషనూ నేర్వాలని సూచించారు. భారత గుణవర్ధక సంస్థ సహాయ కార్యదర్శి శ్రీ కాళిదాసు తమ ప్రసంగంలో విద్యార్థులు ఎన్ని ఎక్కువ భాషలు నేర్చితే అన్ని ప్రాంతాలలో గౌరవం పొందగలరని అన్నారు. పిదప శ్రీ తిరుమల రామచంద్ర సరళ సంస్కృత భాషా పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థినీ విద్యార్థులకు ప్రమాణపత్రాలు అందజేశారు. శ్రీ రామారావు కామాతీగారు విశిష్ట విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు. తర్వాత శ్రీ మాహేశ్వర యోగ సంస్థ పక్షాన, విద్యార్థుల పక్షాన శ్రీ పంతంగి వేంకటేశ్వర శాస్త్రిని, శ్రీ తిరుమల రామచంద్రను సన్మానించడం జరిగింది. మాహేశ్వర యోగ భారతి సహాయ కార్యదర్శి శ్రీ డి. కృష్ణమాచార్యుల ధన్యవాదాలతో సమావేశం సమాప్తమైంది.

## వానలు చేసిన మేలు:-

జూలై మొదటి వారంలో జంటనగరాలలో పడిన వానలకు హైదరాబాద్ నగర పాలిక ఎంతో కృతజ్ఞత చూపాలి. ఎందుకంటే, నగరపాలిక పనిని వానలు చేశాయి. వానల వల్ల ప్లాట్‌ఫారాల మీద మెట్టుగా పడిన చెత్త కొట్టుకుపోయి. చాలా చోట్ల సగం రోడ్డును కప్పి వేసిన పెంటకుప్పలు కరిగి కొట్టుకుని పోయి రోడ్ల అస్తినాస్తి విచికిత్సా హేతువులు అయాయివానలు. కొన్ని చోట్ల సగం సగం మిగిలినా, మరి రెండు వానలు పడితే ఫరవాలేదు. రోడ్లు ఏనాటికైనా కనిపిస్తాయనే విశ్వాసం తత్ప్రాంత వాసులకు కలిగింది. దేనికైనా విశ్వాసం ముఖ్యం కదా! విశ్వాసంతో కొండలనైనా కదలించవచ్చు నన్నప్పుడు చెత్తకుప్పలను కదలించడం ఒక లెక్కా! ఎప్పటికైనా ఈ "సుందర నగరం" నిజంగా సుందరమవుతుందనే విశ్వాసంతోనే బతుకుతున్నామండీ అన్నారు ఒక గాంధీనగరమనే గొప్పవాళ్ళ స్థలం నివాసి. ఈ వానల దెబ్బకు మురుగు కాల్వలు కూడా మహా వేగంతో అడ్డమాక లేకుండా ప్రవహించి గమ్యం చేరి నగర పాలికాధికారులకు మేలు చేశాయి. పాత గోడలు కూలిపోయాయంటే, అది వాన తప్పుకాదు. పాతవి ఎప్పటికైనా కూలిపోయేవే. అదీ ఒకందుకు మేలే. నగర పాలికాధికారులు దాని కోసం చర్య తీసుకొనే బాధ తప్పింది.

ఇటీవల హుబ్లీ ఆంధ్ర కళామండలి వారు మిమిక్రీ కళాకారుడు శ్రీ సిల్వెస్టర్ (సిల్వర్ స్టార్)ను ఘనంగా సన్మానించిన సందర్భంలో "సర్వ స్వరబ్రహ్మ" బిరుదు ప్రదానం చేస్తున్న ధార్వాడ్ పోలీసు సూపరింటెండెంట్ శ్రీ అచ్యుతరావు. మధ్యనున్న వారు సంస్థ అధ్యక్షులు శ్రీ పి. ఎస్. మణి.



## హిందీని రుద్దమని శ్రీ పాణిగ్రాహి అభయం:-

కేంద్ర దేశీయాంగ శాఖ, అధికార భాషా శాఖల యాజమాన్యాన జూలై 7వ తేదీన జరిగిన ప్రాంతీయ అధికార భాషా మహాసభలో కేంద్ర దేశీయాంగ శాఖా సహాయ మంత్రి శ్రీ చింతామణిపాణిగ్రాహి ప్రసంగిస్తూ, హిందీని అధికార భాషగాను, సంధాన భాషగాను అంగీకరించే వరకు ప్రాంతీయ భాషలను గౌరవించడం కొనసాగుతుందన్నారు. నానాత్వంలో ఏకత్వమనేది భారతదేశపు అపూర్వ లక్షణం. ఈ లక్షణాన్ని కాపాడడంలో భాష ప్రధాన పాత్ర వహించింది. కొంతకాలంపాటు సంస్కృతం ఈ పాత్రను నిర్వహించింది. ఇప్పుడు ఆ స్థానంలో హిందీ వచ్చింది. దక్షిణ భారత భాషలతో పాటు ఇతర భాషల పాత్రా ఉంది. హిందీని సంధాన భాషగా చేసుకోము అని ఆయా రాష్ట్రాలు తమ విధాన సభల ద్వారా నిర్ణయించే వరకు ఇంగ్లీషు సంధాన భాషగా వ్యవహరిస్తుంది. హిందీని బలవంతంగా రుద్దడం జరుగదు - అని అన్నారు. ఈ మహాసభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర గవర్నర్ తమ ప్రసంగంలో భారత ప్రజా సామాన్యానికి హిందీ సమస్య ఏమీ కాదని, కొందరికి మాత్రం ద్వేషమని అన్నారు. హిందీని అధికార భాషగా చేయడానికి ముందు స్థానిక ప్రజల విశ్వాసం చూరగొనాలని ఆమె కేంద్రప్రభుత్వానికి సలహా యిచ్చారు. హిందీని బలవంతంగా రుద్దబోమని శ్రీ పాణిగ్రాహి వంటివారు ఇదివరకు చెప్పారు. ఇప్పుడు చెబుతున్నారు. ఈ చిలుకపలుకులకు విలువ లేదనడానికి కేంద్రప్రభుత్వ నూతన విద్యా విధానమే తార్కాణం. అది అమలు అయితే ప్రాంతీయ భాషలు పూర్వపు నిజాం ప్రభుత్వంలో ఉరుదూ పెత్తనం స్థానిక భాషలు పొందిన నీచ స్థితికన్నా నీచాతి నీచ స్థితికి దిగజారగలవనడంలో సందేహంలేదు. కనుక దక్షిణ ప్రాంత ప్రజలు, తూర్పు ప్రాంత ప్రజలు ఒళ్ళంతా కళ్ళతో ఉండాలి.

## ఉపశ్రుతి :-

తాతా! తాతా! ఇంద్రజిత్తు అంటే ఏమిటి అర్థం?- అన్నాడు మనమడు ఉదయన. ఇంద్రుని జయించినవాడు అన్నాను. అయితే నక్క జిత్తు అంటే ఏమిటి?- అని మరొక ప్రశ్నవేశాడు. అది వేరే భాష. ఇది వేరే భాష. నక్కను జయించిన వాడు కాదు, నక్క యుక్తి అని మాత్రమే అర్థం - అన్నాను. అబ్బాయీ! ఆ నక్కల జిత్తులు నీకెందుకు? రాజకీయ నాయకులకు ఉండనివ్వు - అన్నారు పక్కన వున్న ఒకపెద్దమనిషి.

- తిరుమల రామచంద్ర

## హైదరాబాదు నోట్‌బుక్

### వైభవోపేతంగా దివాకర్ల వారి 75 వ జన్మదినోత్సవం –

ఆచార్య సత్తములు మహావక్తలు ప్రాచీన సాహిత్య ప్రచారకులు వినయ భూషణులు అయిన డాక్టర్ దివాకర్ల వేంకటావధాని 75 వ జన్మ దినోత్సవాన్ని ఆయన శిష్యులు అభిమానులు బంధు మిత్రులు జులై 10 11 వ తేదీలలో త్యాగరాజ గానసభలో ఘనంగా జరిపారు జయంతి నిర్వాహక సంఘం అధ్యక్షులు శ్రీ ఎం వి నారాయణరావు స్వాగతం చెబుతూ తమకు ఆచార్య అవధానితో దాదాపు అర్థశతాబ్దిగా గల పరిచయాన్ని వివరించి డాక్టర్ అవధాని చేసిన సేవకు స్మారకంగా రాష్ట్రంలోని ప్రతి విశ్వవిద్యాలయంలోను ఒక ఆచార్య పీఠం వక్తృత్వపు పోటీలలో బంగారు పతకం విశ్వవిద్యాలయాల్లో ప్రథములుగా వచ్చిన వారికి బహుమతులు ఒక పఠనాలయం ఏర్పాటు చేయదలచామని వీటిలో కొన్నిటికి రాష్ట్ర ముఖ్యమంత్రి అంగీకరించారని అన్నారు తొలి నాటి సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పైడిగంటం కోదండరామయ్య తమ ప్రసంగంలో డాక్టర్ అవధాని గుణగణాలను శ్లాఘించారు వారు అర్థ శతాబ్ది సాహిత్య సేవ చేసిన మహనీయులు వారి వదనం ప్రసాద సదనం వారు వాఙ్మయ తపస్సులు సత్యాన్ని హితంగాను ప్రియంగాను చెప్పే వారు తెలుగు దేశమంతా ఆయన వాఙ్మయ సరోవరం ఆయన సాత్త్విక మూర్తి సౌలభ్యమూర్తి పుణ్యశాలి అని విశ్వనాథ సత్యనారాయణగారి నుంచి ప్రశంసలు పొందిన వారు అట్టి ఆ మహనీయునికి భర్తృహరి జయంతి తేసుకృతినో రససిద్ధా కవీశ్వరా నాస్తితేషాం యశః కాయే జరామరణ జం భయం అని అన్నట్టు అవధాని గారికి మరణం లేదు – అని అన్నారు పిదప ఆయన డాక్టర్ అవధాని ఛాయా చిత్రాన్ని ఆవిష్కరించారు ముఖ్యఅతిథి లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు అవధాని గారి స్మారక ప్రత్యేక సంచిక దివాకర ప్రభను ఆవిష్కరిస్తూ ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి సాహిత్య ప్రచార యాత్ర అలనాటి తిరుపతి వేంకట కవుల పద్య యాత్రను తలపిస్తుంది అవధాని గారి ప్రసంగాలు మొదటి నుంచి విన్న వారికి వాటిలో క్రమ పరిణామం కనిపిస్తుంది ఆయన ప్రసంగాలు ఇటీవల ఆధ్యాత్మిక చింతనతో ఉన్నాయి ఆయన సంప్రదాయబద్ధతను వదల లేదు తన భావాలను సౌమ్యంగా చెప్పినా స్పష్టంగా చెప్పేవారు ఆయన రచించిన గ్రంథాలు అమూల్యమైనవి ప్రస్తుతం లభించనివి గనుక పునర్ముద్రించాలి అని అన్నారు పిదప హైదరాబాద్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ సి నారాయణరెడ్డి ప్రసంగిస్తూ తమ గురువర్యులకు నివాళులు అర్పించారు గురువుగారు అవధాని గారి సాహిత్య వ్యక్తిత్వం సముద్రం నా చేత ఉన్నది చిన్న బిందె. దానితో తోడి చూపలేను ఒక చిన్న కోణం మాత్రమే చూపగలను ఆయన మహాశిష్యవత్సలులు నా నలుగురు కుమార్తెల వివాహముహూర్తాలు స్వయంగా పెట్టారు ఆయన ప్రధాన శక్తులు రెండు – ఒకటి అపార వాగ్ధార రెండు అసాధారణ ధారణాశక్తి నిత్య విద్యార్థిగా వుంటూ ప్రాచీన సాహిత్య ప్రచారాన్ని ఉద్యమంగా నడిపారు మూర్తి [illegible] జన్యం ఉపన్యాసాలతో చమత్కా[illegible]లు చేసేవారు – గోదావరి గోదారి గోర అం[illegible]దలుగా ఆముక్తమాల్యద వంటి అయః ఎండాన్ని కూడ సుమపేశలంగా మధుమయంగా చెప్పేవారు అమరోదాత్త మనీషి అని కొనియాడారు డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు ప్రసంగిస్తూ అవధాని గారు సూర్య గోళం వంటి వారు కొందరు సులభమయిన దాన్ని గహనం చేస్తుంటారు అవధానిగారు జటిల మైనదాన్ని వేదబుక్కల నుంచి వేమన వరకు సామాన్యులకు అర్థమయ్యేట్టు చెప్పేవారు నమ్రత ఆయన సొమ్ము ఆయన తాము ఉద్యోగంలో ఉన్నప్పుడు తమ తెలుగు సబ్జక్టులో ఎవరినీ ఫెయిలు చేయలేదు శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః దాతా శత సహస్రేషు వక్తా భవతి వానవా అన్న ప్రాచీనోక్తికి తార్కాణగా మహావక్త ఆయన ధారణ గొప్పది వచన కవితను కూడ వచనం చేసుకొని నిరాఘాటంగా ఉదాహరించే వారు – అన్నారు ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ టి నవనీతరావు ప్రసంగిస్తూ 1952 నుంచి అవధాని గారితో సంబంధం వుందని తాను ఆయన శిష్యుడు కాకపోయినా ఆయనను గురువుగా గౌరవించే వాడినని ఆయన ప్రసంగాలు ఎన్ని సార్లు విన్నా విసుగు కలిగేది కాదని ఆయన మంచి ఉపాధ్యాయుడని అన్నారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆయన పేర ఎండోమెంట్ లెక్చర్సు పెట్టిస్తామని అన్నారు పిదప విజ్ఞాన దీపిక ఆధ్వర్యాన దివాకర్ల వేదిక భువన విజయం సాహిత్య రూపకం ప్రదర్శించింది శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు కృష్ణరాయులుగా శ్రీయుతులు ఉత్పల సత్యనారాయణాచార్యులు పెద్దనగా ధాజన్న శాస్త్రి అయ్యలరాజు రామభద్రుడుగా తిరుమల శ్రీనివాసాచార్యులు పింగళి సూరనగా [illegible] తిరుమల శేషాచార్యులు మాదయగారి మల్లనగా అక్కిరాజు సుందరరామకృష్ణ నందితిమ్మనగా [illegible]తాపతిరావు భట్టుమూర్తిగా మూలా రామమూర్తి ధూర్జటిగా జి వి సుబ్రహ్మణ్యం తెనాలి రామకృష్ణుడుగా వ్యవహరించి రక్తి గట్టించారు జులై 11 న జరిగిన రెండవ నాటి సభకు శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించి తమకు దివాకర్ల వారితో మూడున్నర శతాబ్దాలుగా గల సన్నిహితత్వాన్ని వివరించారు పిదప ప్రొఫెసర్ ఎం కులశేఖరరావు రచించిన సీతాపతి అనే కావ్యాన్ని మహారాష్ట్ర మాజీ గవర్నర్ శ్రీ కోన ప్రభాకరరావు ఆవిష్కరించారు తర్వాత జరిగిన దివాకర్ల సాహితీ సదస్సులో మహావక్త దివాకర్ల అనే విషయమై ప్రొఫెసర్ జి వి సుబ్రహ్మణ్యం మహావ్యక్తి దివాకర్ల అనే విషయమై ప్రొఫెసర్ ఎం కులశేఖరరావు ఆదర్శ అధ్యాపకుడు దివాకర్ల అనే విషయమై ప్రొఫెసర్ వి యశోదారెడ్డి ఉత్తమ విమర్శకుడు దివాకర్ల అనే విషయమై డాక్టర్ వి వి ఎల్ నరసింహరావు సాహితీ రూపకాలు – దివాకర్ల అనే విషయమై డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ ఉత్తమ పరిశోధకుడు అనే విషయమై ప్రొఫెసర్ శలాక రఘునాథ శర్మ ప్రసంగించారు అనంతరం [illegible] ఎస్ ఆర్ కళామందిరం వారు శ్రీకృష్ణ తులాభారం నాటకం ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందింప జేశారు చివరన సంఘ కార్యదర్శి శ్రీ కె వై ఎల్ నరసింహారావు ధన్యవాదా లర్పించారు

( 74 వ పేజీ చూడండి)

ఇటీవల ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వి టి ఎల్ ఎన్ సభా హాలులో మాజీ ప్రో-ఛాన్స్‌లర్ విజయనగరం రాజా శ్రీ పి వి జి రాజాగారి నిలువెత్తు తైలవర్ణ చిత్రాన్ని రాష్ట్ర గవర్నరు శ్రీమతి కుముద్‌బెన్‌జోషి ఆవిష్కరించినప్పటి చిత్రం ఈ సందర్భంగా రాష్ట్ర గవర్నరు శ్రీమతి కుముద్ బెన్‌జోషి చిత్రకారులు ప్రొ నేమాని కృష్ణమూర్తిని సన్మానించారు ఛైర్మన్ ఉన్నత విద్యా కమీషనరేట్ వైస్ ఛాన్సలర్ ప్రొ కె రామకృష్ణారావును కూడా ఈ చిత్రంలో చూడవచ్చు



# "పరుగుల రాణి" పి. టి. ఉష



15వ ఏట (1979లో) ఉత్తమ ...రిణిగా కేరళ ప్రభుత్వ బహుమతిని ...దుకుంటున్న పి టి ఉష

...ాళా రంగములో సంచలనం ...లో యిద్దరు స్త్రీ ప్రముఖులు మొదటిసారిగా ఎన్నికలలో నిలబడి ...ప్పుడు మన స్త్రీలు ఎంతో ... తమ తోటి స్త్రీ దేశాన్ని ...పని ఎంతో గర్వము పడ్డారు తిరిగి ...లో పరుగుల రాణి ...గా ఖ్యాతి నొందిన పి టి ఉష ...తర్జాతీయ క్రీడా పోటీలలో సాధించిన ... సృష్టించిన రికార్డుల గురించి అదే అభిమానం చూపారు

...లువలకండి టిక్కపరంబిలో ఉష 1964లో కేరళలోని పయోలి కుగ్రామములో జన్మించింది ...న్న వయసు నుండి క్రీడల యందు ముఖ్యముగా పరుగు పోటీలలో ఎంతో ప్రతిభ కనపరిచినది కేరళ ప్రభుత్వముచే నడుపుచున్న స్పోర్ట్స్ హాస్టల్సు లో ఆమెను ప్రోత్సాహక క్రీడాకారిణిగా గుర్తించి చేర్చుకున్నారు ఆమెతో బాటు ప్రతిభావంతులైన 40 మంది బాలికలకు ప్రత్యేక శిక్షణ ఇచ్చేవారు 1976లో మొదటిసారిగా ఎథిలెటిక్ కోచ్ ఓ ఎమ్ నంబియారు ఉషను గుర్తించాడు సరియైన శిక్షణ తగిన ప్రోత్సాహము లభిస్తే ఉష జాతీయ స్థాయి క్రీడాకారిణిగా ప్రతిభ చూపకలదని నంబియార్‌కు అభిప్రాయము కలిగినది అప్పటికి క్రొత్తగా కేరళ ...రాష్ట్రములో స్పోర్ట్స్ హాస్టల్సు ప్రారంభించ...డ్డాయి 1978- 79లో ఒక రూపము దిద్దు...న్నాయి మూడేళ్ళ కృషి ఫలితముగా యీ 40 ...ంది బాలికలలో ఏడుగురు జాతీయ స్థాయి ...టీలలో పతకము.. సాధించారు. వారిలో ఉష ఒకర్తె. నంబియార్ ఉషలో ఉత్తమ క్రీడాకారిణికి కావలసిన లక్షణములు చూచాడు. ఓర్పు, పట్టుదల, మనోబలము, కృషి, ఓటమిని ఎదుర్కొను మనోస్థయిర్యం ఆమెలో కనిపించాయి. విజయాలు సాధించాలనే పట్టుదలతో ఎంతో ఓర్పుతో విశ్రాంతి లేకుండా కృషి చేసినది. ఓటమి ఆమె ఎరుగదు.

ఉష తల్లితండ్రుల, కుటుంబ సభ్యుల ప్రోత్సాహం ఉండేది. తండ్రి పైతల్, తల్లి లక్ష్మి తమ రెండవ కుమార్తె ఉష సాధించే విజయాలకు ఎంతో గర్వపడేవారు. ఉషకు ఏ యితర ఆలోచనలు, అలవాటులు, సరదాలు లేవు. ఎంతసేపు క్రీడాంగణములో పరుగెత్తుటలో ఉన్న ఆనందము యితర విషయములలో కనిపించ లేదు. నంబియార్ అన్ని వేళలలో అందుబాటులో యుండి శిక్షణ యిచ్చేవాడు. ఉష కుటుంబములో నలుగురు సోదరీమణులు, యిద్దరు సోదరులు. ఉష రెండవ కుమార్తె. అందరిలో పొడుగరి. మిగిలిన వారికి క్రీడలలో ఆసక్తి లేదు. కేరళలో పల్లెలో యుండుట వలన జాతీయ, అంతర్జాతీయ ఎథలెట్స్, పోటీల గురించి అంతగా తెలియదు. తన తోటి వయసు బాలికలలో తాను ప్రతిభావంతురాలు అని ఆమె అనుకొనేది. నంబియారు ఆమెకు పరుగెత్తుటలో విజయాలు సాధించే మార్గాలని బోధించాడు. మట్టిలో గల మాణిక్యాన్ని తీర్చి దిద్ది ఒక రూపము వచ్చేటట్లు చేసాడు. నంబియారు, గురువు, మిత్రుడుగా యుండి ఉత్సాహము కలిగించేవాడు.

మొదటిసారిగా 1978లో జాతీయ పాఠశాల పోటీలలో పాల్గొని 100 మీ., 200 మీ., పరుగు, 60 మీ. హర్డిల్సు, లాంగ్‌జంప్, హైజంప్‌లలో విజయాలు సాధించి సంచలనం సృష్టించినది. సీనియర్ అంతర్ రాష్ట్ర ఛాంపియన్ షిప్‌లో 100 మీ., 200 మీ., లాంగ్‌జంప్, హైజంప్‌లలో కూడా గెలు పొందింది. కొంత కాలానికి నంబియార్ ఆమె "స్ప్రింట్"లలో మాత్రము పాల్గొనుట వలన జాతీయ స్థాయిలో రికార్డులు నెలకొల్పగలదని ఆశించి "దూకుట" నుండి విరమింప చేసాడు.

1983లో జంషడ్‌పూర్ "ఓపన్" పోటీలలో మొదటిసారి 400మీ. పరుగు 53.6 సెకండ్లలలో పరుగెత్తి విజయం పొందింది. 100మీ., 200మీ., 400మీ., లలో పరుగెత్తుట మంచిది అనిపించింది. కాని జూనియర్‌గా60 మీ., 80 మీ., హర్డిల్సులో చూపిన ప్రతిభ కారణముగా 400 మీ. హర్డిల్సులో ప్రయత్నించింది.

అంతకు ముందు ఢిల్లీలో జరిగిన 1982 ఆసియా క్రీడోత్సవాలు ఉష ప్రతిభను ప్రపంచానికి తెలిపాయి. ఒక్క ఉషే కాదు మన ఎథిలెట్స్ ప్రతిభను చాటినది. అంతకు ముందు ఆసియా క్రీడలకు ఢిల్లీలో మన వారు సృష్టించిన రికార్డులు, విజయాలు కొనియాడ తగినవి.

ఉష 100 మీ., 200 మీ., పరుగులలో స్వర్ణ పతకములు గెల్చినది. అంతకు ముందు సియోలులో నిర్వహించ బడిన జూనియర్

రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ నుంచి అర్జున అవార్డుని అందుకుంటున్న దృశ్యం

